# మొదటి ఇంటర్నేషనల్ : చారిత్రక సమీక్ష


రచన :

**మార్సెల్లో మస్తో**

యార్క్ విశ్వవిద్యాలయం, టోరంటో, కెనడా

అనువాదం :

**సుంకర రామచంద్రరావు**




**మొదటి ఇంటర్నేషనల్ : చారిత్రక సమీక్ష**

సమీక్ష ప్రచురణలు

ప్రచురణ సంఖ్య : 8

ఫిబ్రవరి, 20, 2016

కాపీలు : 500

కవర్ డిజైన్ : గిరిధర్

ప్రతులకు :
**సమీక్ష ప్రచురణలు**
మొదటి అంతస్తు
కృష్ణాజిల్లా స్వాతంత్ర్య సమరయోధుల సంఘం భవనం
బందరులాకులు, గవర్నర్‌పేట
విజయవాడ - 520 002
ఫోన్ : 0866-2578454

ధర : రూ. 50/-

ముద్రణ :
శ్రీశ్రీ ప్రింటర్స్
విజయవాడ - 520 002
సెల్ : 9490634849

# విషయ సూచిక


| | |
|---|---|
| మా మాట | 5 |
| మొదటి ఇంటర్నేషనల్: చారిత్రక సమీక్ష | 7 |
| అనుబంధం | 75 |
| ఉల్లేఖనలు - వివరణలు | 79 |
| పేర్ల సూచిక | 95 |

# మా మాట

అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమంలో మొదటి ఇంటర్నేషనల్ స్థాపన ఒక ప్రధాన ఘట్టం. కార్మిక వర్గ విముక్తికి  కార్మిక వర్గమే చోదక శక్తి కావాలన్న లక్ష్యంతో ఏర్పడిన మొట్టమొదటి అంతర్జాతీయ సంస్థ ఇది. దీనిలో మార్క్స్, ఏంగెల్స్‌లు కీలకపాత్ర పోషించారు. సంస్థ ఏర్పడి 2014 సంవత్సరానికి 150 సంవత్సరాలు పూర్తయ్యాయి. ఆ సందర్భాన్ని పురస్కరించుకొని ఆంగ్లంలోనికి గతంలో రాని కీలకమైన పత్రాలను సంకలనం చేసి, ఒక విస్తారమైన ఉపోద్ఘాతంతో  ఒక ప్రచురణ వచ్చింది. అంతర్జాతీయ యువ మార్క్సిస్టు మేధావి మార్సెల్లో మస్తో సంపాదకత్వంలో ఈ సంకలనాన్ని **వర్కర్స్ యునైట్! ది ఇంటర్నేషనల్ 150 ఇయర్స్ లేటర్** పేరిట బ్లూమ్స్‌బరి ప్రచురణసంస్థ 2014లో ముద్రించింది. కార్మిక వర్గ ప్రస్థానంలో మొదటి ఇంటర్నేషనల్‌కున్న స్థానాన్ని, దానికున్న చారిత్రక పాత్రను లోతుగా సమీక్షిస్తూ మార్సెల్లో మస్తో రాసిన ఉపోద్ఘాతానికున్న ప్రాధాన్యత రీత్యా దాని తెలుగు అనువాదాన్ని ప్రచురిస్తున్నాం.

ఇది సమీక్ష ప్రచురణలు తీసుకువస్తున్న ఎనిమిదో పుస్తకం. 19వ శతాబ్ది నాటికే పెట్టుబడిదారీ ప్రపంచీకరణ ప్రారంభమైంది. ఈ క్రమాన్ని **కమ్యూనిస్టు మానిఫెస్టో** చక్కగా వివరించింది. దీనికి దీటైన స్పందనే 1864లో అంతర్జాతీయ కార్మిక సంస్థ (మొదటి ఇంటర్నేషనల్) స్థాపన. అక్కడి నుండి పెట్టుబడిదారీ విధానం, సోషలిజం మధ్య ప్రారంభమైన పోరు ఇంకా సాగుతూనే ఉంది. కాని ఈ పోరు ముగిసిపోయిందనీ, పెట్టుబడిదారీ విధానానికి ప్రత్యామ్నాయం లేదని 1990ల ప్రారంభంలో నయా ఉదారవాద మేధావులు ఢంకా బజాయించారు. ఇప్పుడు వాళ్ళ వ్యవస్థని చుట్టుముట్టిన సంక్షోభం నుండి బయటపడడానికి మళ్ళీ మార్క్స్‌ని ఆశ్రయిస్తున్నారు. వాళ్ళు మార్క్స్‌ని మళ్ళీ చదువుకుంటున్నట్లు, సోషలిస్టు శక్తులు కూడా మరింత శ్రద్ధగా మళ్ళీ చదువుకోవాలి. ప్రపంచవ్యాప్త పెట్టుబడిదారీ వ్యవస్థ ప్రపంచవ్యాప్త ప్రత్యామ్నాయాన్ని ఎలా సాధించాలో ఆలోచించాలి. ఆయా దేశాలలో కృషితో పాటు, అంతర్జాతీయ సహకారానికి కూడా కృషి జరగాలి. వ్యవస్థలు ఏర్పడాలి. ఇందుకుగాను సోషలిజం

సాధన కోసం 19, 20 శతాబ్దాలలో ఏర్పడిన అంతర్జాతీయ సంస్థల అనుభవాలను మదింపు వేసుకుని, విలువైన వాటిని ఇప్పటి కార్యాచరణకు అన్వయించుకోవాలి. దీనికోసం ఆ సంస్థల సిద్ధాంతాలను, ఆచరణను సమీక్షిస్తూ సాహిత్యం రావాలి. **సమీక్ష** ప్రచురణలు తీసుకువస్తున్న ఈ పుస్తకం ఇందుకోసం కొంతమేరకు ఉపయోగపడినా మా ప్రయత్నం ఫలించినట్లే.

'వివరణలు'లో కొన్నిటికి డాక్యుమెంట్లు వాటి సంఖ్యతో పేర్కొనబడ్డాయి. ఇక్కడ డాక్యుమెంట్లు అంటే మార్సెల్లో మస్తో ఉపోద్ఘాతం (అంటే ప్రస్తుత తెలుగు పుస్తకానికి ఆంగ్ల మూలం) రాసిన **వర్కర్స్ యునైట్! ది ఇంటర్నేషనల్ 150 ఇయర్స్ లేటర్** అనే ఆంగ్ల పుస్తకంలో ఇవ్వబడిన మొదటి ఇంటర్నేషనల్ డాక్యుమెంట్లు. ఈ పుస్తకం వెంటనే అందుబాటులో లేనప్పటికీ, సాంకేతికంగా "వివరణలు" అన్నీ అనువాదం చేయడంలో భాగంగా ఇచ్చాము. అలానే వీటిలో అనేక ఫ్రెంచి, జర్మన్ రచనల ప్రస్తావన ఉన్నది. వాటి అనువాదం కాని, లిపి అంతరీకరణ కాని సాధ్యంకాక ఆయా భాషలలో వచ్చిన పుస్తకాలు అని రాశాము. ఈ రచనలో అనేక మంది చారిత్రక వ్యక్తులు, సిద్ధాంతవేత్తలు, ఉద్యమకారులు ప్రస్తావించబడ్డారు. అందరి గురించీ కాకపోయినా, కొందరు ప్రముఖ చారిత్రక వ్యక్తులు, సిద్ధాంతవేత్తలు, ఉద్యమకారులను క్లుప్తంగా పరిచయం చేస్తూ 'పేర్ల సూచిక' పుస్తకం చివర ఇచ్చాము. పాఠకులు ఈ అంశాలను గమనించవలసిందిగా కోరుతున్నాము.

ఫిబ్రవరి 20, 2016న ఆచార్య నాగార్జున విశ్వవిద్యాలయంలోని శాస్త్రీయ సామ్యవాద అధ్యయన కేంద్రంలో ఉపన్యసించటానికి మార్సెల్లో మస్తో వస్తున్నారు. ఆ సందర్భంగా తేదలచిన తెలుగు అనువాద ప్రచురణను సాధ్యం చేసిన వ్యక్తి సుంకర రామచంద్రరావు. అడిగినదే తడవుగా అతి స్వల్ప సమయంలో మస్తో వ్యాసాన్ని చక్కటి తెలుగులో అనువదించి ఇచ్చినందుకు ఆయనకు ముందుగా ధన్యవాదాలు. వివరణలలో ఉన్న ఫ్రెంచి, జర్మన్ మాటలకు అర్థ వివరణ రాసి ఇచ్చిన ఆచార్య వై. రంగారెడ్డి గారికి ప్రత్యేక కృతజ్ఞతలు. అన్నింటికి మించి తెలుగు అనువాదానికి అంగీకరించిన మార్సెల్లో మస్తోకు మరీ మరీ ధన్యవాదాలు.

తక్కువ సమయంలోనే పుస్తక ప్రచురణ సాధ్యం చేసిన కంపోజర్ శ్రీదేవి గారికి, అందంగా ముద్రించి ఇచ్చిన శ్రీశ్రీ ప్రింటర్స్ విశ్వేశ్వరరావు గారికి ధన్యవాదాలు.

**–సమీక్ష**

# మొదటి ఇంటర్నేషనల్ : చారిత్రక సమీక్ష

## 1. తొలి అడుగులు :

1864 సెప్టెంబర్ 28న లండన్ మధ్యలో ఉన్న సెయింట్ మార్టిన్ హాల్ 2,000 మంది కార్మికులతో కిక్కిరిసిపోయింది. ఇంగ్లీష్ ట్రేడ్ యూనియన్ నాయకులు, యూరోపులోని ఇతర దేశాలకు చెందిన చిన్న కార్మికుల బృందం ఇచ్చిన పిలుపు మేరకు సమావేశానికి హాజరయ్యేందుకు వారంతా వచ్చారు. ముందుగా పంపిన నోటీసులలో పారిస్ నుంచి కార్మికుల ప్రతినిధి వర్గం సమావేశానికి హాజరై ఇంగ్లాండ్‌లోని తోటి కార్మికుల నుద్దేశించి మాట్లాడతారని, ప్రజల మధ్య మరింత మెరుగైన అవగాహనకు పత్రం సమర్పిస్తారని తెలిపారు.[1] నిజానికి అంతకు సంవత్సరం ముందే 1963 జులైలో ఫ్రెంచ్, ఇంగ్లీష్ ట్రేడ్ యూనియన్‌ల ప్రతినిధులు లండన్‌లో సమావేశమై, పోలండ్‌పై జార్ చక్రవర్తి ఆక్రమణను వ్యతిరేకిస్తూ పోలండ్ ప్రజలకు సంఘీభావం తెలిపారు. ఈ సందర్భంగా తామనుకునే కార్మికవర్గ ఉద్యమ కీలక లక్ష్యాలను కూడా ప్రకటించారు. ఇందుకు సన్నాహకంగా, ఫ్రెంచ్ కార్మికులనుద్దేశించి ఇంగ్లీషు కార్మికుల సందేశాన్ని ప్రముఖ ట్రేడ్ యూనియన్ నాయకుడు జార్జ్ ఓడ్గర్ (1813–77) తయారు చేశాడు. దీనిని 'ది బీ హైవ్' అనే ద్వైవార పత్రికలో ప్రచురించారు. అందులో ఈ విధంగా వుంది.

> "కార్మికుల ప్రయోజనాల కోసం ప్రజల మధ్య ఐకమత్యం అవసరం. ఎందుకంటే వేతనాలు పెంచి లేదా పని గంటలు తగ్గించి మన సామాజిక పరిస్థితులను మెరుగుపరచుకోవడానికి ప్రయత్నించినప్పుడల్లా, మన యజమానులు ఫ్రెంచివారిని, జర్మన్లను, బెల్జియంవారిని లేదా ఇతర దేశాల వారిని తక్కువ వేతనాలకు పనిచేయడానికి రప్పిస్తామని బెదిరిస్తున్నారు. కాని ఇది జరుగుతూనే వుంది. ఇది విచారించదగిన విషయం. ఈ దేశాలకు చెందిన కార్మికులకు మాకు నష్టం కలిగించాలనే అభిప్రాయం లేకపోయినప్పటికీ సకల దేశాల కార్మికుల మధ్య సక్రమమైన, సరైన సంబంధాలు లేకపోవడమే దీనికి కారణం. తక్కువ వేతనాలను పొందేవారిని

ఎక్కువ వేతనాలు పొందేవారి స్థాయికి చేర్చడం, యజమానులు మనలో మనకు పోటీ పెట్టి తమ క్రూరమైన బేరసారాలు చేసి, మన పరిస్థితులను సాధ్యమైనంత తక్కువ స్థాయికి దిగజార్చే వాతావరణాన్ని నిరోధించడం మనకు లక్ష్యంగా ఉండాలి.' [2]

ఈ చొరవ తీసుకున్న నిర్వాహకులు తొందరలోనే అది ఎక్కడకు దారి తీస్తుందనే విషయం కనీసం ఊహించి కూడా ఉండరు. కార్మికులను ప్రభావితం చేస్తున్న ప్రధాన సమస్యలను చర్చించుకోడానికి అంతర్జాతీయ వేదిక ఏర్పాటు చేసుకోవాలన్నది ముఖ్యమైన ప్రతిపాదన. అయితే కార్మిక వర్గ ట్రేడ్ యూనియన్, రాజకీయ కార్యాచరణల సమన్వయం కోసం సంస్థను ఏర్పాటు చేయాలన్న ప్రతిపాదన ఇందులో లేదు. ఇదే తీరులో వారి భావజాలం కూడా ప్రజల మధ్య సౌభ్రాతృత్వం, ప్రపంచశాంతి వంటి సాధారణమైన నైతిక, మానవతా దృక్పథంతో కూడుకొని వున్నది. కాని వర్గ సంఘర్షణ, స్పష్టంగా నిర్వచించిన రాజకీయ లక్ష్యాలు అందులో లేవు. ఈ పరిమితుల కారణంగా సెయింట్ మార్టిన్ హాల్ సమావేశం కూడా ఆ కాలానికి సంబంధించిన అస్పష్టమైన ప్రజాస్వామిక విలువల ప్రతిపాదనలతో ముగిసిపోయేదే. అంతేకాదు వాటి కొనసాగింపు కూడా ఉండేది కాదు. కాని అది కార్మిక ఉద్యమంలోని అన్ని కార్మిక సంఘాలకు అన్వయించే ఒక నమూనా ఆవిర్భవించడానికి దోహదం చేసింది. ఇంటర్నేషనల్ వర్కింగ్ మెన్స్ అసోసియేషన్ జీవం పోసుకుంది. ఆ తరువాత విప్లవకారులు, సంస్కరణవాదులు కూడా ఈ సమావేశాన్ని ప్రస్తావించడం ప్రారంభించారు. [3]

ఈ సంస్థ వెనువెంటనే యూరోపు అంతటా భావోద్వేగాలను రేకెత్తించడం ప్రారంభించింది. అది వర్గ సంఘీభావాన్ని ఆదర్శంగా చేసింది. స్త్రీ, పురుషులను పెద్ద సంఖ్యలో విప్లవాత్మక లక్ష్యం అంటే ప్రపంచాన్ని మార్చడం అనే లక్ష్యం వైపుకు పురి కొల్పింది. ఆ విధంగా 1868లో బ్రస్సెల్స్‌లో జరిగిన ఇంటర్నేషనల్ మూడో మహాసభ సందర్భంగా 'ది టైమ్స్' సంపాదకీయంలో ఇంటర్నేషనల్ పరిధిని సక్రమంగా అంచనా వేశారు.

"ఈ ఆలోచన కేవలం అభివృద్ధికి మాత్రమే పరిమితమైనది కాదు. ఇది పునరుజ్జీవనానికి తక్కువేమీ కాదు. ఇది ఒక దేశానికి పరిమితమైనది కాదు. మానవాళి కంతటికీ వర్తిస్తుంది. ఇంతకుముందు ఎటువంటి వ్యవస్థ ఇంతటి విస్తృత లక్ష్యాన్ని ఏర్పరచుకోలేదు. క్రైస్తవ చర్చి మాత్రం దీనికి మినహాయింపు కావచ్చు. క్లుప్తంగా చెప్పాలంటే ఇదీ ఇంటర్నేషనల్ వర్కింగ్ మెన్స్ అసోసియేషన్ కార్యక్రమం." [4]

ఇంటర్నేషనల్ కృషి ఫలించింది. పెట్టుబడిదారీ ఉత్పత్తి విధానం, పనితీరును కార్మిక ఉద్యమం మరింత స్పష్టంగా అర్థం చేసుకోగలిగింది. తన బలాన్ని మరింతగా అవగాహన చేసుకోగలిగింది. నూతనమైన, ఆధునికమైన పోరాట పద్ధతులను ఆవిష్కరించుకో గలిగింది. యూరోపు సరిహద్దులు దాటి ఇంటర్నేషనల్ కృషి ప్రతిధ్వనించింది. కొత్త సమాజం ఏర్పాటు చేసుకోవడం సాధ్యమని బ్యూనస్ ఐరిస్ కార్మికులలో, కలకత్తాలోని తొలి కార్మిక సంఘాలలో ఆశలు రేకెత్తించింది. ఈ ఆశతోనే ఆస్ట్రేలియా, న్యూజిలాండ్‌లలోని కార్మిక సంఘాలు కూడా ఇంటర్నేషనల్‌లో సభ్యత్వానికి దరఖాస్తు చేసుకున్నాయి.

మరోవైపు ఇంటర్నేషనల్ స్థాపనతో పాలకవర్గాలు తీవ్రమైన భయాందోళనలకు లోనయ్యాయి. కార్మికులు కూడా చరిత్రలో క్రియాశీలక పాత్ర పోషించాలని కోరుకుంటున్నట్టు తెలియడంతో పాలకవర్గాలకు వెన్నులో వణుకుపుట్టింది. ఇంటర్నేషనల్‌ను రూపుమాపడానికై చాలా ప్రభుత్వాలు దృష్టి సారించాయి. ఈ లక్ష్యం కోసం తమకు అందుబాటులో ఉన్న సాధనాలన్నీ ఉపయోగించాయి.

## 2. తగిన స్థానంలో తగిన వ్యక్తి :

ఇంటర్నేషనల్‌ని స్థాపించిన కార్మిక సంఘాలలో అనేక రకాలున్నాయి. బ్రిటన్‌లోని కార్మిక సంఘాలు ఇంటర్నేషనల్ ఏర్పాటులో కీలక శక్తిగా పనిచేశాయి. అయితే బ్రిటన్ ట్రేడ్ యూనియన్ నాయకులంతా (తమ) ప్రపంచ దృక్పథంలో సంస్కరణవాదులే. వారు కేవలం ఆర్థిక సమస్యలను మాత్రమే పరిగణనలోకి తీసుకున్నారు. కార్మికుల స్థితిగతులను మెరుగు చేయడానికి వారు పోరాడారు. కాని వారు పెట్టుబడిదారీ విధానాన్ని పట్టించుకోలేదు. అందువల్ల ఇంటర్నేషనల్‌ను వారు తమ లక్ష్యాల సాధనకు సాధనంగా పరిగణించారు. ప్రధానంగా సమ్మెలు జరిగినప్పుడు ఇతర దేశాల కార్మికులు రాకుండా చేయడానికి సాధనంగా పరిగణించారు.

ఇంటర్నేషనల్‌లో మరో చెప్పుకోదగిన శక్తి పరస్పరాశ్రయవాదులు (mutu-alists). ఫ్రాన్స్‌లో వీరికి చెప్పుకోదగిన బలం ఉంది. బెల్జియం, స్విట్జర్లాండ్‌లోని ఫ్రెంచ్ భాష మాట్లాడే ప్రాంతాలలో కూడా వీరికి తగిన బలం వుంది. పియరీ – జోసఫ్ ప్రౌధాన్ (1809–65) ప్రతిపాదించిన సిద్ధాంతాలకు అనుగుణంగా వీరు రాజకీయాలలో కార్మిక వర్గం పాల్గొనడాన్ని, సమ్మెను పోరాట సాధనంగా ఉపయోగించడాన్ని వ్యతిరేకించేవారు. అంతేకాకుండా మహిళల విమోచన పట్ల వీరికి సాంప్రదాయక భావాలుండేవి. సమాఖ్య పద్ధతిలో సహకార వ్యవస్థను ఏర్పాటు చేయాలని వారు

ప్రతిపాదించేవారు. ఋణాలు పొందడానికి సమాన అవకాశాలు కల్పించడం ద్వారా పెట్టుబడిదారీ విధానాన్ని మార్చవచ్చని వారు భావించేవారు. ఏది ఏమైనప్పటికీ అంతిమంగా వీరు ఇంటర్నేషనల్‌లో మితవాద శక్తిగా తయారయ్యారు.

సంఖ్యాబలం ఎక్కువగా ఉన్న ఈ రెండు వర్గాలతో పాటు ఇతరులు కూడా ఇందులో ఉన్నారు. మూడో ప్రధానమైన శక్తి కమ్యూనిస్టులు. వీరంతా కారల్ మార్క్స్ (1818–1883) చుట్టూ ఉన్నారు. చిన్న బృందాలలో వీరు చురుకుగా ఉండేవారు. వీరి ప్రభావం పరిమితం. జర్మనీ, సిట్జర్లాండ్‌లలోని అనేక పట్టణాలలోను, లండన్‌లోను వీరు వుండేవారు. వీరు పెట్టుబడిదారీ విధానానికి వ్యతిరేకులు. పెట్టుబడిదారీ విధానాన్ని రాజకీయంగా కూలదోయవలసిన అవసరం ఉందని చెప్పేవారు.

ఇంటర్నేషనల్ స్థాపించినపుడు సోషలిస్టు సంప్రదాయంతో సంబంధం ఉన్న కొన్ని వర్గాలు కూడా ఇందులో ఉండేవి. అస్పష్టమైన ప్రజాస్వామ్య భావాలతో ఉన్న యూరోపు తూర్పు ప్రాంతం నుంచి ప్రవాసం వచ్చిన వారు కూడా ఉండేవారు. వీరిలో జిసెప్పీ మాజిని (1805–72) అనుయాయులు కూడా ఉన్నారు. జాతీయ ప్రయోజనాలకు అనుగుణంగా ఉన్న వర్గ సంకరం (Cross - Class) భావన వీరిది. అణగారిన ప్రజల విముక్తి కోసం విజ్ఞప్తి చేయడానికి ఇంటర్నేషనల్ వేదికగా పనికి వస్తుందని వీరు భావించారు. [5]

ఫ్రాన్స్, బెల్జియం, సిట్జర్లాండ్‌లకు చెందిన కార్మిక బృందాలు తమతో పాటు ఊహాజనిత సిద్ధాంతాలను వెంటబెట్టుకు రావడంతో పరిస్థితి మరింత క్లిష్టంగా తయారైంది. ఫెర్డినాండ్ లాసాల్ (1825–64) అనుచరుల నాయకత్వంలోని 'జర్మన్ కార్మికుల జనరల్ అసోసియేషన్' ఏనాడు ఇంటర్నేషనల్‌లో చేరలేదు. దాని చుట్టూ పరిభ్రమిస్తుండేది. అది ట్రేడ్ యూనియన్ కార్యకలాపాలకు వ్యతిరేకం. సంకుచిత జాతిపరమైన రాజకీయ కార్యాచరణను ప్రతిపాదించింది.

ఈ బృందాలన్నీ తమతమ సంస్కృతులు, రాజకీయ, ట్రేడ్ యూనియన్‌పరమైన అనుభవాలతో అప్పుడప్పుడే ప్రారంభమవుతున్న ఇంటర్నేషనల్‌ను ప్రభావితం చేశాయి. ఇన్ని వైవిధ్యాలున్న సంస్థను కేవలం సమైక్య భావంతో ఒక చట్రంగా రూపొందించడం నిజానికి చాలా కష్టమైన పని. అంతేకాకుండా ఆమోదయోగ్యమైన ఉమ్మడి కార్యక్రమం రూపొందించిన తర్వాత కూడా ఈ ధోరణులు వాటికి మెజారిటీ ఉన్న చోట్ల (కేంద్రానికి విరుద్ధంగా) స్థానిక యూనిట్లను తమ సిద్ధాంతాలతో ప్రభావితం చేయడాన్ని కొనసాగించాయి.

ఒకే సంస్థలో భిన్నమైన ధోరణులు ఉన్నప్పటికీ, ఇంటర్నేషనల్ కార్యక్రమానికి ప్రతి ఒక్కరూ తమ ధోరణిలో అర్థం చెప్పుకోడానికి ప్రయత్నిస్తున్నప్పటికీ వారంతా శాంతియుత సహజీవనం సాగించేటట్లు మార్క్స్ చేయగలిగాడు. నిజంగా ఇది గొప్ప విజయం. మార్క్స్ తన రాజకీయ చతురతతో అసాధ్యమైనదాన్ని సుసాధ్యం చేయగలిగాడు. లేని పక్షంలో అంతకుముందు ఏర్పడిన అనేక కార్మిక సంఘాల మాదిరిగానే ఇంటర్నేషనల్ కూడా తెరమరుగున పడిపోయేదే.[6] ఇంటర్నేషనల్‌కు మార్క్స్ స్పష్టమైన లక్ష్యం ఏర్పాటు చేశాడు. ఎవరినీ వదిలిపెట్టకుండా, కచ్చితమైన వర్గ ప్రాతిపదికన రూపొందించిన రాజకీయ కార్యాచరణ ఇంటర్నేషనల్‌కు విస్తృత ఆదరణ కల్పించింది. అది ఒంటెత్తు ధోరణిని అధిగమించి కొనసాగింది. జనరల్ కౌన్సిల్‌కు మార్క్స్ గుండెకాయ మాదిరిగా రూపొందాడు. కౌన్సిల్ ప్రధానమైన తీర్మానాలన్నిటిని ఆయనే రాసేవాడు. ఇంటర్నేషనల్ మహాసభల నివేదికలన్నీ (1867లో జరిగిన లోజాన్ మహాసభ నివేదికను మినహాయించి, అప్పుడు ఆయన **పెట్టుబడి** ప్రూఫ్‌లు చూస్తున్నందువల్ల పని ఒత్తిడిలో ఉన్నాడు) ఆయనే తయారు చేసేవాడు. జర్మన్ కార్మిక నాయకుడు జొహాన్ జార్జ్ ఇక్కారియస్ (1818–89) చెప్పినట్టు 'తగిన వ్యక్తి తగిన స్థానంలో ఉన్నాడు'.[7]

మార్క్స్ ఇంటర్నేషనల్‌ను స్థాపించాడని తరువాత వచ్చిన కథనాలకు విరుద్ధంగా, కనీసం సెయింట్ మార్టిన్ హాల్‌లో జరిగిన సమావేశం నిర్వాహకులలో కూడా ఆయన లేడు. 'ఉపన్యసించే అవకాశం లేకుండా ఆయన కేవలం వేదికపై కూర్చున్నాడు'.[8] ఈ విషయం తరువాత తన స్నేహితుడు ఏంగెల్స్‌కు రాసిన లేఖలో ప్రస్తావించాడు. అయినప్పటికీ సమావేశానికున్న పటిమను ఆయన గ్రహించగలిగాడు. ఇంటర్నేషనల్ విజయవంతంగా కొనసాగడానికి ఆయన చాలా కష్టపడి పనిచేశాడు. కొంతమందిలోనైనప్పటికీ ఆయనకు ఉన్న ప్రతిష్ట దృష్ట్యా 34 మంది సభ్యులున్న స్థాయీ సంఘంలో ఆయన్ని నియమించారు.[9] త్వరలోనే ఆయన నిర్వాహకుల నమ్మకాన్ని పొందగలిగాడు. *ప్రారంభఉపన్యాసం, ఇంటర్నేషనల్ తాత్కాలిక నిబంధనలు* రూపొందించే కార్యక్రమం ఆయనకు అప్పగించారు. మౌలికమైన ఈ రెండింటితో పాటు, ఇతర సందర్భాలలో కూడా సంస్థలోని విభిన్న ధోరణులలోని అత్యుత్తమ భావాల నుండి విలువైన అంశాలను మార్క్స్ స్వీకరించాడు. అదే సమయంలో ముఠాలు కట్టే ధోరణిని, ఒంటెత్తు పోకడలను ఆయన పక్కకు పెట్టాడు. ఆయన ఆర్థిక, రాజకీయ పోరాటాలను సమన్వయం చేశాడు. అంతర్జాతీయ ఆలోచన, అంతర్జాతీయ కార్యాచరణ తిరుగులేనిదని ఆయన స్పష్టం చేశాడు.[10]

ఇంటర్నేషనల్ వివిధ దేశాల పోరాటాలను సమన్వయం చేసి సమగ్ర పోరాటాన్ని రూపొందించింది. అయితే ఆయా పోరాటాల స్వయం ప్రతిపత్తిని గుర్తించింది. కాని కేంద్రం నుంచి వాటికి పూర్తి స్వాతంత్ర్యం ఇవ్వలేదు. ఇటువంటి రాజకీయ సంశ్లేషణకు మార్క్స్ శక్తి, సామర్థ్యాలే కారణం అనడంలో అతిశయోక్తి లేదు. ఐక్యతను కాపాడడమే ఆ రోజుల్లో ప్రధానమైన అంశంగా తయారైంది. [11] అందువల్ల మార్క్స్ అనుసరించే పెట్టుబడిదారీ వ్యతిరేక ధోరణికి ఏనాడు ఇంటర్నేషనల్ రాజకీయాభిప్రాయాలలో తగిన స్థానం లభించలేదు. అయితే కాలం గడిచిన కొద్దీ మార్క్స్ పట్టుదల, సంభవించిన కొన్ని చీలికల ప్రభావం వల్ల మార్క్స్ ఆలోచన ఆధిపత్య ధోరణిగా రూపొందింది. [12] ఇది కఠినమైన మార్గం. కాని ఆ రోజుల్లో జరిగిన పోరాటాల నుంచి లోతైన రాజకీయ వివరణ అనేది చెప్పుకోదగినంతగా అభివృద్ధి చెందింది. కార్మికులను సమీకరించడం, పారిస్ కమ్యూన్ వ్యవస్థకి విసిరిన సవాలు, క్లిష్టమైన పెద్ద సంస్థను కొనసాగించడమనే అసాధారణమైన కృషి, వివిధ రాజకీయ, సైద్ధాంతిక సమస్యలపై కార్మికవర్గ ఉద్యమంలో ఇతర ధోరణులతో చెలరేగిన వాద ప్రతివాదనలు, ఇవన్నీ రాజకీయార్ధశాస్త్ర (political economy) పరిధిని దాటి పరిస్థితులను పరిశీలించడానికి మార్క్స్‌కి ప్రేరణనిచ్చాయి. 1848 విప్లవం పరాజయం పొందడంతో ప్రగతికాముక శక్తులు వెనక్కు తగ్గాయి. అప్పటి నుంచి మార్క్స్ రాజకీయార్థ శాస్త్రంపై ప్రత్యేక శ్రద్ధ చూపడం ప్రారంభించాడు. తన ఆలోచనలను అభివృద్ధి చేయాలని, కొన్నిటిని సవరించుకోవాలని ఆయన అభిప్రాయపడ్డాడు. గతంలో నిర్ధారించుకున్న అంశాలను మళ్ళీ చర్చకు పెట్టాలని, కొత్త ప్రశ్నలకు జవాబులు వెతకాలని ఆయన భావించాడు. ప్రత్యేకించి కమ్యూనిస్టు సమాజాన్ని మరింత వివరంగా నిర్వచించి పెట్టుబడిదారీ విధానంపై తన విమర్శకు మరింత పదునుపెట్టాలని ఆయన నిర్ణయించుకున్నాడు. ఇవన్నీ చూసినపుడు, మార్క్స్ తన అధ్యయనం ద్వారా అంతకుముందే రూపొందించిన రాజకీయ సిద్ధాంతాన్ని అప్పటి చారిత్రక దశకు యాంత్రికంగా అన్వయించాడని ఇంటర్నేషనల్‌లో మార్క్స్ పాత్ర గురించి చెబుతున్న సాంప్రదాయక సోవియట్ ధోరణి పూర్తిగా వాస్తవ విరుద్ధమైనది. [13]

## 3. సభ్యత్వం - నిర్మాణం :

ఇంటర్నేషనల్ మనుగడ సాగించిన కాలంలోను, ఆ తరువాత దశాబ్దాలలోను, ఇంటర్నేషనల్‌ను ఆర్థికంగా శక్తివంతమైనదిగా భావించేవారు. సరైన పరిజ్ఞానం లేనందువల్ల, లేదా కొంతమంది నాయకులు గొప్పలు చెప్పుకున్నందువల్ల, లేదా

ప్రత్యర్థులు తీవ్రమైన దాడులు చేయడానికి సాకుగా చెప్పడానికి ఇంటర్నేషనల్ సభ్యత్వాన్ని కొండంతలుగా చూపేవారు. ఫ్రెంచి నాయకులపై 1870లో నేరారోపణలు చేసిన పబ్లిక్ ప్రాసిక్యూటర్ ఇంటర్నేషనల్‌కు యూరోపులో ఎనిమిది లక్షల మంది సభ్యులున్నారని ఆరోపించాడు;[14] పారిస్ కమ్యూన్ ఓడిపోయిన సంవత్సరం తరువాత 'ది టైమ్స్' పత్రిక మొత్తం 25 లక్షల మంది సభ్యులున్నారని తెలిపింది. మితవాద శిబిరంలో ఈ అంశాన్ని అధ్యయనం చేసిన ఆస్కార్ టెస్టూట్ ఇంటర్నేషనల్ సభ్యత్వం 50 లక్షలకు పెరుగుతుందని అంచనా వేశాడు.[15]

వాస్తవానికి సభ్యత్వం సంఖ్య చాలా తక్కువ. అయితే అంచనాలు కట్టడం కూడా చాలా కష్టం. ఇంటర్నేషనల్ నాయకులు, ఇంటర్నేషనల్‌ను క్షుణ్ణంగా అధ్యయనం చేసినవారి పరిస్థితి కూడా ఇంతే.[16] ప్రస్తుతం కొనసాగుతున్న పరిశోధన ప్రకారం ఇంటర్నేషనల్ ఉచ్ఛదశలో ఉన్న 1871-72 సంవత్సరంలో అందులో లక్షా 50 వేలకు పైగా సభ్యులున్నారు. బ్రిటన్‌లో 50 వేలు, ఫ్రాన్స్, బెల్జియం కలిపి 30 వేలు, స్విట్జర్లాండ్‌లో ఆరు వేలు, స్పెయిన్‌లో 30 వేలు, ఇటలీలో 25 వేలు, జర్మనీలో పది వేలు (వీరిలో ఎక్కువమంది సోషల్ డెమోక్రాటిక్ పార్టీ సభ్యులు), మిగిలిన యూరోపు దేశాల నుంచి మరికొన్ని వేలమంది, అమెరికా సంయుక్త రాష్ట్రాలలో నాలుగువేల మంది ఇంటర్నేషనల్‌లో సభ్యులుగా ఉన్నారు.[17]

ఆ రోజుల్లో ఇంగ్లీష్ ట్రేడ్‌యూనియన్లు, జనరల్ అసోసియేషన్ ఆఫ్ జర్మన్ వర్కర్స్‌ను మినహాయించి చెప్పుకోదగిన స్థాయిలో కార్మిక సంఘాలు లేవు. అట్టి పరిస్థితులలో ఇంటర్నేషనల్‌కున్న సభ్యుల సంఖ్య చెప్పుకోదగిందే. ఇంటర్నేషనల్ మనుగడ సాగించినంత కాలం బ్రిటన్, స్విట్జర్లాండ్, బెల్జియం, అమెరికా సంయుక్త రాష్ట్రాలలో మాత్రమే చట్టబద్ధమైన సంస్థగా గుర్తింపు పొందిందనే విషయం మనం గుర్తుంచుకోవాలి. ఇంటర్నేషనల్‌లో తగిన సంఖ్యాబలం వున్న ఫ్రాన్స్, స్పెయిన్, ఇటలీలలో అనేక సంవత్సరాల పాటు సంస్థకు చట్టబద్ధత లేదు. ఈ దేశాలలో ఇంటర్నేషనల్ సభ్యులను హింసించేవారు. జర్మన్ బృహత్ సమాఖ్యలోని 39 రాష్ట్రాలలో ఇంటర్నేషనల్‌లో చేరడమంటే చట్టాన్ని అతిక్రమించడమే. ఆస్ట్రియా - హంగెరీ సామ్రాజ్యంలోని కొద్దిమంది సభ్యులు రహస్యంగా పనిచేసేవారు. అయినప్పటికీ ఇంటర్నేషనల్‌ను ప్రారంభించిన రెండు సంవత్సరాలలోనే అందులోని వివిధ వర్గాలను ఒక్క తాటిపైకి తేగలిగింది. 1868 చివరినాటికి వందలాది కార్మిక సంఘాలను ఏర్పాటు చేయగలిగారు. బకూనిన్ (1814-76) అనుయాయులు చేసిన ప్రచారం దీనికి ప్రధాన కారణం. స్పెయిన్‌లో కూడా కొన్ని కార్మిక సంఘాలను ఏర్పాటు చేశారు. పారిస్ కమ్యూన్ తరువాత ఇటలీ,

హాలెండ్, డెన్మార్క్, పోర్చుగల్‌లో కూడా కార్మిక సంఘాలు ఏర్పడ్డాయి. ఇంటర్నేషనల్ పెరుగుదలలో నిస్సందేహంగా అసమానతలున్నాయి. కొన్ని దేశాలలో అది అభివృద్ధి చెందితే మరికొన్ని దేశాలలో అణచివేత కారణంగా అది వెనకడుగు వేసింది. అయితే ఇంటర్నేషనల్‌లో కొద్దికాలం ఉన్నవారు కూడా అది తమదేనన్న భావంతో ఉండేవారు. తాము పాల్గొన్న పోరాటాల క్రమం ముగిసినప్పుడు, లేదా ప్రతికూల పరిస్థితులు, వ్యక్తిగత కష్టాలు చుట్టుముట్టినప్పుడు కొందరు వెనక్క తగ్గినప్పటికీ వర్గ సంఘీభావాన్ని నిలబెట్టుకునేవారు. ప్రదర్శనలకు పిలుపు ఇచ్చినపుడు, పోస్టర్లలోని మాటలకు, పోరాటపు ఎర్రజెండా ఎగరేసినప్పుడు తమ కష్టకాలంలో ఆదుకున్న ఇంటర్నేషనల్‌ను తమ శక్తిమేరకు బలపరిచేవారు. [18]

కార్మికవర్గంలోని కొద్దిమంది మాత్రమే ఇంటర్నేషనల్‌లో చేరారు. పారిస్‌లో వారి సంఖ్య ఎన్నడూ పదివేలకు మించలేదు. రోమ్, వియన్నా, లేదా బెర్లిన్ వంటి ముఖ్య పట్టణాలలో వారి సంఖ్య చాలా తక్కువ. ఇంటర్నేషనల్‌లో చేరిన కార్మికుల మరో ముఖ్య లక్షణమేమిటంటే, వేతన కార్మికులు అధికంగా చేరతారని భావించినప్పటికీ వారిలో చాలా తక్కువ మంది మాత్రమే చేరారు. ఇంగ్లాండ్ భవన నిర్మాణ కార్మికులు, బెల్జియం జౌళి కార్మికులు, ఫ్రాన్స్, స్విట్జర్లాండ్‌లలోని వివిధరకాల వృత్తి కార్మికులు ఇంటర్నేషనల్‌లో చేరారు.

బ్రిటన్‌లో ఉక్కు పరిశ్రమల కార్మికులను మినహాయించి ఇతర పారిశ్రామిక కార్మికులు చాలా తక్కువ మంది ఇంటర్నేషనల్‌లో చేరారు.[19] ప్రపంచంలోని ఇతర దేశాలలో కూడా ఇంటర్నేషనల్‌లో పారిశ్రామిక కార్మికులు ఎక్కువ మంది చేరలేదు. యూరోపు దక్షిణ ప్రాంతంలో ఇంటర్నేషనల్ విస్తరించిన తరువాత కూడా వారు చేరలేదు. ఇంటర్నేషనల్ లోకి నైపుణ్యం లేని కార్మికులను ఆకర్షించడంలో కూడా విఫలమయ్యారు. [20] ఇంటర్నేషనల్ తొలి మహాసభ నుంచి నైపుణ్యం లేని కార్మికులను చేర్చుకోడానికి చేసిన ప్రయత్నాలు ఫలించలేదు. *తాత్కాలిక జనరల్ కౌన్సిల్* ప్రతినిధులకు ఇచ్చిన ఆదేశాలు ఈ విషయాన్ని స్పష్టంగా తెలియచేస్తున్నాయి.

> ట్రేడ్ యూనియన్లు తమ మౌలిక కార్యకలాపాలతో పాటు కార్మిక వర్గ సమీకరణ కేంద్రాలుగా పనిచేయాలి. సంపూర్ణ విముక్తి అనే విస్తృత లక్ష్యసాధనకు పట్టుదలతో కృషి చేయాలి. ఈ లక్ష్యం కోసం సాగే సామాజిక, రాజకీయ ఉద్యమాలన్నిటికి వారు సహకరించాలి. తాము కార్మిక వర్గానికంతటికీ ప్రతినిధులమని, నాయకులమని భావించాలి. కార్మికులు

కాని వారిని కూడా ఇంటర్నేషనల్‌లో చేర్చుకోవాలి. ప్రత్యేక పరిస్థితులలో శక్తిహీనులుగా ఉన్న వ్యవసాయ కార్మికులు తదితర వృత్తుల వారి ప్రయోజనాలను కూడా జాగ్రత్తగా పరిశీలించాలి. తమ కృషి సంకుచితమైనది, స్వార్థంతో కూడుకున్నది కాదని అట్టడుగున ఉన్న లక్షలాది మంది విముక్తి తమ లక్ష్యమని ప్రపంచమంతటినీ ఒప్పించగలగాలి. [21]

ఏది ఏమైనప్పటికీ బ్రిటన్‌లో కూడా నైపుణ్యం లేని కార్మికులు పెద్ద ఎత్తున ఇంటర్నేషనల్‌లో చేరలేదు. అయితే 'డిగ్గర్స్' దీనికి మినహాయింపు. ఇంటర్నేషనల్‌లో చేరిన వారిలో ఎక్కువమంది టైలరింగ్, దుస్తుల తయారీ, పాదరక్షల తయారీ, క్యాబినెట్ తయారీ రంగాలకు చెందినవారు. వీరంతా సంఘాలుగా ఏర్పడిన రంగాలకు చెందినవారు. వీరికి వర్గ చైతన్యం కూడా ఎక్కువ. ఏది ఏమైనప్పటికీ ఇంటర్నేషనల్‌లో చేరిన వారంతా ఉద్యోగాలు చేసుకునే కార్మికులే. నిరుద్యోగులు ఎన్నడూ ఇందులో చేరలేదు. ఇంటర్నేషనల్ నాయకత్వం కూడా ఈ పరిస్థితికి అద్దం పట్టింది. నాయకులలో వృత్తి కార్మికులు గాని, మేధో కార్మికులు గాని ఎక్కువ లేరు.

ఇదే విధంగా ఇంటర్నేషనల్ ఆర్థిక వనరుల వ్యవహారం కూడా క్లిష్టమైనదే. ఇంటర్నేషనల్‌కు పెద్ద ఎత్తున సంపదలున్నాయని వినికిడి ఉండేది. [22] అయితే వాస్తవమేమంటే ఇంటర్నేషనల్ ఆర్థిక పరిస్థితి పూర్తిగా అస్థిరంగా ఉండేది. వ్యక్తుల సభ్యత్వ రుసుము ఒక షిల్లింగ్. ట్రేడ్ యూనియన్లు వాటిలోని సభ్యులు ఒక్కొక్కరికి మూడు పెన్నీల చొప్పున ఇంటర్నేషనల్‌కి చెల్లించాలి. ఏది ఏమైనప్పటికీ అనేక దేశాలలో సభ్యత్వ చందాలు చాలా తక్కువగా వచ్చేవి. బ్రిటన్‌లో సభ్యత్వ రుసుము చెల్లింపులు ఏ మాత్రం నిలకడగా ఉండేవి కావు. పరిస్థితులను గమనించిన జనరల్ కౌన్సిల్ సభ్యత్వ రుసుము తగ్గించేది. లేదా స్వచ్ఛందంగా చెల్లించగలిగినంత చెల్లించవలసిందిగా కోరేవారు. ఈ విధంగా వసూలు చేసిన మొత్తం కొద్ది వందల పౌండ్లను మించేది కాదు. [23] ఈ మొత్తం ఇంటర్నేషనల్ జనరల్ సెక్రెటరీకి చెల్లించే నాలుగు షిల్లింగుల వేతనానికి, కార్యాలయం అద్దె చెల్లించడానికి బొటాబొటిగా సరిపోయేది. తరచుగా కార్యాలయం అద్దె బకాయిపడడంతో ఖాళీ చేయవలసిందిగా నోటీసులు వచ్చేవి.

ఇంటర్నేషనల్‌కు సంబంధించిన ఒక కీలకమైన రాజకీయ – నిర్మాణపరమైన డాక్యుమెంట్‌లో ఇంటర్నేషనల్ కార్యకలాపాల గురించి మార్క్స్ ఈ విధంగా రాశాడు : 'కార్మిక వర్గం అప్రయత్నంగా చేసే పోరాటాలను కలిపి, సాధారణమైనవిగా రూపొందించడం ఇంటర్నేషనల్ కర్తవ్యం. అయితే వాటిని శాసించకూడదు. ఎటువంటి

సిద్ధాంత చట్రాన్ని వాటిపై రుద్దకూడదు.’ [24]

ఇంటర్నేషనల్‌లోని సమాఖ్యలకు, విభాగాలకు సాధ్యమైనంత మేర స్వయం ప్రతిపత్తి కల్పించినప్పటికీ రాజకీయ నాయకత్వాన్ని మాత్రం ఎల్లప్పుడు ఇంటర్నేషనల్ నెరపేది. వివిధ ధోరణుల ఐక్యతను క్రోడీకరిస్తూ, ఇంటర్నేషనల్ అంతటికీ మార్గదర్శకాలను రూపొందించే బాధ్యతలను జనరల్ కౌన్సిల్ నిర్వహించింది. కౌన్సిల్ అక్టోబర్ 1864 నుంచి ఆగస్ట్ 1872 వరకు క్రమం తప్పకుండా సమావేశమవుతూ 385 సమావేశాలు నిర్వహించింది. పైప్‌లు, చుట్టల పొగతో నిండిన గదిలో ప్రతి మంగళవారం సాయం కాలం జనరల్ కౌన్సిల్ సమావేశాలు జరిపేది. పని పరిస్థితులు, కొత్త యంత్రాల ప్రభావం, సమ్మెలకు మద్దతు ఇవ్వడం, కార్మిక సంఘాల పాత్ర, ప్రాముఖ్యత, ఐర్లాండ్ సమస్య, విదేశాంగ విధానానికి సంబంధించిన వివిధ అంశాలు, భవిష్యత్తులో నూతన సమాజం నిర్మించడం తదితర సమస్యలపై జనరల్ కౌన్సిల్ చర్చలు సాగించేది. ఇంటర్నే షనల్ డాక్యుమెంట్లకు ముసాయిదాలు తయారు చేసే బాధ్యత కూడా జనరల్ కౌన్సిల్‌దే. సర్క్యులర్లు, లేఖలు, తక్షణ లక్ష్యాలపై తీర్మానాలు, ప్రత్యేక మేనిఫెస్టోలు, ప్రత్యేక పరిస్థితులు తలెత్తినపుడు ఉపన్యాసాలు, విజ్ఞప్తులు ఈ ముసాయిదాలలో ఉండేవి. [25]

## 4. ఇంటర్నేషనల్ ఆవిర్భావం

ఇంటర్నేషనల్ మనుగడ సాగించిన కాలంలోని ప్రధాన రాజకీయ సంఘటనలు, కీలకమైన నిర్మాణాత్మక సంఘటనలకు మధ్య దాని చరిత్ర తేదీలవారీగా రాయడం కష్టమైన పని. నిర్మాణపరంగా ముఖ్యమైన దశలు ఏవంటే : (1) ఇంటర్నేషనల్ ఆవిర్భావం (1864–66), ప్రారంభం నుంచి మొదటి మహాసభ (జెనీవా 1866) వరకు; (2) విస్తరణ దశ (1866–70); (3) విప్లవాత్మక ముందడుగు, పారిస్ కమ్యూన్ (1871–72) తరువాత అణచివేత; (4) చీలిక, సంక్షోభం (1872–77). సైద్ధాంతికపరమైన అభివృద్ధిలో ముఖ్యమైన దశలు ఏవంటే : (1) ఇంటర్నేషనల్‌లోని వివిధ వర్గాల మధ్య తొలి చర్చలు, నిర్మాణానికి ఏర్పాట్లు (1864–65); (2) సమిష్టివాదులకు, పరస్పరాశ్రయ వాదులకు (mutualists) మధ్య ఆధిపత్య పోరు (1866–69); మధ్యేమార్గం అనుసరించేవారికి, స్వయం ప్రతిపత్తి కోరేవారికి మధ్య వివాదాలు (1870–77). దిగువ పేరాలలో నిర్మాణాత్మక, సైద్ధాంతిక అంశాలు రెండింటినీ చర్చించాం.

ఇంటర్నేషనల్‌కు ముందుగా బ్రిటన్ నుంచి దరఖాస్తులు అందాయి. నాలుగువేల మంది సభ్యులున్న ఇటుక తయారీదారుల సంఘాన్ని ఫిబ్రవరి 1865లో ఇంటర్నేషనల్‌లో చేర్చుకున్నారు. తరువాత నిర్మాణరంగం కార్మికులు, పాదరక్షల తయారీదారులు ఇందులో

చేరారు. జనరల్ కౌన్సిల్ ఆవిర్భవించిన తొలి సంవత్సరంలో ఇంటర్నేషనల్ కార్యకలాపాల గురించి తీవ్రమైన ప్రచారం సాగించింది. కేవలం ఆర్థిక సమస్యలకు పరిమితం కాకుండా తన అవగాహనను విస్తృతం చేసుకోడానికి ఈ ప్రచారం దోహదం చేసింది. ఫిబ్రవరి 1865లో స్థాపించిన ఎన్నికల సంస్కరణ సంఘంలో ఇంటర్నేషనల్ కూడా పాలుపంచుకోవడం ఈ అంశాన్ని రుజువు చేస్తున్నది.

జనవరి 1865లో పారిస్‌లో ఇంటర్నేషనల్ సెక్షన్‌ను ఏర్పాటు చేయడంతో ఫ్రాన్స్‌లో దాని కార్యకలాపాలు ప్రారంభమయ్యాయి. ఆ తరువాత కొద్ది రోజుల్లోనే లియోన్, కేయిన్‌లలో ప్రధానమైన కేంద్రాలు ఏర్పాటయ్యాయి. ఫ్రాన్స్ రాజధాని పారిస్‌లో ఇంటర్నేషనల్ వ్యాప్తి చెందకపోవడంతో దాని బలం స్వల్పంగా ఉండేది. ఈ కాలంలో పారిస్‌లో ఇతర కార్మిక సంఘాలు ఇంటర్నేషనల్ సెక్షన్ కంటే చాలా పెద్దవిగా ఉండేవి. భావజాలపరంగా ఇంటర్నేషనల్ పరిమితంగా ఉండేది. బలాబలాల పొందిక వల్ల, దానికి రాజకీయ సంకల్పం లేకపోవడం వల్ల జాతీయ స్థాయి ఫెడరేషన్‌ను ఏర్పాటు చేయడం కూడా సాధ్యం కాలేదు. కాని 1865 సెప్టెంబర్ 25 నుంచి 29 వరకు లండన్‌లో జరిగిన ఇంటర్నేషనల్ కాన్ఫరెన్స్‌కు ఫ్రాన్స్ నుంచి హాజరైన ప్రతినిధివర్గం సంఖ్యలో రెండోస్థానంలో ఉంది. అయితే వీరిలో ఎక్కువ మంది ప్రౌధాన్ ప్రతిపాదించిన పరస్పరాశ్రయ సిద్ధాంతాలను అనుసరించేవారే. ఈ కాన్ఫరెన్స్‌కు ఇంగ్లాండ్, ఫ్రాన్స్, స్విట్జర్లాండ్, బెల్జియం నుంచి 30 మంది ప్రతినిధులు, జర్మనీ,పోలండ్, ఇటలీల నుంచి కొద్దిమంది ప్రతినిధులు హాజరయ్యారు. ఇంటర్నేషనల్ తీసుకున్న తొలి చర్యలు, ప్రత్యేకించి నిర్మాణ స్థాయిలో తీసుకున్న చర్యల గురించి ప్రతినిధులంతా సమాచారం అందజేశారు. తరువాత సంవత్సరంలో మొదటి మహాసభ నిర్వహించాలని నిర్ణయించారు. మహాసభ చర్చించవలసిన ప్రధాన అంశాలను కూడా నిర్ణయించారు.

ఈ రెండు సమావేశాల మధ్య కాలంలో యూరోపులో ఇంటర్నేషనల్ బాగా విస్తరించింది. బెల్జియంలోను, స్విట్జర్లాండ్‌లోని ఫ్రెంచి భాష మాట్లాడే ప్రాంతంలోను ఇంటర్నేషనల్‌కు తొలి విభాగాలు ఏర్పాటయ్యాయి. ఇతర దేశాలలోని కార్మిక సంఘాలతో సంబంధాలు నెలకొల్పుకోడానికి జర్మనీలోని రాజకీయ సంస్థలకు ప్రష్యా చట్టాలు ఆటంకమయ్యాయి. ఆనాడు జర్మన్ బృహత్ సమాఖ్య ప్రాంతంలో ఇంటర్నేషనల్ విభాగాల ఏర్పాటు సాధ్యం కాలేదు. అయితే 'జనరల్ అసోసియేషన్ ఆఫ్ జర్మన్ వర్కర్స్'లో ఐదువేల మంది సభ్యులున్నారు. చరిత్రలో ఇది తొలి కార్మిక వర్గ పార్టీ. 1863లో దీన్ని స్థాపించారు. దీనికి లాసాల్ అనుచరుడు జోహాన్ బాప్టిస్ట్ వాన్ స్చివిట్జర్ (1833–75) నాయకత్వం వహించేవాడు. ఆటో వాన్ బిస్మార్క్ (1815–98) తో వీరు అనిశ్చితమైన

చర్చలు జరిపేవారు. ఇంటర్నేషనల్ తొలి సంవత్సరాలలో వీరు దాని పట్ల ఎటువంటి ఆసక్తి చూపలేదు. మార్క్స్‌కు సన్నిహితుడైన విల్‌హెల్మ్ లీబ్‌కెనెక్ట్ (1826–90) కూడా దానిపట్ల ఉదాసీనంగా ఉన్నాడు. జొహాన్ ఫిలిప్ బెకర్ (1809–86) స్విట్జర్లాండ్‌లో ఇంటర్నేషనల్ నాయకులలో ప్రముఖుడు. ఆయన జెనీవాలోని జర్మన్ మాట్లాడే వారి ద్వారా ఈ ఇబ్బందులను అధిగమించడానికి ప్రయత్నించాడు. ఇంటర్నేషనల్ తొలి సంవత్సరాలలో చాలాకాలం పాటు జర్మన్ బృహత్ సమాఖ్యలో ఇంటర్నేషనల్ విభాగాన్ని ఈయనే నిర్వహించాడు.

ఇంటర్నేషనల్ భావాలకు సానుభూతి చూపే పత్రికలు లేదా జనరల్ కౌన్సిల్ ఏర్పాటు చేసిన పత్రికల కారణంగా అది పెద్ద ఎత్తున అభివృద్ధి చెందింది. ఈ రెండు రకాల పత్రికలు వర్గ చైతన్యం అభివృద్ధి చెందడానికి కృషి చేశాయి. అంతేకాకుండా ఇంటర్నేషనల్ కార్యకలాపాలకు సంబంధించిన వార్తలను ప్రచురించేవి. వీటిలో కొన్నిటిని ఇంటర్నేషనల్ తొలి సంవత్సరాలలో స్థాపించారు. వీటిలో చెప్పుకోదగినవి 'ది బీహైవ్', 'ది మైనర్ అండ్ వర్క్‌మెన్స్ అడ్వొకేట్' (తరువాత 'వర్క్‌మెన్స్ అడ్వొకేట్' అని, ఆ తరువాత 'కామన్వెల్త్' అని దీని పేరు మార్పు చేశారు.) ఈ రెండింటినీ లండన్‌లో ప్రచురించేవారు. ఫ్రెంచ్ భాషలో 'లీ కొరియర్ ఇంటర్నేషనల్' అనే పత్రికను కూడా లండన్ నుంచి ప్రచురించేవారు. 1865 ఆగస్టు నుంచి బెల్జియంలో ఇంటర్నేషనల్ అధికార పత్రికగా 'లా ట్రిబ్యూన్ డు పీపులె' వెలువడేది. స్విట్జర్లాండ్‌లో ఫ్రెంచ్ భాష మాట్లాడే ప్రాంతాలలో 'జర్నల్ డె ఇంటర్నేషనల్ డెస్ ట్రావెలర్స్' పత్రికను ప్రచురించేవారు. ప్రౌధాన్ అనుచరులు పారిస్ నుంచి 'లీ కొరియర్ ఫ్రాంకాయిస్'ను, జెనీవాలో బెకర్ 'డెర్ వోర్బోట్' ను నడిపేవారు.[26]

ఇంటర్నేషనల్ మరింత బలపడడానికి లండన్‌లోని జనరల్ కౌన్సిల్ కార్యకలాపాలు ఎంతగానో దోహదం చేశాయి. 1866 వసంతకాలంలో 'లండన్ ఎమాల్గమేటెడ్ టైలర్స్' సంఘాలు సమ్మె చేశారు. చరిత్రలో తొలిసారిగా కార్మికుల పోరాటంలో జనరల్ కౌన్సిల్ కీలకమైన పాత్ర పోషించింది. సమ్మె విజయవంతం కావడంతో టైలర్లకు చెందిన ఐదు సంఘాల వారు ఇంటర్నేషనల్‌కు అనుబంధంగా పనిచేయాలని నిర్ణయించారు. వీటిలో 500 మందికి పైగా కార్మికులున్నారు. వివాదాలకు సంబంధించి సానుకూల ఫలితాలు రావడంతో అనేక చిన్న చిన్న సంఘాలు ఇంటర్నేషనల్‌కు అనుబంధంగా పనిచేయడానికి సిద్ధపడ్డాయి. ఇంటర్నేషనల్ మొదటి మహాసభ నాటికి 25,000 మంది సభ్యులున్న 17 కార్మిక సంఘాలు ఇంటర్నేషనల్‌కు అనుబంధంగా పనిచేయాలని నిర్ణయించాయి. కార్మిక సంఘాలను సభ్యులుగా చేర్చుకునే

క్లిష్టమైన కార్యక్రమంలో విజయం సాధించిన మొదటి సంస్థ ఇంటర్నేషనల్. [27]

ఇంటర్నేషనల్ తొలి మహాసభ 1866 సెప్టెంబర్ 3 నుంచి 8 వరకు జెనీవాలో జరిగింది. బ్రిటన్, ఫ్రాన్స్, జర్మనీ, స్విట్జర్లాండ్‌ల నుంచి 60 మంది ప్రతినిధులు సభకు హాజరయ్యారు. ఇంటర్నేషనల్ ప్రారంభమైన తరువాత రెండు సంవత్సరాలలో అది చెప్పుకోదగిన ప్రగతి సాధించింది. వందకుపైగా ట్రేడ్ యూనియన్లు, రాజకీయ సంస్థలు దానికి అనుబంధంగా పనిచేయడం ప్రారంభించాయి. మహాసభలో పాల్గొన్న వారిలో రెండు వర్గాలున్నాయి. మొదటి వర్గం, బ్రిటిష్ డెలిగేట్లు, కొద్దిమంది జర్మన్లు, స్విట్జర్లాండ్‌కు చెందిన వారిలో అధిక సంఖ్యాకులు మార్క్స్ నాయకత్వంలోని జనరల్ కౌన్సిల్ రూపొందించిన మార్గదర్శకాలను అనుసరించేవారు. (మార్క్స్ జెనీవా మహాసభకు హాజరు కాలేదు.) రెండో వర్గంలో ఫ్రెంచ్ డెలిగేట్లు, స్విట్జర్లాండ్‌లో ఫ్రెంచ్ మాట్లాడేవారి ప్రతినిధులు ఉన్నారు. వీరు పరస్పరాశ్రయవాదులు. ఆ రోజుల్లో ఇంటర్నేషనల్‌లో మితవాద (moderate) ధోరణి ప్రబలంగానే ఉండేది. పారిస్ వాసి హెన్రీ టులేన్ (1828–97) పరస్పరాశ్రయవాదులకు నాయకత్వం వహించేవాడు. కార్మికుడు ఒకే సమయంలో ఉత్పత్తిదారుడుగా, పెట్టుబడిదారుడుగా, వినియోగదారుడుగా ఉండే సమాజం ఏర్పాటు కావాలని వారు చెప్పేవారు. సమాజంలో మార్పులకోసం స్వేచ్ఛా రుణాలు (free credit) ఏర్పాటు చేస్తే చాలునని వారు అభిప్రాయపడేవారు. నైతికంగా, సామాజిక పరంగా మహిళలు శ్రమ చేయడం సరైంది కాదని వారు ప్రచారం చేసేవారు. పని సంబంధాలలో ప్రభుత్వ జోక్యాన్ని (ఎనిమిది గంటల పని చట్టాలతో సహా) వారు వ్యతిరేకించారు. ఈ విధంగా జోక్యం చేసుకుంటే కార్మికులకు, యజమానులకు మధ్య వ్యక్తిగత సంబంధాలు బెడిసికొడతాయని, ప్రస్తుత వ్యవస్థకు బలం చేకూరుతుందని వారు వాదించేవారు.

మార్క్స్ రూపొందించిన తీర్మానాలపై ఆధారపడి జనరల్ కౌన్సిల్ నాయకులు సంఖ్యాబలం ఎక్కువగా ఉన్న పరస్పరాశ్రయవాదులను ఓడించగలిగారు. ప్రభుత్వ జోక్యానికి అనుకూలంగా ఓట్లు రాబట్టగలిగారు. 'బాలల (బాలబాలికలు) శ్రమకు' సంబంధించి రూపొందించిన *ప్రొవిజనల్ జనరల్ కౌన్సిల్ ప్రతినిధులకు ఆదేశాలలో* ప్రభుత్వ జోక్యంపై మార్క్స్ చాలా స్పష్టంగా ఈ విధంగా చెప్పాడు.

> సామాజిక కారణాలను సామాజిక శక్తిగా మార్పు చేయడం ద్వారా మాత్రమే ఇది సాధ్యమవుతుంది. ప్రస్తుత పరిస్థితులలో రాజ్యం అమలు పరచే సాధారణ చట్టాల ద్వారా ఇది సాధ్యమవుతుంది. దీనికి వేరే మార్గం లేదు.

చట్టాలను అమలు చేయమని కోరడమంటే కార్మిక వర్గం ప్రభుత్వాధికారాన్ని మరింత పటిష్టం చేయడం కాదు. ఇందుకు భిన్నంగా తమకు వ్యతిరేకంగా పనిచేసే అధికారాన్ని తమకోసం పనిచేసే వ్యవస్థగా మార్చడం. అనేక మంది వ్యక్తుల విడివిడి ప్రయత్నాలు చేయలేనిదాన్ని ఒక సార్వత్రిక చర్య సమర్థవంతంగా సాధిస్తుంది. [28]

ఆ విధంగా (ప్రౌధాన్, అతని అనుచరులు పొరపాటుగా విశ్వసించినట్టు) బూర్జువా సమాజాన్ని బలోపేతం చేయకుండా, ఈ సంస్కరణవాద డిమాండ్లను కార్మిక వర్గ విముక్తి కోసం తప్పనిసరిగా ఉపయోగించుకోవలసి ఉంటుంది.

జెనీవా మహాసభకు మార్క్స్ చేసిన సూచనలలో పరస్పరాశ్రయవాదులు, రాబర్ట్ ఓవెన్ (1771–1858) అనుచరులు, జర్మనీలో లాసాల్ అనుయాయులకు విరుద్ధంగా కార్మిక సంఘాల మౌలిక కార్యాచరణను సమర్థించాడు : [29]

ట్రేడ్ యూనియన్ కార్యకలాపాలు చట్టబద్ధమైనవే కాక అవసరమైనవి కూడా. ప్రస్తుత ఉత్పత్తి విధానం కొనసాగినంతకాలం, ట్రేడ్ యూనియన్‌ల మనుగడ తప్పనిసరి. అన్ని దేశాలలో ట్రేడ్ యూనియన్‌లను ఏర్పాటు చేయడం, వాటిని సమ్మేళనం చేయడం సాధారణమైన కార్యకలాపంగా సాగాలి. ఇదిలా ఉండగా ఈ ట్రేడ్ యూనియన్‌లన్నీ తమకు తెలియకుండానే కార్మికవర్గ నిర్మాణ కేంద్రాలను ఏర్పాటు చేస్తున్నాయి. మధ్యయుగాలలో మధ్యతరగతి వారు మునిసిపాలిటీలు, కమ్యూన్‌లు ఏర్పాటు చేసిన తీరులోనే ఇది జరుగుతున్నది. పెట్టుబడి, శ్రమల మధ్య గెరిల్లా పోరాటాల కోసమే కాక, *వేతన శ్రమను, పెట్టుబడి పాలనను తొలగించే నిర్మాణ సంస్థలుగా* ట్రేడ్‌యూనియన్లు మరింత అవసరం.

అదే డాక్యుమెంట్‌లో మార్క్సు ఆనాటి ట్రేడ్ యూనియన్లను విమర్శించాడు:

ఎందుకంటే అవి పూర్తిగా పెట్టుబడిపై స్థానిక, తక్షణ సమస్యల కోసం పోరాటాన్ని సాగిస్తూ వేతన బానిసత్వానికి వ్యతిరేకంగా పోరాటం చేయగలిగిన తమ శక్తిని పూర్తిగా అర్థం చేసుకోలేకపోతున్నాయి. అందువల్ల సాధారణ సామాజిక, రాజకీయ ఉద్యమాలకు దూరంగా ఉండిపోతున్నాయి. [30]

ఇంతకు సంవత్సరం ముందే జూన్ 20 నుంచి 27 వరకు జరిగిన జనరల్ కౌన్సిల్ సమావేశంలో ప్రసంగిస్తూ మార్క్సు ఇదే విధమైన వాదన చేశాడు. ఇది “వాల్యూ,

ప్రైస్ అండ్ ప్రాఫిట్" అనే పేరుతో మార్క్స్ మరణానంతరం అచ్చయింది.

> ఈ దైనందిన పోరాటాల తుది లక్ష్యాన్ని కార్మిక వర్గం అతిశయంగా చెప్పుకోకూడదు. వారు ఫలితాల కారణాలపై కాకుండ, ఫలితాలతోనే పోరాడుతున్న విషయం మరచిపోకూడదు. వారు పతన వేగాన్ని మాత్రమే తగ్గిస్తున్నామని, దాని దిశను మార్చటం లేదనే విషయం మర్చిపోకూడదు. వారు రోగానికి మందు వేయకుండా పైపూతలు పూస్తున్న విషయం మర్చిపోకూడదు. అందువల్ల నిరంతరం సాగే పెట్టుబడి దురాక్రమణలు, లేదా మార్కెట్ మార్పులలో తలెత్తే తప్పనిసరి గెరిల్లా పోరాటాల్లో కూరుకుపోకూడదు. ఎన్నో బాధలను బలవంతంగా రుద్దుతున్న ప్రస్తుత వ్యవస్థ అదే సమయంలో సమాజంలో ఆర్థిక పునర్నిర్మాణానికి అవసరమైన భౌతిక పరిస్థితులు, సామాజిక రూపాలను తీర్చిదిద్దుతున్న విషయం వారు అర్థం చేసుకోవాలి. సంప్రదాయువాదులు రూపొందించిన "సరైన పనిదినానికి సరైన వేతనమనే" నీతి సూత్రానికి బదులుగా "వేతన వ్యవస్థ రద్దు" అనే నినాదాన్ని తన విప్లవ నినాదంగా మార్చుకోవాలి. [31]

## 5. పెరుగుతున్న బలం

1866 చివర నుంచి యూరోప్ దేశాలలో సమ్మెలు తీవ్రమయ్యాయి. పెద్ద ఎత్తున కార్మికులే ఈ సమ్మెలు నిర్వహించారు. వాటి వలన పరిస్థితుల పట్ల కార్మికులకు అవగాహన పెరిగి, నూతనమైన ముఖ్యమైన పోరాటాలకు ప్రాతిపదికగా నిలవడానికి దోహదం చేసింది.

ఈ సమ్మెలకు ఇంటర్నేషనల్‌దే బాధ్యత అని ఆనాటి కొన్ని ప్రభుత్వాలు ఆరోపించాయి. కాని సమ్మెలు చేసిన కార్మికులలో చాలామందికి ఇంటర్నేషనల్ ఉందనేదే తెలియదు. ఘోరమైన పని పరిస్థితులు, దుర్భరమైన జీవన పరిస్థితులు వారి నిరసనలకు మూలకారణం. ఏది ఏమైనప్పటికి సమ్మెలు ప్రారంభమైన తరువాత ఇంటర్నేషనల్ వారితో సంబంధాలు నెలకొల్పుకొని సహకారమందజేసింది. ప్రకటనలు, ఐకమత్యం కోసం విజ్ఞప్తులు, సమ్మె చేసే వారి కోసం నిధులు సమీకరించడం తదితర అంశాలలో ఇంటర్నేషనల్ సహకారమందజేసింది. సమ్మె చేస్తున్న వారి ప్రతిఘటనను బలహీనపరచటానికి యజమానులు చేసే ప్రయత్నాలను వమ్ము చేయటానికి కూడా ఇంటర్నేషనల్ సహకరించింది.

ఇంటర్నేషనల్ నిర్వహించిన ప్రత్యక్ష పాత్ర కారణంగా అది తమ ప్రయోజనాలను

కాపాడుతుందని కార్మికులు గుర్తించటం ప్రారంభించారు. కొన్ని సందర్భాలలో తమను ఇంటర్నేషనల్‌కు అనుబంధంగా చేర్చుకోవాలని కూడా కోరారు.[32] 1867 ఫిబ్రవరి, మార్చిలలో పారిస్‌లోని ఇత్తడి కార్మికులు చేసిన సమ్మె ఇంటర్నేషనల్ సహకారమందించటం వలన విజయం సాధించింది. ఈ విధంగా విజయం సాధించిన సమ్మెల్లో ఇది మొదటిది. 1867 ఫిబ్రవరిలో మార్చియన్‌లో ఇనుము కార్మికులు చేసిన సమ్మె, 1867 ఏప్రిల్ నుంచి 1868 ఫిబ్రవరి వరకు సాగిన గని కార్మికుల సుదీర్ఘ సమ్మె, షార్లరాయ్ గని కార్మికుల సమ్మె, 1868 వసంత కాలంలో జెనీవా భవన నిర్మాణ కార్మికుల సమ్మె ఇంటర్నేషనల్ సహకారంతో విజయం సాధించాయి. ఈ సమ్మెల సందర్భంగా అన్ని చోట్ల ఒకే విధమైన పరిస్థితి ఏర్పడింది. సమ్మె చేసే వారికోసం ఇతర దేశాల్లోని కార్మికులు నిధులు సమీకరించారు. అంతేకాకుండా తమను పారిశ్రామిక కిరాయి మూకలుగా తయారు చేసే పనిని ఒప్పుకోకూడదని కూడా నిర్ణయించారు. అందువల్ల యజమానులు సమ్మె చేస్తున్న వారి డిమాండ్లను అంగీకరించక తప్పలేదు. సమ్మెలు జరిగిన పట్టణాలలో వందలాదిమంది ఇంటర్నేషనల్లో సభ్యులుగా చేరారు. ఆ తరువాత జనరల్ కౌన్సిల్ ఒక నివేదికలో పరిస్థితిని ఇలా వివరించింది: "సమ్మె చేయవలసిందిగా ఇంటర్నేషనల్ కార్మికులను కోరలేదు. కాని సమ్మెలు కార్మికులను ఇంటర్నేషనల్ దగ్గరకు చేర్చాయి."[33]

ఆ విధంగా వివిధ జాతులు, భాషలు, రాజకీయ సంస్కృతుల కారణంగా చాలా ఇబ్బందులు ఎదురైనప్పటికీ వివిధ రకాల ఆర్గనైజేషన్లు, యాదృచ్ఛిక పోరాటాల మధ్య ఐక్యత, సమన్వయం సాధించడంలో ఇంటర్నేషనల్ విజయవంతమైంది. తొలి లక్ష్యాలు, వ్యూహాల పాక్షిక స్వభావాన్ని అధిగమించి నిర్ణయాత్మకంగా వ్యవహరిస్తూ, అంతర్జాతీయ సహకారం, వర్గ సంఘీభావం అవసరం ఎంతైనా ఉందని రుజువు చేయడం ఇంటర్నేషనల్ ఘన విజయం.

ఈ లక్ష్యాలు సాధించడంతో, సభ్యత్వం పెంచుకోవడంతో, మరింత సమర్థ వంతమైన నిర్మాణంతో 1867 నుంచి ఇంటర్నేషనల్ యూరోపు అంతటా విస్తరించింది. ప్రత్యేకించి ఫ్రాన్స్‌లో 1867లో ఇంటర్నేషనల్ మరింత విస్తరించింది. లండన్ టైలర్స్ సమ్మె ఇంగ్లాండ్‌లో ప్రభావం చూపిన తీరులోనే ఫ్రాన్స్‌లో ఇత్తడి కార్మికుల సమ్మె తీవ్రమైన ప్రభావం చూపింది. పారిస్‌లో ఇంటర్నేషనల్ సభ్యత్వం వెయ్యికి, లియోన్‌లో 500కి పైన, వైయన్నెలో 500కి పైన పెరిగింది. ఏడు కొత్త విభాగాలు స్థాపించబడ్డాయి. మెడిటరేనియన్ సముద్రం దక్షిణ ప్రాంతంలో ఒక విభాగం ఏర్పడింది. (అయితే ఫ్రెంచి కార్మికులకే పరిమితమైంది). సమ్మెల తరువాత బెల్జియంలో కూడా ఇంటర్నేషనల్ అనుబంధ విభాగాలు పెరిగాయి. స్విట్జర్లాండ్‌లోని వర్కర్స్ లీగ్స్, సహకార సంస్థలు,

రాజకీయ సంఘాలు ఇంటర్నేషనల్‌లో చేరడానికి ఉత్సాహంగా దరఖాస్తులు చేశాయి. ఇంటర్నేషనల్‌కు జెనీవాలోనే 25 విభాగాలు ఏర్పడ్డాయి. వీటిలో జర్మనీ బృహత్ సమాఖ్య లోని కార్మికులలో ప్రచారం చేయడానికి జర్మన్‌లతో ఏర్పాటైన ఒక విభాగం ఉంది.

కాని బ్రిటన్‌లోనే ఇంటర్నేషనల్ ప్రభావం ఎక్కువగా ఉంది. 1867లో బ్రిటన్‌లో మరో పన్నెండు సంఘాలు ఇంటర్నేషనల్‌లో చేరాయి. సభ్యత్వం 50 వేలు దాటింది. ఇది రెండు సంవత్సరాలలో సాధించిన ప్రగతి అనేది మనం గుర్తుంచుకోవాలి. అప్పుడు ట్రేడ్ యూనియన్‌లలో ఉన్న మొత్తం కార్మికుల సంఖ్య ఎనిమిది లక్షలు. [34] వేరే ఎక్కడా కూడా ఇంటర్నేషనల్ సభ్యత్వం ఇంత మేర పెరగలేదు. (జనాభా నిష్పత్తి ప్రకారం కాకపోయినప్పటికీ సంఖ్యా బలం పెరిగింది). 1864-67 మధ్య కాలంలో ఈ ప్రగతి సాధ్యమైంది. కాని ఆ తరువాత పరిస్థితి మందకొడిగా తయారైంది. దీనికి అనేక కారణాలున్నాయి. అయితే ప్రధాన కారణమేమంటే ఫ్యాక్టరీ కార్మికులలోకి, నైపుణ్యం లేని కార్మికులలోకి చొచ్చుకు పోవడంలో ఇంటర్నేషనల్ విఫలమైంది. దీనికి మినహాయింపు యునైటెడ్ ఎక్స్‌కవేటర్స్ పరిశ్రమలోని కార్మిక సంఘాలు 1866 ఆగస్టు సమ్మె తరువాత ఇంటర్నేషనల్‌లో చేరడం. బ్రిటన్ ఉత్తర ప్రాంతంలోను, మధ్య ప్రాంతంలోను ఉన్న పెద్ద పరిశ్రమలలో పనిచేసే ఇనుము కార్మికులు కూడా ఇంటర్నేషనల్‌లో చేరారు. బ్రిటన్‌లోని బొగ్గు, జౌళి కార్మికులపై, ఇంజినీరింగ్ కార్మికులపై ఇంటర్నేషనల్ ప్రభావం ఏ మాత్రం లేదు (వారికి ప్రత్యేక నైపుణ్యాలు ఉన్నందువల్ల వారికి విదేశీ కార్మికుల నుంచి ఎటువంటి ప్రమాదం లేదు). భవన నిర్మాణ కార్మికులు ఎక్కువమంది ఇంటర్నేషనల్‌లో చేరారు. 'ఎమాల్గమేటెడ్ సొసైటీ ఆఫ్ కార్పెంటర్స్ అండ్ జాయినర్స్'కు చెందిన తొమ్మిది వేలమంది ఇంటర్నేషనల్‌లో చేరారు. ఈ సంస్థ కార్యదర్శి రాబర్ట్ అపెల్‌గార్త్ (1834-1924) జనరల్ కౌన్సిల్‌లో సభ్యుడు. మొత్తం సభ్యత్వంలో ఐదోవంతుకు ఆయన ప్రాతినిధ్యం వహించాడు. ఆ తరువాత టైలర్లు, చర్మ ఉత్పత్తులవారు, క్యాబినెట్ తయారీదారులు, బైండర్లు, రిబ్బన్ వీవర్లు, వెబ్ వీవర్లు, శాడ్లర్లు, సిగార్ తయారీదారులు ఇంటర్నేషనల్‌లో చేరారు. ఈ వృత్తులపై పారిశ్రామిక విప్లవం ప్రభావం లేదు. జనవరి 1867లో లండన్ ట్రేడ్స్ కౌన్సిల్ ఇంటర్నేషనల్‌తో సహకరించాలని నిర్ణయించింది. కాని ఇంటర్నేషనల్‌కు అనుబంధంగా పనిచేయటానికి సిద్ధపడలేదు. ప్రస్తుతం ఉన్న ప్రభావాన్ని మించి విస్తరించలేకపోతున్నదనే విషయాన్ని ఈ సంఘటన జనరల్ కౌన్సిల్‌కి తెలియచెప్పింది.

కార్మిక ఉద్యమం వ్యవస్థీకరణకు గురికావడం ఇంటర్నేషనల్ నెమ్మదించటానికి ఒక కారణమయింది. రిఫార్మ్ లీగ్ ప్రారంభించిన ఉద్యమం రిఫార్మ్ చట్టం రావడానికి

దోహదం చేసింది. పది లక్షలకు పైగా బ్రిటిషు కార్మికులకు ఓటు హక్కు లభించింది. ఆ తరువాత ట్రేడ్ యూనియన్లను చట్టబద్ధం చేయటంతో వేధించడం, అణచివేయడం అనే ప్రమాదం తప్పింది. సమాజంపై పత్రికల ప్రభావం పెరగసాగింది. తత్ఫలితంగా దేశాన్ని పాలిస్తున్న వ్యవహారజ్ఞులైన పాలకులు సంస్కరణ మార్గాన్నే అనుసరించారు. శ్రామిక వర్గాలు ఫ్రెంచి కార్మికుల మాదిరిగా కాకుండా భవిష్యత్తుపై ఎన్నో ఆశలు పెట్టుకొని శాంతియుత మార్పులను కోరుకున్నారు. [35] వాస్తవానికి బ్రిటన్ తప్ప తక్కిన యూరోప్‌లో పరిస్థితి భిన్నంగా ఉంది. జర్మన్ బృహత్ సమాఖ్యలో సమిష్టి వేతన సంప్రదింపుల వ్యవస్థ ఇంకా ఏర్పడలేదు. బెల్జియంలో సమ్మెలను యుద్ధ ప్రాతిపదికన అణచివేశారు. స్విట్జర్లాండ్‌లో సమ్మెలను అసంగతమైనవిగా పరిగణించి అధికారంలో ఉన్న వారు వాటిని సహించలేని పరిస్థితి ఏర్పడింది. ఫ్రాన్సులో సమ్మెలు చట్టబద్ధమైనవని 1864లో ప్రకటించారు. కాని తొలి కార్మిక సంఘాలు తీవ్రమైన ఆంక్షల మధ్య పని చేయవలసి వచ్చింది.

1867లో జరిగిన ఇంటర్నేషనల్ మహాసభ ఈ నేపథ్యంలో జరిగింది. విశాల ప్రాతిపదికపై విస్తరించడం వల్ల చేకూరిన నూతనశక్తితో ఇంటర్నేషనల్ మహాసభ జరుపుకుంది. సెప్టెంబర్ 2 నుంచి 8 వరకు జరిగిన మహాసభ విశేషాలను సేకరించడానికి 'ది టైమ్సు'తో పాటు కొన్ని ఇతర బూర్జువా పత్రికలు కరస్పాండెంట్లను పంపించాయి. ఈసారి కూడా స్విట్జర్లాండ్‌లోని లోజాన్ నగరంలో జరిగింది. ఆరు దేశాలనుంచి అరవైనాలుగు మంది ప్రతినిధులు హాజరయ్యారు. [36] (బెల్జియం, ఇటలీల నుంచి ఒక్కొక్కరు మాత్రమే హాజరయ్యారు.) పెట్టుబడి ప్రూఫ్‌లతో పని ఒత్తిడిలో ఉన్న మార్క్సు జనరల్ కౌన్సిల్ ముసాయిదాలు తయారుచేసినప్పుడు గాని, మహాసభకు గాని హాజరు కాలేదు. [37] ఈ ప్రభావం చాలా స్పష్టంగా కనిపించింది. సంస్థ వివిధ దేశాల్లో పెరుగుదలపై సాదాసీదా నివేదికలు, పరస్పరాశ్రయవాదులు ముందుకు తెచ్చిన 'ప్రౌధాన్' ఆలోచనలపై (సహకారోద్యమం, ఋణ సదుపాయాల ప్రత్యామ్నాయ వినియోగం ఇందులో ఉన్నాయి.) మహాసభ దృష్టి కేంద్రీకరించబడింది.

'లీగ్ ఫర్ పీస్ అండ్ ఫ్రీడం' అభ్యర్థన మేరకు యుద్ధం, సైనికవాదంపై చర్చ జరిగింది. ఇంటర్నేషనల్ మహాసభ జరిగిన వెంటనే లీగ్ తొలి మహాసభ జరగవలసింది. ఈ చర్చలు జరుగుతున్నప్పుడు బ్రసెల్స్ నుంచి వచ్చిన ప్రతినిధి సిజరె డు పాప్ (1841–1890) పెట్టుబడిదారీ వ్యవస్థలో యుద్ధాలు తప్పనిసరి అని ప్రకటించాడు. ఈ ప్రకటన తరువాతి రోజుల్లో యుద్ధం పట్ల కార్మికోద్యమ విధానానికి మార్గదర్శక మయింది. పాప్ ఇంటర్నేషనల్లో క్రియాశీలకమైన సిద్ధాంతవేత్తల్లో ఒకరు.

> జెనీవా 'శాంతి' మహాసభకు నా అభిప్రాయాలను తెలియజేయాలంటే : మీరు కోరుకుంటున్నట్లుగానే మేము కూడా శాంతిని కోరుకుంటున్నాం. జాతీయ సిద్ధాంతాలు లేదా దేశభక్తి మనుగడలో ఉన్నంత కాలం యుద్ధాలు జరుగుతూనే ఉంటాయి. రెండు వర్గాలు కొనసాగినంత కాలం యుద్ధాలు జరుగుతూనే ఉంటాయి. యుద్ధాలకు రాజుల రాజ్యకాంక్ష ఒక్కటే కారణం కాదు. (....) యుద్ధానికి నిజమైన కారణం పెట్టుబడిదారుల ప్రయోజనాలే. ఆర్థిక ప్రపంచంలో, రాజకీయ ప్రపంచంలో సమతౌల్యం లేనందువల్ల యుద్ధాలు వస్తున్నాయి. [38]

చివరకు మహిళల విమోచనపై చర్చ జరిగింది.[39] అంతేకాకుండా రవాణా, పంపిణీ వ్యవస్థలను ప్రభుత్వ యాజమాన్యంలో నిర్వహించాలన్న నివేదికకు అనుకూలంగా మహాసభలో ఓటు చేశారు [40] ఇంటర్నేషనల్ మహాసభ ఆమోదించిన సమష్టివాద ప్రకటనలలో ఇది మొదటిది. ఏది ఏమైనా భూమి యాజమాన్యాన్ని సమిష్టిపరం చేయాలన్న ప్రతిపాదనను పరస్పరాశ్రయవాదులు పూర్తిగా వ్యతిరేకించారు. దీనిపై లోతైన చర్చను తరువాతి మహాసభకు వాయిదా వేశారు.

## 6. పరస్పరాశ్రయవాదుల ఓటమి :

ఇంటర్నేషనల్ తొలి రోజుల నుంచి ఫ్రాన్స్‌లోను, స్విట్జర్లాండ్‌లోని ఫ్రెంచి భాష మాట్లాడే ప్రాంతంలోను, వల్లోనియా, బ్రసెల్స్ పట్టణాలలోను ప్రౌధాన్ ఆలోచనలు ఆధిపత్యంలో ఉండేవి. ప్రౌధాన్ అనుయాయులు ప్రత్యేకించి టులేన్, ఎర్నెస్ట్ ఎడ్వర్డ్ ఫ్రీబూలు 1864లో జరిగిన ఇంటర్నేషనల్ సంస్థాపన సమావేశంలోను, 1865 లండన్ సమావేశంలోను, జెనీవా, లోజాన్‌లలో జరిగిన మహాసభలలోను తమ ఆలోచనలకు మద్దతు సంపాదించడంలో కృతకృత్యులయ్యారు.

పరస్పరాశ్రయవాదులు నాలుగు సంవత్సరాల పాటు ఇంటర్నేషనల్లో అతి మితవాదులుగా ఉన్నారు. మెజారిటీగా ఉన్న బ్రిటిష్ ట్రేడ్ యూనియన్లు మార్క్స్ ప్రతిపాదించిన పెట్టుబడిదారీ వ్యతిరేకతను అంగీకరించేవారు కాదు. కాని సంస్థ విధానాలను ప్రౌధాన్ అనుయాయులు ప్రభావితం చేసినట్లుగా వీరు చేయలేకపోయారు.

ఫ్రెంచ్ అరాచకవాద సిద్ధాంతాలపై ఆధారపడిన పరస్పరాశ్రయవాదులు ఉత్పత్తిదారుల సహకార సంఘాలు ఏర్పాటు చేయడం ద్వారా, 'సెంట్రల్ పీపుల్స్ బ్యాంక్' ఏర్పాటు చేయడం ద్వారా కార్మికుల ఆర్థిక విమోచనను సాధించవచ్చని వాదించేవారు. ఏ రంగంలోనైనా ప్రభుత్వ జోక్యాన్ని వారు తీవ్రంగా వ్యతిరేకించేవారు. భూమిని, ఉ

త్పత్తి సాధనాలను సమాజపరం చేయాలన్న అభిప్రాయాలను, సమ్మెను ఆయుధంగా ఉపయోగించుకోవాలన్న వాదనను వారు వ్యతిరేకించేవారు. ఉదాహరణకు 1868లో కూడా సమ్మె ద్వారా పోరాటాలు చేయాలన్న ప్రతిపాదనను ఇంటర్నేషనల్‌లోని అనేక సెక్షన్లు వ్యతిరేకించేవి. దానికి ప్రతికూలమైన ఆర్థిక విలువలున్నాయని భావించేవారు. సమ్మెలపై 'లీజ్' సెక్షన్ సమర్పించిన నివేదిక దీనికి నిదర్శనం : 'సమ్మె ఒక పోరాటం. అందువల్ల బూర్జువాలకు, ప్రజలకు మధ్య ద్వేషాన్ని పెంచుతుంది. అది కలిసిమెలసి ఉండవలసినవారి మధ్య దూరం పెంచుతుంది'. [41] జనరల్ కౌన్సిల్ అభిప్రాయాలు, సూత్రీకరణల నుండి ఇంతకంటే ఎక్కువ దూరమైన అభిప్రాయాల్ని ఊహించలేము.

ఇంటర్నేషనల్‌పై ప్రౌధాన్ ప్రభావాన్ని తగ్గించడంలో మార్క్స్ కీలకమైన పాత్ర పోషించాడు. ఇంటర్నేషనల్ నాయకుల సైద్ధాంతిక అభివృద్ధికి మార్క్స్ ఆలోచనలు మౌలికమైనవి. ఇంటర్నేషనల్‌లో ప్రతి ప్రముఖ వివాదంలోను విజయం సాధించి తన శక్తి సామర్థ్యాలను చూపాడు. సహకారానికి సంబంధించి *1866 తాత్కాలిక జనరల్ కౌన్సిల్ ప్రతినిధుల ఆదేశాలలో* మార్క్స్ ఇలా ప్రకటించాడు :

"సామాజిక ఉత్పత్తిని స్వేచ్ఛతో కూడిన సహకార శ్రమ ఆధారంగా నడిచే విశాలమైన, సామరస్యపూరితమైన ఒకే వ్యవస్థగా మార్పు చేయాలంటే సమాజంలో మార్పులు తప్పనిసరి. *సాధారణ సామాజిక పరిస్థితులలో* మార్పులు *అవసరం.* వ్యవస్థీకృత సామాజిక శక్తి అయిన రాజ్యాంగయంత్రం పెట్టుబడిదారుల నుంచి ఉత్పత్తి దారులకు బదిలీ కాకుండా ఈ మార్పులు సాధ్యం కావు."

"సహకార స్టోర్ల ఏర్పాటు కాకుండా సహకార ఉత్పత్తి విధానాన్ని ఏర్పాటు చేసుకోవాలని, సహకార స్టోర్లు ప్రస్తుత ఆర్థిక వ్యవస్థ పై పొరను మాత్రమే తాకుతాయని, సహకార ఉత్పత్తి దాని మూలాలపై దాడి చేస్తుందని" [42] మార్క్స్ కార్మికులకు సలహా ఇచ్చాడు. అప్పటికే కార్మికులు తమంతతాము ప్రౌధాన్ సిద్ధాంతాలను వదిలిపెడుతున్నారు. వీటన్నిటినీ మించి, సమ్మెలు విస్తరించడంతో తమ ఆలోచనలు సరైనవి కావని పరస్పరాశ్రయవాదులు గుర్తించడం ప్రారంభించారు. తక్షణ పరిస్థితులను మెరుగుపరుచు కోడానికి, భవిష్యత్తు సమాజ నిర్మాణానికి అవసరమైన వర్గ చైతన్యం పెంపొందదానికి కార్మిక పోరాటాలు దోహదం చేశాయి. నిజజీవితపు స్త్రీ, పురుషులు హక్కులు, సామాజిక న్యాయం డిమాండ్ చేస్తూ పెట్టుబడిదారీ ఉత్పత్తిని నిలిపివేశారు. ఆ విధంగా వారు ఇంటర్నేషనల్‌లోని బలాబలాల్లో మార్పులు తెచ్చారు. సామాజిక బలాబలాల్లో చెప్పు కోదగిన మార్పులు తెచ్చారు. పారిస్‌లోని ఇత్తడి కార్మికులు, రువాన్, లియోన్‌లో వీవర్స్,

సెయింట్ – ఎటియన్‌లోని బొగ్గుగని కార్మికులు, ఇంటర్నేషనల్‌లోని ఫ్రెంచ్ నాయకులకు కనువిప్పు కలిగించారు. సైద్ధాంతిక చర్చలను మించిన ఆచరణలతో వారు ఈ పని చేయగలిగారు. భూమిని, పరిశ్రమలను సమాజపరం చేయవలసి ఉంటుందని వారు స్పష్టం చేశారు. ప్రౌథాన్ ఆలోచనలకు విరుద్ధంగా సామాజిక ఆర్థిక సమస్యను రాజకీయ సమస్య నుంచి విడదీయడం సాధ్యంకాదని కార్మికుల ఉద్యమం ఎలుగెత్తి చాటింది. [43]

1868 సెప్టెంబర్ 6 నుంచి 13 వరకు జరిగిన బ్రస్సెల్స్ ఇంటర్నేషనల్ మహాసభలో 99 మంది ప్రతినిధులు పాల్గొన్నారు. వీరిలో బ్రిటన్, ఫ్రాన్స్, స్విట్జర్లాండ్, జర్మనీ, స్పెయిన్ (ఒకరు), బెల్జియం నుంచి 45 మంది ప్రతినిధులు ఉన్నారు. [44] మహాసభలో పరస్పరాశ్రయవాదులు ఓటమికి గురయ్యారు. ఉత్పత్తి సాధనాలను సమాజపరం చేయాలంటూ డు పాప్ ప్రవేశపెట్టిన ప్రతిపాదన ఆమోదం పొందడంతో ఈ ప్రక్రియ తారస్థాయికి చేరుకుంది. సోషలిజానికి ఆర్థిక ప్రాతిపదిక నిర్ణయించడంలో ఇది నిర్ణయాత్మకమైన ముందడుగు. మేధావుల రచనల్లో మాత్రమే కాకుండా వివిధ దేశాల కార్మికులతో ఏర్పడిన సంస్థ కార్యక్రమంలో ఇది చోటుచేసుకుంది. గనులు, రవాణాకు సంబంధించి ఇంటర్నేషనల్ మహాసభ ఈ విధంగా ప్రకటించింది.

1. క్వారీలు, కొలైరీలు, ఇతర గనులతో పాటు రైల్వేలు కూడా రాజ్యం ప్రాతినిధ్యం వహించే సమిష్టికి చెందాలి. రాజ్యం కూడా న్యాయ చట్టాలకు కట్టుబడి ఉండాలి.
2. క్వారీలు, కొలైరీలు, ఇతర గనులు, రైల్వేలను ప్రస్తుతం సాగుతున్నట్టు పెట్టుబడిదారీ కంపెనీలకు ఇవ్వకూడదు. హేతుబద్ధంగా, శాస్త్రీయంగా నిర్వహించడానికి గ్యారంటీ ఇచ్చే కాంట్రాక్ట్ ఆధారంగా కార్మికుల కంపెనీలకు వాటిని అప్పగించాలి. వాటిని నడపడానికి అయ్యే ఖర్చులకు సమానంగా వాటి ధరలు ఉండేటట్టు చేయాలి. ఈ కంపెనీల జమా ఖర్చుల లెక్కలు పరిశీలించడానికి ప్రభుత్వానికి అవకాశం ఉండాలి. ఏకస్వామ్య కంపెనీలు ఏర్పడకుండా ఆపడానికి ఇది అవసరం. కంపెనీలలోని సభ్యుల మధ్య పరస్పర హక్కులకు గ్యారంటీ ఇచ్చే రెండో కాంట్రాక్ట్ కూడా ఉండాలి.

భూమి ఆస్తికి సంబంధించి కూడా మహాసభ ఈ విధంగా అంగీకరించింది :

> ఆధునిక సమాజంలో ఆర్థికాభివృద్ధి కోసం వ్యవసాయయోగ్యమైన భూమినంతటినీ సమాజపు ఉమ్మడి ఆస్తిగా మార్పుచేయవలసిన అవసరం ఏర్పడుతున్నది. గనులు, రైల్వేల మాదిరి షరతులతో భూమిని వ్యవసాయ

కంపెనీలకు ప్రభుత్వం అప్పచెప్పాలి.

కాలువలు, రోడ్లు, టెలిగ్రాఫ్‌కు సంబంధించి కూడా ఇదేవిధమైన ఏర్పాట్లు ఉండాలని నిర్ణయించింది :

> రోడ్లు, కమ్యూనికేషన్లకు సంబంధించి ఉమ్మడి సామాజిక నియంత్రణ ఉండాలని, అందువల్ల వాటిని కూడా సమాజపు ఉమ్మడి ఆస్తిగా మార్పు చేయాలని మహాసభ భావిస్తున్నది.

చివరగా పర్యావరణం గురించి కూడా మహాసభ కొన్ని ఆసక్తిభరితమైన అంశాలు చెప్పింది.

> అడవులను ప్రైవేట్ వ్యక్తులకు వదిలిపెడితే అవి నాశనమవుతాయని, ఊటలను, భూసారాన్ని పరిరక్షించడం సాధ్యంకాదని, అంతేకాకుండా ప్రజారోగ్యం, ప్రజల జీవితాలు నాశనమవుతాయనేది పరిగణనలోకి తీసుకుని, అడవులు కూడా సమాజపు ఉమ్మడి ఆస్తిగా ఉండాలని మహాసభ భావిస్తున్నది. [45]

రాజ్య యంత్రాంగం ఉత్పత్తి సాధనాలను సమాజపరం చేయాలని బ్రస్సెల్స్‌లో ఇంటర్నేషనల్ స్పష్టంగా ప్రకటించింది. [46] దీనితో జనరల్ కౌన్సిల్ ఘనవిజయం సాధించింది. ప్రపంచ కార్మికుల ఇంటర్నేషనల్ రాజకీయ కార్యక్రమంలో తొలిసారిగా సోషలిస్టు సిద్ధాంతాలు చేర్చబడ్డాయి.

వీటితోపాటు యుద్ధం సమస్యను కూడా మహాసభ చర్చించింది. దీనికి సంబంధించి బెకర్ చేసిన ప్రతిపాదన సారాంశానికి మహాసభ తీర్మాన రూపాన్ని మార్క్స్ ఇలా రాశాడు:

> యుద్ధాలను పూర్తిగా రూపుమాపవలసిన అవసరం కేవలం కార్మికులకు మాత్రమే ఉంది : అవి ఆర్థికపరమైనవి కావచ్చు, లేదా రాజకీయపరమైనవి కావచ్చు. వ్యక్తిగతమైనవి కావచ్చు లేదా జాతీయ యుద్ధాలు కావచ్చు. ఎందుకంటే, ఈ యుద్ధాలు చేసే పక్షాలు ఓడిపోయినా, గెలిచినా కూడా కార్మికులు తమ రక్తంతో, శ్రమతో తర్పణ చేయవలసి ఉంటుంది. [47]

ప్రతి యుద్ధాన్ని 'అంతర్యుద్ధంగా' పరిగణించాలని కార్మికులకు పిలుపు ఇచ్చారు. [48] సార్వత్రిక సమ్మెను కూడా ఉపయోగించుకోవాలని డు పాప్ సూచించాడు. [49] ఇది అర్థం లేని ప్రతిపాదన అని మార్క్స్ కొట్టిపారేశాడు. [50] కాని వాస్తవానికి ఆర్థిక పోరాటాలను దాటి వెళ్ళగలిగే వర్గ చైతన్యాన్ని అభివృద్ధి చేయడానికి ఇది దోహదం చేస్తుంది.

బ్రస్సెల్స్‌లో జరిగిన ఇంటర్నేషనల్ మహాసభలో సమిష్టివాదం నిలదొక్కుకుంది. ఆ తరువాత సంవత్సరం సెప్టెంబర్ 5 నుంచి 12 వరకు బాజల్‌లో జరిగిన మహాసభలో సమిష్టివాదం మరింత బలపడి ప్రౌధాన్ పుట్టినగడ్డ ఫ్రాన్స్‌లో కూడా ప్రౌధానిజం తుడిచిపెట్టుకు పోయింది. ఈ మహాసభకు 78 మంది ప్రతినిధులు హాజరయ్యారు. ఫ్రాన్స్, స్విట్జర్లాండ్, జర్మనీ, బ్రిటన్, బెల్జియంల నుంచే కాకుండా స్పెయిన్, ఇటలీ, ఆస్ట్రియాల నుంచి కూడా ప్రతినిధులు వచ్చారు. అమెరికా సంయుక్త రాష్ట్రాలలోని 'నేషనల్ లేబర్ యూనియన్' నుంచి కూడా ఒక ప్రతినిధి మహాసభకు హాజరయ్యారు. అమెరికా ప్రతినిధితో పాటు జర్మనీ నుంచి విల్‌హెల్మ్ లీబ్‌క్‌నెక్ట్ (1826–1900) కూడా హాజరు కావడం వల్ల మహాసభకు మంచి ఊపు వచ్చింది. మహాసభకు కొన్ని వారాల ముందు జర్మనీలో ఏర్పాటైన 'సోషల్ డెమోక్రాటిక్ పార్టీ ఆఫ్ జర్మనీ' ప్రతినిధిగా లీబ్‌క్‌నెక్ట్ మహాసభకు వచ్చాడు. ఈ మహాసభలో కొత్త ఆశలు చిగురించాయి. పెట్టుబడి పాలనను సవాలు చేయగలిగిన పరిస్థితి మరింత పెరిగింది. మహాసభ రికార్డులు, సాధారణ నివేదికలు, మహాసభకు హాజరైన కార్మికుల మనోభావాలు ఈ అంశాన్నే తెలిపాయి.

భూ సంబంధమైన ఆస్తులపై బస్సెల్స్ మహాసభ ఆమోదించిన తీర్మానాలను ధృవీకరించారు. తీర్మానానికి అనుకూలంగా 54 ఓట్లు, వ్యతిరేకంగా నాలుగు ఓట్లు వచ్చాయి. 13 మంది ఓటింగ్‌లో పాల్గొనలేదు. తర్వాత పారిస్ కమ్యూన్‌లో ప్రముఖంగా ముందుకొచ్చిన యూజిని వర్లిన్ (1838–71)తో పాటు 11 మంది ఫ్రెంచి ప్రతినిధులు 'భూమిపై వ్యక్తి యాజమాన్యాన్ని తొలగించే హక్కు సమాజానికి ఉందని, భూమిని సమాజానికి అప్పగించాలన్న' [51] తీర్మానాన్ని కూడా ఆమోదించారు. పదిమంది ఓటింగ్‌లో పాల్గొనలేదు. టులేన్‌తో సహా నలుగురు తీర్మానాన్ని వ్యతిరేకించారు. బాజల్ మహాసభ తరువాత ఫ్రాన్స్‌లోని ఇంటర్నేషనల్‌లో పరస్పరాశ్రయవాదులకు చోటు లేకుండా పోయింది.

మిఖయిల్ బకూనిన్ కూడా ప్రతినిధిగా పాల్గొనడంతో బాజల్ మహాసభకు ప్రాముఖ్యత వచ్చింది. 'లీగ్ ఫర్ పీస్ అండ్ ఫ్రీడం'లో నాయకత్వం సంపాదించడంలో విఫలం కావడంతో, 1868 సెప్టెంబర్‌లో జెనీవాలో 'ఇంటర్నేషనల్ ఎలయన్స్ ఫర్ సోషలిస్టు డెమోక్రసీ' అనే సంస్థను బకూనిన్ ప్రారంభించాడు. డిసెంబర్‌లో ఇంటర్నేషనల్ సభ్యత్వం కోసం ఈ సంస్థ దరఖాస్తు చేసింది. 'వర్గాలన్నిటినీ సమానం చేయాలన్న' [52] ఈ సంస్థ లక్ష్యం ఇంటర్నేషనల్ అవగాహనకు విరుద్ధంగా ఉందని చెబుతూ జనరల్ కౌన్సిల్ మొదట ఈ దరఖాస్తును తిరస్కరించింది. వర్గరహిత సమాజం కోసం ఇంటర్నేషనల్ పని చేస్తుందని జనరల్ కౌన్సిల్ వివరించింది. కానీ ఆ తరువాత ఎలయన్స్

తన కార్యక్రమాన్ని మార్చుకొని, దానిలోని శాఖలను రద్దు చేయడానికి అంగీకరించినందు వల్ల (వీటిలో ఎక్కువ బకూనిన్ ఊహలో మాత్రమే అస్తిత్వంలో ఉన్నాయి) [53] జులై 28, 1869న 104 మంది సభ్యులున్న జెనీవా సెక్షన్‌ను ఇంటర్నేషనల్‌లో చేర్చుకున్నారు. [54] బకూనిన్ గురించి మార్క్స్‌కు బాగానే తెలుసు. కాని ఇంటర్నేషనల్‌లో అతన్ని చేర్చుకోవడం లోని పర్యవసానాలను తక్కువ అంచనా వేశాడు. రష్యా విప్లవకారుడు బకూనిన్ ప్రభావం త్వరలోనే స్విట్జర్లాండ్, స్పెయిన్, ఫ్రెంచ్ సెక్షన్లపై పడింది. (పారిస్ కమ్యూన్ తరువాత ఈ ప్రభావం ఇటలీపై కూడా పడింది). బాజల్ మహాసభ చర్చలపై కూడా బకూనిన్ ప్రభావం పడింది. బకూనిన్ తన వాక్పటిమతో ఈ ప్రభావం చూపగలిగాడు. ఉదాహరణకు జనరల్ కౌన్సిల్ ప్రతిపాదించిన వారసత్వ హక్కుపై తీర్మానాన్ని ఓటింగ్‌లో ప్రతినిధులు తిరస్కరించారు. జనరల్ కౌన్సిల్ ప్రతిపాదనను మహాసభ తిరస్కరించడం ఇదే మొదటిసారి. [55] పరస్పరాశ్రయవాదులను ఓడించి ప్రౌధాన్ దయ్యాన్ని భూస్థాపితం చేసిన తరువాత, మరింత శక్తివంతుడైన ప్రత్యర్థిని మార్క్స్ ఎదుర్కోవలసి వచ్చింది. సమిష్టివాద అరాచకవాదం పేరుతో బకూనిన్ కొత్త ధోరణిని ప్రవేశపెట్టి, ఇంటర్నేషనల్‌ను తన ఆధిపత్యంలోకి తెచ్చుకోవడానికి ప్రయత్నించాడు.

## 7. యూరోపులో పరిణామాలు, ఫ్రాన్స్ – ప్రష్యా యుద్ధానికి వ్యతిరేకత:

1860 దశకం చివరి సంవత్సరాలలోను, 1870 దశకం ప్రారంభ సంవత్స రాలలోను ఎంతో విలువైన సామాజిక పోరాటాలు కొనసాగాయి. నిరసన కార్యకలాపాలలో పాల్గొన్న అనేక మంది కార్మికులు ఇంటర్నేషనల్‌తో సంబంధాలు నెలకొల్పుకోవాలని నిర్ణయించుకున్నారు. అప్పటికే ఇంటర్నేషనల్ ఖ్యాతి విస్తృతమవుతున్నది. వనరులు పరిమితమైనప్పటికీ తన యూరోపియన్ శాఖలకు సంఘీభావం ప్రకటించవలసిందిగా పిలుపు నివ్వడం ద్వారా, నిధుల సమీకరణ చేపట్టడం ద్వారా స్పందించడంలో ఏ సందర్భంలోనూ జనరల్ కౌన్సిల్ విఫలం కాలేదు. ఉదాహరణకు 1869 మార్చిలో బాజల్‌లోని ఎనిమిదివేల మంది సిల్క్ డైయర్స్, రిబ్బన్ వీవర్స్ సహాయం కోసం విజ్ఞప్తి చేశారు. జనరల్ కౌన్సిల్ తన దగ్గర ఉన్న నిధుల నుంచి నాలుగు పౌండ్లకు మించి పంపలేకపోయింది. కాని జనరల్ కౌన్సిల్ సర్క్యులర్ విడుదల చేయడంతో వివిధ దేశాలకు చెందిన కార్మిక బృందాల నుంచి 300 పౌండ్లు వసూలయ్యాయి. ఈ సందర్భంగా న్యూ కాజిల్ లోని ఇంజినీరింగ్ కార్మికులు తొమ్మిది గంటల పనిదినం కోసం సాగించిన పోరాటం చెప్పుకోదగినది. యజమానులు ఇతర దేశాల నుంచి కార్మికులను రప్పించి సమ్మెను భగ్నం చేయాలని చూసినపుడు, జనరల్ కౌన్సిల్ ప్రతినిధులు

జేమ్స్ కోహెన్, ఇక్కారియస్‌లు ఆ ప్రయత్నాలకు అడ్డుకట్ట వేశారు. సమ్మె విజయవంతం కావడం దేశవ్యాప్తంగా ఉత్సాహాన్ని నింపింది. ఇది ఇంగ్లీష్ పెట్టుబడిదారులకు హెచ్చరికగా పనిచేసింది. అప్పటినుంచి యూరోపులోని ఇతర దేశాల నుండి కార్మికులను రిక్రూట్ చెయ్యడం మానుకున్నారు. [56]

1869లో ఇంటర్నేషనల్ యూరోపులో చెప్పుకోదగిన స్థాయిలో విస్తరించింది. కాని బ్రిటన్‌లో అంతగా విస్తరించలేదు. ఏది ఏమైనప్పటికీ ఆగస్ట్‌లో బర్మింగ్‌హామ్‌లో సమావేశమైన ట్రేడ్స్ యూనియన్ మహాసభ సంస్థలోని సభ్యయూనియన్‌లన్నీ ఇంటర్నేషనల్‌లో చేరాలని సిఫార్సు చేసింది. ఈ విజ్ఞప్తిని పెడచెవిన పెట్టారు. అందువల్ల బ్రిటన్‌కు చెందిన యూనియన్లు ఇంటర్నేషనల్‌లో చేరడం 1867 స్థాయిలోనే మిగిలి పోయింది. యూనియన్ నాయకులంతా పరస్పరాశ్రయవాదులను వ్యతిరేకిస్తూ మార్క్స్‌కు మద్దతు తెలిపారు. అయితే సైద్ధాంతిక సమస్యలను పట్టించుకోడానికి వారికి సమయం లేదు. [57] వారిలో తగినంత విప్లవ పటిమ కూడా లేదు. ఈ కారణంగా జనరల్ కౌన్సిల్ నుంచి విడిగా ఇంటర్నేషనల్‌లో బ్రిటిష్ ఫెడరేషన్‌ను ఏర్పాటు చేయాలన్న ప్రతిపాదనను మార్క్స్ చాలాకాలం వ్యతిరేకిస్తూ వచ్చాడు.

యూరోపులో ఇంటర్నేషనల్ పటిష్టంగా తయారైన దేశాలలోని ఇంటర్నేషనల్ సభ్యులు ఆనాడు అస్తిత్వంలో ఉన్న యూనియన్ల నుంచి బయటకు వచ్చి సంఖ్యాబలాన్ని బట్టి కొత్త సెక్షన్లు ఏర్పాటు చేసుకున్నారు. అయితే బ్రిటన్‌లో ఇంటర్నేషనల్‌కు అనుబంధంగా ఉన్న పాత యూనియన్లు అలాగే ఉన్నాయి. ఇంటర్నేషనల్‌లో బ్రిటిష్ యూనియన్ల బలమే ఎక్కువ. అంతేకాకుండా బ్రిటన్‌లోనే ఉన్న జనరల్ కౌన్సిల్ రెండు కార్యకలాపాలను నిర్వహించేది. అది అంతర్జాతీయ ప్రధాన కేంద్రంగానూ అదే సమయంలో బ్రిటిష్ శాఖకి నాయకత్వంగాను పనిచేసేది. ఏది ఏమైనప్పటికీ బ్రిటన్ మినహా మిగిలిన యూరోపు దేశాలలో ఇంటర్నేషనల్ వ్యాప్తి చెందుతున్నప్పటికీ ఈ తరుణంలో ట్రేడ్ యూనియన్ల అనుబంధం ద్వారా 50,000 సభ్యులు ఇంటర్నేషనల్‌లో ఉండేవారు.

ఫ్రాన్స్‌లో 1868లో 'సెకండ్ ఎంపైర్' అణచివేత విధానాల కారణంగా అక్కడ ఇంటర్నేషనల్ తీవ్రమైన సంక్షోభంలో చిక్కుకుంది. రువాన్‌లోని ఒక్క సెక్షన్ మినహా ఫ్రాన్స్‌లోని మిగిలిన సెక్షన్లన్నీ అదృశ్యమయ్యాయి. కాని ఆ తరువాత సంవత్సరంలో ఫ్రాన్స్‌లో ఇంటర్నేషనల్ పుంజుకుంది. బ్రస్సెల్స్ మహాసభ తరువాత టులేన్ నాయకత్వం కోల్పోయాడు. పరస్పరాశ్రయవాద సిద్ధాంతాలను వదిలించుకున్న వర్లిన్ వంటి వారు నాయకత్వ స్థానాలకు వచ్చారు. ఫ్రాన్స్‌లో 1870లో ఇంటర్నేషనల్ బాగా విస్తరించింది.

కాని సభ్యుల నిజమైన సంఖ్య మాత్రం కొందరు రచయితలు కట్టుకథలు అల్లి ప్రజల్లో ప్రచారం చేసిన సంఖ్య కంటే బాగా తక్కువగా వుండేది. అయితే ఫ్రాన్స్‌లో ఆనాడున్న 90 రంగాలలో 38లో ఇంటర్నేషనల్‌కు ఏనాడూ చోటు దొరకలేదు. పారిస్‌లో ఇంటర్నే షనల్ సభ్యత్వం పదివేల స్థాయికి పెరిగింది. వీరంతా సహకార సంఘాలు, వృత్తి అసోసియేషన్లు, ప్రతిఘటన సంఘాల ద్వారా ఇంటర్నేషనల్‌కు అనుబంధంగా ఉన్నారు. రువాన్‌లో, లియోన్‌లో మూడు వేల చొప్పున సభ్యత్వం ఉంది. (ఇక్కడ జరిగిన తిరుగు బాటులో 1870లో 'పీపుల్స్ కమ్యూన్' ఏర్పాటు చేశారు. కాని తిరుగుబాటు దారులను పెద్ద ఎత్తున ఊచకోత కోశారు.) మార్సైల్ సభ్యత్వం నాలుగువేల కంటే ఎక్కువ ఉంది. ఫ్రాన్స్‌లో మొత్తం సభ్యత్వం 30 వేల కంటే ఎక్కువ ఉన్నట్టు అంచనా వేశారు. [58]

ఫ్రాన్స్‌లో ఇంటర్నేషనల్ నిజంగా ప్రజల సంస్థగా తయారుకాలేదు. కాని సంఖ్యాబలం పెరిగింది. ప్రజలలో విస్తృతమైన ఆసక్తిని రేకెత్తించింది. 'పాజిటివిస్టు ప్రొలిటేరియన్స్' అనే సంస్థ జనరల్ కౌన్సిల్‌కు పంపిన దరఖాస్తును బట్టి సంఖ్యాబలం అంచనా వేశారు. [59] ప్రౌధాన్ ప్రభావంతో ఇంటర్నేషనల్‌కు దూరంగా ఉంటూ వచ్చిన బ్లాంక్వి అనుచరులు ప్రజలలో ఇంటర్నేషనల్‌కు పెరుగుతున్న ఆదరణ చూసి, 1870 నుంచి ఇంటర్నేషనల్‌లో చేరడం ప్రారంభించారు. 1865లో టులేన్, ఫ్రీబూలు ఫ్రాన్స్‌లో ఇంటర్నేషనల్ విభాగాలను స్థాపించిన తరువాత చాలా పరిణామాలు సంభవించాయి. [60] ఈ తొలి సంస్థలు "అధ్యయన సంఘాల" స్థాయిని మించి వుండేవి కావు. [61] అయితే 1870 నాటికి సామాజిక సంఘర్షణ, రాజకీయ కార్యకలాపాలు ఫ్రాన్స్‌లో ఇంటర్నేషనల్‌కు కార్యరంగంగా మారాయి.

బెల్జియంలో 1868 బ్రస్సెల్స్ మహాసభ తరువాత సిండికలిజం అభివృద్ధి చెందింది. అనేక సమ్మెలు విజయవంతమయ్యాయి. అనేక కార్మిక సంఘాలు ఇంటర్నేషనల్‌కు అనుబంధంగా మారాయి. 1870 దశకం తొలి సంవత్సరాలలో ఇంటర్నేషనల్ సభ్యత్వం బాగా పెరిగింది. ఫ్రాన్స్‌లోని మొత్తం సభ్యత్వం కన్నా బెల్జియం సభ్యత్వం అధికంగా ఉండేది. బెల్జియంలో అత్యధిక సంఖ్యాబలం చేకూర్చుకున్న ఇంటర్నేషనల్ సమాజంపై కూడా విస్తృత ప్రభావం చూపగలిగింది.

ఈ కాలంలో స్విట్జర్లాండ్‌లో కూడా ఇంటర్నేషనల్ బాగా బలపడింది. ఇక్కడ 1870లో ఆరువేల మందికి ఇంటర్నేషనల్లో సభ్యత్వం ఉండేది. (అప్పట్లో దాదాపు ఏడు లక్షల మంది కార్మికులుండేవారు). వీరిలో రెండువేల మంది జెనీవాలోని 34 సెక్షన్లకు చెందినవారు. మరో 800 మంది జూరా ప్రాంతానికి చెందినవారు. తరువాత

బకూనిన్ కార్యకలాపాల కారణంగా స్విట్జర్లాండ్‌లో ఇంటర్నేషనల్ రెండు సమభాగాలుగా చీలిపోయింది. 1870 ఏప్రిల్‌లో జరిగిన రొమాండే ఫెడరేషన్ మహాసభలో రెండు భాగాలు ఒకదానితో ఒకటి తలపడ్డాయి. ఇంటర్నేషనల్ ఎలయన్స్ ఫర్ సోషలిస్ట్ డెమోక్రసీని ఫెడరేషన్‌లో చేర్చుకోవాలా లేదా అనే అంశంపై చర్చ జరిగింది. [62] ఈ అంశంపై రాజీ కుదరక, రెండు భాగాలు విడివిడిగా మహాసభలు జరుపుకున్నాయి. జనరల్ కౌన్సిల్ జోక్యం చేసుకొని రెండు భాగాల మధ్య సంధిని కుదిర్చింది. లండన్‌లోని నాయకత్వానికి అనుకూలంగా ఉన్న భాగం సంఖ్యలో చిన్నది. వారు రొమాండే ఫెడరేషన్ పేరును అలాగే ఉంచుకున్నారు. బకూనిన్ సన్నిహితులు జూరా ఫెడరేషన్ అని పేరు పెట్టుకున్నారు. ఈ ఫెడరేషన్‌కు కూడా ఇంటర్నేషనల్ గుర్తింపు ఇచ్చింది.

జెనీవాలో తొలి రష్యన్ ఇంటర్నేషనల్ విభాగాన్ని [63] ఏర్పాటు చేసిన నికొలాయ్ ఉటిన్ (1845–83), 1868 వేసవి నుంచి 1870 ఫిబ్రవరి వరకు బకూనిన్‌తో కలిసి పని చేసినప్పటికీ, స్విట్జర్లాండ్‌లో ఇంటర్నేషనల్ పూర్తిగా బకూనిన్ చేతిలో పడకుండా కాపాడిన జొహాన్ ఫిలిప్ బెకర్ రొమాండే ఫెడరేషన్‌కి నాయకులుగా ఉన్నారు. ఏది ఏమైనప్పటికీ జూరా ఫెడరేషన్ నిలదొక్కుకోవడం అనేది ఇంటర్నేషనల్‌లో అరాచక సమాఖ్యావాద (anarcho - federalist) ధోరణి కొనసాగడానికి దోహదం చేసింది. యువకుడైన జేమ్స్ గ్విల్లామ్ (1844–1916) దానికి నాయకత్వం వహించాడు. లండన్ నాయకత్వంతో ఏర్పడిన వివాదంలో ఈయన కీలకపాత్ర నిర్వహించాడు.

ఈ కాలంలో అనేక నగరాలలో ప్రత్యేకించి దక్షిణ యూరోపులో బకూనిన్ ఆలోచనలు వ్యాప్తి చెందడం ప్రారంభమైంది. కాని స్పెయిన్‌లో ఈ ఆలోచనలు త్వరితంగా వ్యాప్తి చెందాయి. యూరోపు వాయవ్య ప్రాంతంలోని స్పెయిన్, పోర్చుగల్, జార్జియా (Iberian Peninsula)లలో నేపుల్స్‌కు చెందిన అనార్కిస్టు జిసెప్పీ ఫానెల్లి కార్యకలాపాలతో ఇంటర్నేషనల్ అభివృద్ధి చెందింది. బకూనిన్ విజ్ఞప్తి మేరకు ఫానెల్లి అక్టోబర్ 1868 నుంచి ఫిబ్రవరి 1870 వరకు బార్సిలోనా, మాడ్రిడ్‌లలో పర్యటించి అక్కడ ఇంటర్నేషనల్ విభాగాలను, ఎలయన్స్ ఫర్ సోషలిస్టు డెమోక్రసీ (ఫానెల్లి ఇందులో సభ్యుడు) బృందాలను స్థాపించాడు. ఆయన పర్యటన లక్ష్యం నెరవేరింది. ఈ రెండు అంతర్జాతీయ సంస్థల డాక్యుమెంట్లను ఫానెల్లి కార్మికులకు అందజేశాడు. బకూనినిస్టులకుండే గందరగోళానికి ఇది ఉదాహరణ. వారి కలగాపులగపు సైద్ధాంతిక ధోరణికి తార్కాణం. ఎలయన్స్ ఫర్ సోషలిస్టు డెమోక్రసీ సిద్ధాంతాలతో స్పెయిన్ కార్మికులు ఇంటర్నేషనల్ ఏర్పాటు చేసుకున్నారు. అన్‌సెల్మో లొరెంజో (1841–1914) వంటి ముఖ్యమైన కార్యకర్తలను ఫానెల్లీ ఆకర్షించగలిగాడు. భవిష్యత్తులో స్పెయిన్ అధ్యక్షుడుగా

పనిచేసిన ఫ్రాన్సిస్కో పీమర్గల్ (1824–1901) స్పానిష్ భాషలోకి అనువదించిన ప్రౌధాన్ రచనలను ఆన్‌సెల్మో లొరెంజో అధ్యయనం చేశాడు. ఇవి అనేక రకాలుగా కల్తీ ఆలోచనలు. ఏది ఏమైనప్పటికీ తమనితాము సమీకరించుకొని పోరాటాలు నడపాలని కోరుకుంటున్న కార్మికోద్యమానికి ఇంటర్నేషనల్ ఆలోచనలు అందాయి. బాజల్ మహాసభలో స్పెయిన్ ప్రతినిధి రాఫేల్ ఫర్గా పెల్లిసెర్ (1840–90) తమ దేశంలో అనేక డజన్ల సెక్షన్లున్నాయని చెప్పాడు.

ఉత్తర జర్మనీ బృహత్ సమాఖ్యలో కార్మికోద్యమానికి లాసాల్ ఆలోచనా ధోరణికి చెందిన 'జనరల్ అసోసియేషన్ ఆఫ్ జర్మన్ వర్కర్స్', 'మార్క్సిస్టు సోషల్ డెమోక్రాటిక్ వర్కర్స్ పార్టీ ఆఫ్ జర్మనీ' అనే రెండు రాజకీయ పార్టీలున్నప్పటికీ ఇంటర్నేషనల్‌లో చేరాలనే అభిప్రాయం వారికి లేకుండా పోయింది. అధికారులు వేధిస్తారనే భయంతో జర్మన్ విప్లవకారులు ఇంటర్నేషనల్ ఏర్పడిన మూడు సంవత్సరాల వరకు దాని అస్తిత్వాన్ని పట్టించుకోలేదు. యూరోపులో ఇంటర్నేషనల్ ఖ్యాతి పెరిగిపోవడంతో, అది విజయాలు సాధిస్తుండడంతో 1868 తరువాత పరిస్థితిలో కొంత మార్పు వచ్చింది. అప్పటి నుంచి జర్మనీలో ప్రత్యర్థులుగా ఉన్న రెండు పార్టీలు ఇంటర్నేషనల్ విభాగం ఏర్పాటు చేయడానికి ముందుకు వచ్చాయి. లాసాల్ అనుయాయులతో సాగిస్తున్న ('జనరల్ అసోసియేషన్' నాయకుడు జోహాన్ బాప్టిస్ట్ వాన్ షువిట్జర్ (1833–75) తమ సంస్థను ఇంటర్నేషనల్‌కు అనుబంధంగా చేయడానికి ఎన్నడూ దరఖాస్తు చేయలేదు) పోరాటంలో లీబ్‌క్‌నెక్ట్ తమ సంస్థ మార్క్స్ ఆలోచనలకు దగ్గరగా ఉన్న అవకాశాన్ని ఉపయోగించదలచుకున్నాడు. కాని సోషల్ డెమోక్రాటిక్ పార్టీ ఆఫ్ జర్మనీని ఇంటర్నేషనల్‌కు అనుబంధంగా చేయడం కేవలం మొక్కుబడిలాగా జరిగింది. (ఏంగెల్స్ మాటల్లో చెప్పాలంటే అది కేవలం ఊహాలలో సాగిన బంధం). [64] అది కేవలం కనిష్టస్థాయి భౌతిక, భావజాలపరమైన బంధంగా సాగింది. ఆ పార్టీలో పదివేల మంది సభ్యులున్నప్పటికీ కొద్ది వందల మంది మాత్రమే ఇంటర్నేషనల్‌లో చేరారు. ప్రష్యాలో చట్టాలను అధిగమించడానికి వ్యక్తులుగా ఇంటర్నేషనల్‌లో చేరడానికి అనుమతించారు. [65] చట్టపరమైన ఇబ్బందుల కంటే జర్మన్ల బలహీనమైన అంతర్జాతీయ వాదం దీనికి కారణం. 1870 సంవత్సరం రెండో అర్ధ భాగంలో అంతర్గత అంశాలు ముందుకు రావడంతో ఆ ఉద్యమం మరింత బలహీనపడింది. [66]

జర్మనీ పరిమితులను సరిచెయ్యడానికన్నట్లు రెండు మంచి వార్తలు వెలువడ్డాయి. 1869 మేలో నెదర్లాండ్స్‌లో ఇంటర్నేషనల్ తొలి విభాగాలు ఏర్పాటయ్యాయి. అమ్‌స్టర్‌డామ్, ఫ్రీస్‌లాండ్‌లలో అవి నెమ్మదిగా పెరగసాగాయి. ఆ తరువాత కొద్ది

రోజుల్లోనే ఇటలీలో ఇంటర్నేషనల్ వేళ్లూనుకోవడం ప్రారంభించింది. అంతకు ముందు ఇంటర్నేషనల్ పరస్పర సంబంధాలు లేని కొద్ది కేంద్రాలకు పరిమితమై ఉండేది.

అమెరికా సంయుక్త రాష్ట్రాలకు కొత్తగా వలస వచ్చినవారు ఇంటర్నేషనల్ విభాగాలు ఏర్పాటు చేయడంతో అట్లాంటిక్ మహా సముద్రానికి ఆవలివైపు కనీసం ప్రతీకాత్మకంగానైనా చెప్పుకోదగిన పరిణామం చోటు చేసుకుంది. ఏది ఏమైనప్పటికీ ప్రారంభం నుంచి కూడా రెండు ప్రతిబంధకాలు ఉన్నాయి. అమెరికా సంయుక్త రాష్ట్రాలలో ఇంటర్నేషనల్ వాటిని ఏనాడూ అధిగమించలేకపోయింది. లండన్ ప్రధాన కార్యాలయం నుంచి పదేపదే హెచ్చరికలు చేసినప్పటికీ వివిధ సెక్షన్‌లలోని వలస వచ్చినవారి జాతీయ స్వభావాన్ని అధిగమించలేకపోయింది. అంతేకాకుండా అక్కడే జన్మించిన వారిని ఇంటర్నేషనల్‌లోకి ఆకర్షించలేకపోయింది. ఉత్తర అమెరికాలో జర్మన్, ఫ్రెంచ్, చెక్ జాతీయులతో 1870 డిసెంబర్‌లో ఇంటర్నేషనల్ విభాగాలు ఏర్పాటయ్యాయి. 'విదేశాలలో జన్మించిన వారు' మాత్రమే సభ్యులుగా వుండడం ఇంటర్నేషనల్ చరిత్రలోనే విలక్షణమైనది. అందువల్ల ఉత్తర అమెరికాలో ఇంగ్లీషు పత్రికను ఏర్పాటు చేయడం ఇంటర్నేషనల్‌కు సాధ్యం కాలేదు.

స్పష్టంగా కనిపిస్తున్న వైరుధ్యాలు, వివిధ దేశాల అభివృద్ధిలో తారతమ్యాలు తదితర పరిస్థితుల మధ్య 1870 సెప్టెంబర్‌లో ఇంటర్నేషనల్ ఐదో మహాసభ జరపాలని భావించారు. ముందుగా దీన్ని పారిస్‌లో జరపాలని అనుకున్నారు. కాని ఫ్రాన్స్ ప్రభుత్వం అణచివేత ప్రారంభించడంతో (జర్మనీలోని) మైంజ్ (Mainz) లో మహాసభ నిర్వహించాలని జనరల్ కౌన్సిల్ నిర్ణయించింది. ఇక్కడ జరిగితే తన ఆలోచనలకు దగ్గరగా వుండే జర్మన్ ప్రతినిధులలో ఎక్కువమంది బకూనిన్ అనుయాయుల పురోగతిని అడ్డుకోవడంలో సహాయపడతారని బహుశా మార్క్స్ ఆశించి వుండవచ్చు. కాని 1870 జులై 19న ఫ్రాన్స్ – ప్రష్యా యుద్ధం ప్రారంభం కావడంతో మహాసభను రద్దు చేయడం మినహా వేరే మార్గం లేకపోయింది.

యూరోపు మధ్యభాగంలో చెలరేగిన ఈ యుద్ధం కారణంగా ఆ రోజుల్లో ప్రముఖంగా ముందుకు వస్తున్న జాతీయవాదాలను అధిగమించి కార్మికోద్యమం స్వతంత్రమైన విధానాన్ని రూపొందించుకోవడం అత్యంత ప్రధానాంశం అయింది. ఫ్రాన్స్ – ప్రష్యా యుద్ధంపై మార్క్స్ తొలిసారిగా ప్రసంగించినపుడు, లూయీ బోనపార్టీ (1808–73)ని పారదోలాలని, 18 సంవత్సరాల పూర్వం ఆయన ఏర్పాటుచేసిన సామ్రాజ్యాన్ని తుడిచిపెట్టాలని ఫ్రెంచ్ కార్మికులకు పిలుపునిచ్చాడు. లూయీ బోనపార్టీ

ఓడిపోతే ఫ్రెంచ్ ప్రజలపై దాడులు జరగకుండా నిరోధించాలని మార్క్స్ జర్మన్ కార్మికులను కోరాడు :

ఆర్థికపరమైన తీవ్ర ఇబ్బందులు, రాజకీయపరమైన వెర్రితో కూడిన పాత సమాజంలో మాదిరిగా కాకుండా రూపుదిద్దుకుంటున్న కొత్త సమాజానికి శాంతి అనేది అంతర్జాతీయ సూత్రంగా ఉంటుంది. ఎందుకంటే దాని జాతీయ పాలకులు ఎక్కడైనా ఒకరే : శ్రామికవర్గం! ఈ నూతన సమాజానికి క్రాంతదర్శి 'ఇంటర్నేషనల్ వర్కింగ్ మెన్స్ అసోసియేషన్.' [67]

ఈ ప్రసంగం 30 వేల కాపీలను జెనీవాలో అచ్చువేశారు. ఇందులో 15 వేలు జర్మనీ కోసం, 15 వేలు ఫ్రాన్స్ కోసం అచ్చువేశారు. ఇంటర్నేషనల్‌కు సంబంధించి ఇది తొలి విదేశాంగ విధాన ప్రకటన. దీన్ని ఎంతో ఉత్సాహంగా సమర్థించిన వారిలో జాన్ స్టూవర్ట్ మిల్ (1806–73) కూడా ఉన్నారు. 'ఇందులో ప్రతిమాట అర్థవంతమైనదే. ఇంతకంటే తక్కువ మాటలతో ఈ విషయం చెప్పలేం' [68] అని ఆయన రాశాడు.

ఉత్తర జర్మనీ బృహత్ సమాఖ్య పార్లమెంట్‌లో ప్రత్యేక యుద్ధ బడ్జెట్‌పై జరిగిన ఓటింగ్‌లో 'సోషల్ డెమోక్రాటిక్ పార్టీ' నాయకులు విల్‌హెల్మ్ లీబ్‌కెనెక్ట్, ఆగస్ట్ బేబెల్ (1840–1913) మాత్రమే బడ్జెట్‌కు వ్యతిరేకంగా ఓటు చేశారు. [69] ఇంటర్నేషనల్ లోని ఫ్రెంచ్ విభాగాలు జర్మన్ కార్మికులతో స్నేహం, సంఘీభావం తెలియచేస్తూ సందేశాలు పంపాయి. యుద్ధంలో ఫ్రాన్స్ ఓటమిపాలు కావడం యూరోపులో మరింత శక్తివంతమైన జాతిరాజ్యాలు ఏర్పడడానికి దారితీసింది. దానినంటిపెట్టుకుని జాతి దురభిమానం ముందుకు వచ్చింది.

## 8. ఇంటర్నేషనల్ – పారిస్ కమ్యూన్

సెడాన్ నగరంలో జరిగిన యుద్ధంలో జర్మనీ విజయం సాధించింది. బోనపార్టీ బందీగా చిక్కాడు. 1870 సెప్టెంబర్ నాలుగున ఫ్రాన్స్‌లో 'మూడో రిపబ్లిక్' ఏర్పాటు చేశారు. ఫ్రాన్స్ బిస్మార్క్ షరతులకు అంగీకరించడంతో నాలుగు నెలలుగా సాగించిన పారిస్ ముట్టడికి 1871 జనవరి నాలుగో తేదీన విముక్తి లభించింది. సంధి కుదరడంతో ఎన్నికలు నిర్వహించారు. లెజిటిమిస్టులు, ఆర్లియనిస్టులు పెద్ద ఎత్తున మద్దతు ఇవ్వడంతో అడాల్ఫ్ తీర్స్ (1797 – 1877) మూడో రిపబ్లిక్ అధ్యక్షుడుగా నియమితులయ్యారు. అయితే రాజధాని పారిస్‌లో ప్రగతి కాముక – రిపబ్లికన్ శక్తులు విజయం సాధించాయి. ప్రజల్లో విస్తృతమైన అసమ్మతి చోటు చేసుకుంది. పారిస్ ప్రజలను నిరాయుధులుగా చేయాలని ప్రభుత్వం భావించడం, ఎటువంటి సామాజిక సంస్కరణలు అమలు

చేయకపోవడం వల్ల వారు తీర్స్‌కు ఎదురుతిరిగారు. మార్చి 18న కార్మికోద్యమ చరిత్రలో మొదటి గొప్ప రాజకీయ సంఘటన జరిగింది. అదే పారిస్ కమ్యూన్ ఏర్పాటు.

దేశభక్తితో కూడిన యుద్ధాన్ని విప్లవాత్మక యుద్ధంగా మార్చాలని బకూనిన్ పిలుపునిచ్చాడు.[70] కాని లండన్‌లోని జనరల్ కౌన్సిల్ మౌనం వహించాలని నిర్ణయించుకుంది. దీనికి సంబంధించి ఇంటర్నేషనల్ అభిప్రాయాలతో ఒక నివేదిక తయారుచేయవలసిందిగా జనరల్ కౌన్సిల్ మార్క్స్‌ను కోరింది. కాని సంక్లిష్టమైన, లోతైన కారణాలున్నందువల్ల నివేదిక అచ్చు వేయడంలో మార్క్స్ జాప్యం చేశాడు. వాస్తవంలో వివిధ శక్తుల మధ్య సంబంధాలు బాగా తెలిసినందువల్ల, పారిస్ కమ్యూన్ బలహీనతల గురించి స్పష్టమైన అవగాహన ఉన్నందువల్ల అది అపజయం పాలు కాక తప్పదని కూడా ఆయనకు తెలుసు. ఫ్రాన్స్ – ప్రష్యా యుద్ధంపై రెండోసారి 1870 సెప్టెంబర్‌లో ప్రసంగిస్తూ ఆయన ఫ్రెంచ్ కార్మిక వర్గాన్ని హెచ్చరించే ప్రయత్నం చేశాడు.

> శత్రువు పారిస్ తలుపులు తడుతున్న తరుణంలో ప్రస్తుత సంక్షోభంలో కొత్త ప్రభుత్వాన్ని కూలదోయడానికి ప్రయత్నించడం క్షమించరాని తప్పిదమవుతుంది. ఫ్రెంచ్ కార్మికులు (...) 1792 నాటి జాతీయ జ్ఞాపకాలలో పడి కొట్టుకుపోకూడదు. (...) వారు గతాన్ని పునః ప్రతిష్ఠించుకునే ప్రయత్నం చేయకూడదు. వారు భవిష్యత్తును నిర్మించు కోవాలి. కార్మికులు తమ వర్గ సంస్థ కార్యక్రమాల కోసం, రిపబ్లికన్ స్వేచ్ఛకి ఉన్న అవకాశాలను మెరుగు పర్చడానికి ప్రశాంతతతోను, నిర్ణయాత్మకం గానూ కృషి చేయాలి. ఫ్రాన్స్‌ను పునరుజ్జీవింపజేయడానికి, మనందరి లక్ష్యమైన కార్మిక విముక్తి సాధించడానికి అది మహత్తర శక్తులను ప్రసాది స్తుంది. రిపబ్లిక్ భవిష్యత్తు కార్మికుల శక్తి, విజ్ఞతపై ఆధారపడి ఉంటుంది.[71]

పారిస్ కమ్యూన్ విజయాన్ని వెనకా ముందు చూడకుండా పొగడడం ప్రారంభిస్తే యూరోపు అంతటా కార్మికులలో పొరపాటు ఆశలు రేకెత్తించే ప్రమాదం ఉంది. అది చివరకు అపనమ్మకానికి, నైతిక స్థైర్యం కోల్పోవడానికి దారితీస్తుంది. అందువల్ల మార్క్స్ తన అభిప్రాయాలు చెప్పే కార్యక్రమాన్ని వాయిదా వేయాలని నిర్ణయించుకున్నాడు. ఆయన వారాల తరబడి జనరల్ కౌన్సిల్ సమావేశాలకు హాజరు కాలేదు. భయానకమైన వాస్తవాలను ఆయన ముందుగానే ఊహించగలిగాడు. పారిస్ కమ్యూన్ ప్రకటించిన రెండు మాసాలు దాటిన తరువాత మే 28న దాన్ని రక్తపుటేరులలో ముంచెత్తారు. రెండు రోజుల తరువాత 'ది సివిల్ వార్ ఇన్ ఫ్రాన్స్' (ఫ్రాన్స్‌లో అంతర్యుద్ధం) అనే

పేరుతో రాసిన పుస్తకం రాత ప్రతులు పట్టుకొని మార్క్స్ జనరల్ కౌన్సిల్ సమావేశానికి హాజరయ్యాడు. దాన్ని చదివి ఏకగ్రీవంగా ఆమోదించారు. అప్పుడది జనరల్ కౌన్సిల్ సభ్యుల పేరుతో అచ్చుయింది. ఆ పుస్తకం తరువాత కొద్ది వారాల పాటు ఎంతగానో ప్రభావం చూపింది. 19వ శతాబ్దిలో అచ్చయిన కార్మికోద్యమ డాక్యుమెంట్లన్నిటికన్నా 'సివిల్ వార్ ఇన్ ఫ్రాన్స్' ఎక్కువ ప్రభావం చూపింది. ఇంగ్లీష్‌లో వెంట వెంటనే మూడు ఎడిషన్లు అచ్చువేశారు. కార్మికులు దీనిని ఎంతగానో ప్రశంసించారు. బూర్జువా వర్గాలలో కలకలం చోటు చేసుకుంది. ఆ పుస్తకాన్ని డజను భాషల్లోకి పూర్తిగా గాని పాక్షికంగా గాని అనువాదం చేశారు. యూరోపులోని అనేక దేశాలలో, అమెరికా సంయుక్త రాష్ట్రాలలో వార్తా పత్రికలు, మేగజైన్స్‌లో అచ్చయింది. చిన్న పుస్తకాల రూపంలో వెలువడింది.

ఉద్వేగభరితమైన మార్క్స్ సమర్థనతో పాటు, ప్రగతినిరోధక ప్రత్యర్థుల ఆరోపణలు, పారిస్ కమ్యూన్‌ను ఆకాశానికి ఎత్తాలని పిడివాద మార్క్సిస్టుల ప్రయత్నాలు ఉన్నప్పటికీ,[72] పారిస్ తిరుగుబాటును జనరల్ కౌన్సిల్ ముందుకు నెట్టిందని అనడంలో ఏ మాత్రం వాస్తవం లేదు. అయితే ఇంటర్నేషనల్‌కు చెందిన ప్రముఖులు కొందరు పారిస్ కమ్యూన్‌లో పాల్గొన్నారు. ఉదాహరణకు హంగెరీలో జన్మించిన లియో ఫ్రాంకెల్ (1844-96)ను కమ్యూన్ శ్రమ, వాణిజ్యం, పరిశ్రమలకు ఇన్‌చార్జ్‌గా నియమించింది. కాని పారిస్ కమ్యూన్ నాయకత్వమంతా తీవ్రవాదులైన జాకొబిన్ల చేతిలో ఉంది. మార్చి 26న జరిగిన మునిసిపల్ ఎన్నికలలో 85 మంది ప్రతినిధులను ఎన్నుకున్నారు.[73] వీరిలో 15 మంది మితవాదులు (వీరంతా మాజీ మేయర్లతో ఏర్పాటైన బృందం), నలుగురు తీవ్రవాదులు ఉన్నారు. - వీరు వెంటనే రాజీనామా చేసి పారిస్ కమ్యూన్ కౌన్సిల్ వైపు మళ్ళీ తిరిగి చూడలేదు. మిగిలిన 66 మందిలో 11 మందికి స్పష్టమైన రాజకీయాభిప్రాయాలేమీ లేవు; 14 మంది నేషనల్ గార్డ్ కమిటీ నుంచి వచ్చారు. 15 మంది రాడికల్ - రిపబ్లికన్లు, సోషలిస్టులు. వీరు కాక తొమ్మిది మంది బ్లాంక్విస్టులు, 17 మంది ఇంటర్నేషనల్ సభ్యులు ఉన్నారు.[74] వీరిలో ఎడ్వర్డ్ వెయిలన్ (1840-1915), బెనోయిట్ మలోన్ (1843-93), ఆగస్టే సెర్రాలియర్ (1840-72), జీన్ లూయిస్ పిండో (1840-1917), అల్బర్ట్ థీసెజ్ (1831-81), చార్లెస్ లోంగెట్ (1839-1903), ఇంతకుముందే ప్రస్తావించిన వర్లిన్, ఫ్రాంకెల్ కూడా ఉన్నారు. ఏది ఏమైనప్పటికీ వీరంతా భిన్నమైన రాజకీయాల నుంచి, సంస్కృతుల నుంచి వచ్చినందువల్ల వారు ఒక్కతాటిపై నడవలేకపోయారు. తరుచుగా వాళ్ళు భిన్నరకాలుగా ఓట్లు వేసేవారు. ఈ పరిస్థితి కూడా జాకోబిన్ల తీవ్రవాద రిపబ్లికనిజం ఆధిపత్యానికి అనుకూలంగా మారింది. 'కమిటీ ఆఫ్ పబ్లిక్ సేఫ్టీ' ఏర్పాటు చేయడంలో ఈ పరిస్థితి స్పష్టంగా కనిపించింది. (ఈ

ప్రతిపాదనకు జనరల్ కౌన్సిల్‌లో మూడింట రెండు వంతుల మెజారిటీ లభించింది. బ్లాంక్విస్టులు కూడా అనుకూలంగా ఓటు చేశారు.) "పారిస్ కమ్యూన్‌లో మెజారిటీ ఏ విధంగా చూసినప్పటికీ సోషలిస్టులు కారు, వారు సోషలిస్టులుగా ఉండే అవకాశం లేదు" అని మార్క్స్ స్పష్టం చేశాడు. [75]

వర్సైల్ నుంచి మూకలు పారిస్‌పై దాడి చేసినపుడు రక్తపాతం జరిగిన వారం రోజుల్లో (మే 21 నుంచి 28 వరకు) కమ్యూన్‌లోని దాదాపు పదివేల మంది హత మయ్యారు. వీరిలో కొంతమంది పోరాటంలో మరణిస్తే మరికొంతమందిని ఉరితీశారు. ఫ్రాన్స్ చరిత్రలో ఇది అత్యంత రక్తపాతంతో కూడిన సంఘటన. 43 వేల మందిని ఖైదీలుగా పట్టుకున్నారు. వీరిలో 13,500 మందికి ఆ తరువాత మరణశిక్ష విధించారు. కొంతమందికి జైలుశిక్ష విధించారు. కొంతమందికి కఠిన శ్రమ శిక్ష లేదా ప్రవాసశిక్ష విధించారు. (వీరిని ఫ్రెంచ్ వలసలలోని మారుమూల ప్రాంతమైన న్యూకాలెడోనియాకు ప్రవాసం పంపారు.) మరో ఏడువేల మంది పారిపోయి ఇంగ్లాండ్, బెల్జియం, స్విట్జర్లాండ్ లకు శరణార్థులుగా వెళ్లారు. ఇంగ్లండ్‌లోని సంప్రదాయవాద, ఉదారవాద పత్రికలు తీర్స్ సైనికుల పనిని పూర్తి చేశాయి. కమ్యూన్ దారుణమైన నేరాలకు పాల్పడినట్టు ఆ పత్రికలు ఆరోపించాయి. అహంకారులైన కార్మికుల తిరుగుబాటుపై నాగరికత విజయం సాధించిందని బాకా ఊదాయి. అప్పటినుంచి ఇంటర్నేషనల్‌పై దాడులు ప్రారంభ మయ్యాయి. పాలక వర్గానికి వ్యతిరేకంగా జరిగే ప్రతి చర్యకు ఇంటర్నేషనల్‌పై నిందలు వేయడం ప్రారంభించారు. 'చికాగోలో పెద్ద ఎత్తున జరిగిన దహనకాండకు ఇంటర్నేషనల్ హీనమైన చర్యలే కారణమని ప్రపంచవ్యాప్తంగా టెలిగ్రాఫ్ వ్యవస్థ ప్రకటించింది. వెస్టిండీస్‌ను అతలాకుతలం చేస్తున్న పెను తుఫానుకు కూడా అదే ఇంటర్నేషనల్ బాధ్యత వహించాలని ఆరోపించకపోవడం ఆశ్చర్యం కలిగిస్తున్నది'' అని మార్క్స్ వ్యాఖ్యానించాడు. [76]

ఇంటర్నేషనల్‌పై, తనపై పత్రికలు వేస్తున్న అభాండాలను తిప్పి కొట్టడానికి మార్క్స్‌కి రోజుల తరబడి పనిచేయాల్సి వచ్చేది. 'ఈ రోజుల్లో లండన్‌లో నేను తీవ్రమైన నిందలు ఎదుర్కొంటున్న చాలా ప్రమాదకరమైన వ్యక్తిగా చూడబడుతున్నాను'[77] అని మార్క్స్ రాశాడు. ఇదిలా ఉండగా పారిస్ తరువాత అదేవిధమైన తిరుగుబాట్లు తమ దేశాలలో కూడా రావచ్చుననే భయంతో యూరోపులోని ప్రభుత్వాలన్నీ అణచివేత చట్టాలకు మరింత పదునుపెట్టాయి. ఫ్రాన్స్‌లో తీర్స్ వెంటనే ఇంటర్నేషనల్‌ను నిషేధించాడు. బ్రిటన్‌లో కూడా ఇంటర్నేషనల్‌ను నిషేధించాలని ఆయన బ్రిటిష్ ప్రధాని విలియం ఎవర్ట్ గ్లాడ్‌స్టన్ (1809-98)కి విజ్ఞప్తి చేశాడు. ఇంటర్నేషనల్‌కు సంబంధించి

ఇది తొలి దౌత్యపరమైన వ్యవహారం. పోప్ పయస్ – IX (1792–1878) స్విట్జర్లాండ్ ప్రభుత్వంపై ఇదే విధమైన ఒత్తిడి తెచ్చాడు. 'స్విట్జర్లాండ్‌లోని ఇంటర్నేషనల్ విభాగం పట్ల సహనం వహించడం తీవ్రమైన పొరపాటు. యూరోపు మొత్తంలో వారు పారిస్‌ను పునరావృతం చేయడానికి ప్రయత్నిస్తున్నారు. దేవునికి, మానవజాతికి శాశ్వత శత్రువులైన వారికి అనుకూలంగా ఈ పెద్దమనుషులు (...) పని చేస్తున్నారు. వారిపట్ల జాగ్రత్తగా ఉండాలి'[78] అని పోప్ హెచ్చరించాడు. ఈ ఒత్తిడి వల్ల పిరనీస్ పర్వత ప్రాంతాల ఆవలి నుంచి శరణార్థులను అప్పగించడానికి ఫ్రాన్స్, స్పెయిన్‌ల మధ్య ఒప్పందం కుదిరింది. బెల్జియం, డెన్మార్క్‌లలో ఇంటర్నేషనల్‌పై అణచివేత చర్యలు ప్రారంభించారు. ప్రవాసంపై తన సిద్ధాంతాలు మార్చుకోవడానికి ఇష్టంలేని బ్రిటన్ ఏ చర్య తీసుకోలేదు. జర్మనీ, ఆస్ట్రో – హంగేరియన్ ప్రభుత్వాల ప్రతినిధులు 1872 నవంబర్‌లో బెర్లిన్‌లో సమావేశమై 'సామాజిక సమస్య పై ఉమ్మడి ప్రకటన విడుల చేశారు :

1. ఇంటర్నేషనల్ అనుసరిస్తున్న ధోరణులు బూర్జువా సమాజానికి పూర్తిగా విరుద్ధమైనవి, ప్రతికూలమైనవి. అందువల్ల వాటిని శక్తివంతంగా తిప్పికొట్టాలి.
2. సమావేశాలకున్న స్వేచ్ఛను ఇంటర్నేషనల్ తీవ్రంగా దుర్వినియోగం చేస్తున్నది. తన సిద్ధాంతాలు, ఆచరణను ముందుకు తెస్తున్నది. అందువల్ల ప్రభుత్వాల చర్యలు కూడా అంతర్జాతీయంగా ఉండాలి. అందువల్ల దానిపై చర్యలు ప్రభుత్వాలన్నిటి మధ్య సంఘీభావంతో కూడుకుని ఉండాలి.
3. ఫ్రాన్స్‌లో మాదిరిగా ప్రత్యేక చట్టాలు చేయడానికి కొన్ని ప్రభుత్వాలు సిద్ధంగా లేక పోయినప్పటికీ ఇంటర్నేషనల్‌కు, హానికరమైన దాని కార్యకలాపాలకు ఎటువంటి స్థానం లేకుండా రూపుమాపాలి.[79]

చివరిగా, ఇటలీ కూడా ఇంటర్నేషనల్‌పై దాడి చేసింది. ఈ సందర్భంగా గుర్తుంచుకోవలసిందేమంటే, ఇంటర్నేషనల్ పట్ల ఆశలు పెట్టుకున్న మాజిని కూడా ఇంటర్నేషనల్ సిద్ధాంతాలు 'దేవుడికి (...), దేశానికి (...), వ్యక్తిగత ఆస్తికు వ్యతిరేకంగా ఉన్నాయి[80] అని చెప్పాడు.

పారిస్ కమ్యూన్‌పై విమర్శలు కార్మికోద్యమంలోని సెక్షన్లకు కూడా వ్యాపించాయి. 'ది సివిల్ వార్ ఇన్ ఫ్రాన్స్' ప్రచురించిన తరువాత పత్రికల ప్రతికూల ప్రచారానికి లొంగి ఇద్దరు ట్రేడ్ యూనియన్ నాయకులు జార్జ్ ఓడ్గర్, పాత చార్టిస్టు బెంజమిన్ లుక్రాఫ్ట్ (1809–97) ఇంటర్నేషనల్‌కు రాజీనామా చేశారు. కాని ఏ ట్రేడ్ యూనియన్ కూడా ఇంటర్నేషనల్‌కు మద్దతు ఉపసంహరించుకోలేదు. దీన్నిబట్టి బ్రిటన్‌లో

ఇంటర్నేషనల్ అభివృద్ధి చెందకపోవడానికి కారణమేమిటో మరోసారి వ్యక్తమైంది. బ్రిటన్‌లో కార్మికవర్గంలో ఉన్న రాజకీయ ఉదాసీనతే దీనికి కారణం.[81]

పారిస్‌లో రక్తపాతం జరిగినప్పటికీ, దుష్ప్రచారం జరుగుతున్నప్పటికీ, యూరోపులో ప్రభుత్వాలు అణచివేస్తున్నప్పటికీ పారిస్ కమ్యూన్ తరువాత ఇంటర్నేషనల్ బలం బాగా పెరిగింది. దాని ప్రతిష్ట పెరిగింది. పెట్టుబడిదారీ వర్గాలకు, మధ్యతరగతి వారికి అది ప్రస్తుత వ్యవస్థను కూలదోసే ప్రమాదంగా తయారైంది. కార్మిక వర్గాలలో దోపిడి, అన్యాయం లేని ప్రపంచం ఏర్పాటుపట్ల ఆశలను మరింతగా పెంచింది.[82] పారిస్ తిరుగుబాటుతో కార్మికోద్యమంలో మరింత విప్లవాత్మక పోరాట పటిమ, అభివృద్ధి కావాలన్న అభిప్రాయం బలపడింది. విప్లవం సాధ్యమని, పెట్టుబడిదారీ సమాజానికి పూర్తిగా భిన్నమైన సమాజం ఏర్పాటు లక్ష్యంగా నిర్ణయించుకోవాలని అనుభవం చెబుతున్నది. ఈ లక్ష్య సాధనకు కార్మికులు చెక్కుచెదరని రాజకీయ వ్యవస్థలు ఏర్పాటు చేసుకోవాలని కూడా అనుభవం స్పష్టం చేసింది.[83]

ప్రతిచోట పెద్ద ఎత్తున ఉత్సాహం చోటు చేసుకుంది. జనరల్ కౌన్సిల్‌కు హాజరయ్యే వారి సంఖ్య రెట్టింపైంది. ఇంటర్నేషనల్‌కు సంబంధం ఉన్న వార్తాపత్రికల సంఖ్య, వాటి అమ్మకాలు కూడా పెరిగాయి. సోషలిస్టు సిద్ధాంతాల వ్యాప్తికి పనిచేసిన పత్రికలలో జెనీవా నుంచి వెలువడే 'లా ఇగాలిటి' ఒకటి. ప్రారంభంలో ఇది బకూనినిస్టుల పత్రిక. కాని 1870లో సంపాదకుడు మారడంతో ఈ పత్రిక స్విట్జర్లాండ్‌లో ఇంటర్నేషనల్‌కు ప్రధానమైన ప్రసార సాధనంగా తయారైంది. లీప్‌జిగ్ నుంచి వెలువడే సోషల్ డెమొక్రాటిక్ వర్కర్స్ పార్టీ పత్రిక 'ఫోక్స్‌స్టాట్', మాడ్రిడ్ నుంచి వెలువడే స్పానిష్ ఫెడరేషన్ అధికార పత్రిక 'లా ఇమాన్సిపేషన్'. మిలన్ నుంచి వెలువడే 'ఇల్ గజ్జెట్టినొ రోజా' పారిస్ సంఘటనల తరువాత ఇంటర్నేషనల్‌లో భాగమైంది. డెన్మార్క్ కార్మికులు నడిపే 'సోషలిస్టెన్', రువాన్ నుంచి వెలువడే 'లా రిఫార్మ్ సోషల్'లు సోషలిస్టు సిద్ధాంతాలను ప్రచారం చేసేవి.[84]

చివరిగా గుర్తించవలసిన విషయమేమిటంటే బెల్జియం, స్పెయిన్‌లలో ఇంటర్నేషనల్ విస్తరించడం ప్రారంభించింది. పారిస్ కమ్యూన్ కంటే ముందే ఈ రెండు దేశాలలో కార్మికులు ఇంటర్నేషనల్ కార్యకలాపాలలో పాల్గొనేవారు. మాజినీ అనుచరులు అనేకమంది తమ నాయకుడు అనుసరించిన విధానాలకు అసంతృప్తి చెంది, ఇంటర్నేషనల్‌తో చేతులు కలిపి, త్వరలోనే ప్రముఖ నాయకులుగా తయారయ్యారు. జిసెప్పీ గారిబాల్డి మద్దతు సంపాదించడం దీనికన్నా ముఖ్యమైన విషయం. అయితే

లండన్‌నించి పనిచేస్తున్న ఇంటర్నేషనల్ గురించి అంత స్పష్టంగా తెలియనప్పటికీ [85] ఈ 'రెండు ప్రపంచాల కథానాయకుడు' ఇంటర్నేషనల్‌లో చేరాలని నిర్ణయించుకొని దరఖాస్తు చేస్తూ లేఖ రాశాడు. ప్రసిద్ధి చెందిన వాక్యం ఒకటి అందులో ఉంది : 'ఇంటర్నేషనల్ భవిష్యత్తుకు సూర్యుని వంటిది'.[86]

ఈ లేఖని అనేక కార్మికుల న్యూస్ షీట్స్, పత్రికలలో ప్రచురించారు. ఇంటర్నేషనల్‌లో చేరాలా, వద్దా అని ఊగిసలాడే అనేక మంది అందులో చేరడానికి ఈ లేఖ ప్రేరణనిచ్చింది. పోర్చుగల్‌లో 1871 అక్టోబర్‌లో స్థాపించిన ఇంటర్నేషనల్‌కు కొత్త సెక్షన్లు ఏర్పాటు చేశారు. అదే నెలలో డెన్మార్క్‌లోని కోపెన్ హాగన్, జుట్లాండ్‌లలోని కొత్తగా ఏర్పాటైన ట్రేడ్ యూనియన్లను ఇంటర్నేషనల్‌కు అనుబంధం చేశారు. బ్రిటన్‌లో ఐరిష్ కార్మికుల సెక్షన్లు ఏర్పాటు కావడం మరో ముఖ్యమైన పరిణామం. వీరి నాయకుడు జాన్ మెక్‌డొనెల్‌కి జనరల్ కౌన్సిల్ తరఫున ఐర్లాండ్‌తో ఉత్తర ప్రత్యుత్తరాలు నడిపే బాధ్యత అప్పగించారు. ప్రపంచంలోని వివిధ ప్రాంతాల నుంచి ఇంటర్నేషనల్‌కు అనుబంధం కోరుతూ అభ్యర్థనలు వచ్చాయి : కలకత్తాలోని ఇంగ్లీష్ కార్మికులు, విక్టోరియా, ఆస్ట్రేలియా, క్రైస్ట్‌చర్చ్, న్యూజిలాండ్ నుంచి, బ్యూనస్‌ఐరిస్‌లోని అనేక వృత్తి కార్మికుల బృందాల నుంచి ఇంటర్నేషనల్‌కు దరఖాస్తులు వచ్చాయి.

## 9. 1871లో జరిగిన లండన్ సమావేశం

ఇంటర్నేషనల్ మహాసభ జరిగి రెండు సంవత్సరాలు గడిచిపోయింది. కాని యూరోపులో నెలకొన్న పరిస్థితుల కారణంగా కొత్త మహాసభ జరపడానికి వీలుకాలేదు. అందువల్ల లండన్‌లో సమావేశం నిర్వహించాలని జనరల్ కౌన్సిల్ నిర్ణయించింది. 1871 సెప్టెంబర్ 17 నుంచి 23 వరకు ఈ సమావేశం జరిగింది. 22 మంది ప్రతినిధులు మాత్రమే హాజరయ్యారు.[87] బ్రిటన్ ( తొలిసారిగా ఐర్లండ్‌కి కూడా ప్రాతినిధ్యం వుంది), బెల్జియం, స్విట్జర్లాండ్, స్పెయిన్‌ల ప్రతినిధులతో పాటు ఫ్రెంచి ప్రవాసులు కూడా మహాసభకు హాజరయ్యారు. సమగ్రప్రాతినిధ్యం ఉండేట్లుగా ప్రయత్నాలు జరిగినప్పటికీ అది జనరల్ కౌనిసల్ విస్తృత సమావేశం మాదిరిగా జరిగింది.

'విధానపరమైన, నిర్మాణపరమైన సమస్యలపై మాత్రమే' [88] చర్చలు జరుగుతాయని మార్క్స్ ముందుగానే ప్రకటించాడు. సైద్ధాంతిక చర్చలను ఆయన పక్కన పెట్టాడు. సమావేశం మొదటి సెషన్‌లో ఆయన ఈ విధంగా ప్రకటించాడు :

> అనేక దేశాలలో ఇంటర్నేషనల్ ఎదుర్కొంటున్న ప్రమాదాలకు విరుగుడుగా తీసుకోవలసిన చర్యలు, పరిస్థితులకు అనుగుణంగా నూతన నిర్మాణం

వైపు అడుగు వేయడానికి తీసుకోవలసిన చర్యలపై చర్చించడానికి వివిధ దేశాల ప్రతినిధులతో సమావేశం నిర్వహించాలని జనరల్ కౌన్సిల్ నిర్ణయించింది. ఇంటర్నేషనల్‌ను ధ్వంసం చేయడానికి ప్రభుత్వాలు తమకు అందుబాటులో ఉన్న మార్గాలన్నిటినీ అనుసరిస్తున్నందువల్ల వాటిని ప్రతిఘటించడానికి తగు విధానాలు రూపొందించే కృషి చేయడానికి సమావేశం జరుపుకుంటున్నాం. చివరిగా స్విట్జర్లాండ్ వివాదాన్ని తుదకంటా పరిష్కరించడం కూడా ఈ సమావేశం ఉద్దేశ్యం.[89]

ఇంటర్నేషనల్‌ని పునర్నిర్మించడానికి, దానిని శత్రుమూకల దాడులనుంచి రక్షించుకోవడానికి, పెరుగుతున్న బకూనిన్ ప్రభావాన్ని అరికట్టడానికి మార్క్స్ తన శక్తులన్నిటినీ కూడదీసుకున్నాడు. సమావేశంలో అందరికన్నా చురుకుగా పనిచేసిన ప్రతినిధి మార్క్స్. 102 సార్లు వేదికపై ప్రసంగించాడు. తన ఆలోచనలకు భిన్నంగా ఉన్న ప్రతిపాదనలను నిరోధించడానికి, ఆమోదం పొందని ప్రతిపాదనలను ఆమోదింపజేయడానికి[90] ఆయన కృషి చేశాడు. లండన్ సమావేశం ఇంటర్నేషనల్‌లో మార్క్స్ స్థానాన్ని ధృవీకరించింది. ఇంటర్నేషనల్ రాజకీయ పంథా నిర్ణయించే మేధోస్ఫూర్తిగానే కాక పోరాట పటిమ కలిగిన మిలిటెంట్‌గా కూడా మార్క్స్ వ్యవహరించాడు.

బ్లాంక్విస్టు వైలాన్, అతని అనుచరులు ప్రతిపాదించిన తీర్మానం- IX ఆమోదించడం ద్వారా సమావేశం చారిత్రాత్మకమైన నిర్ణయం తీసుకుంది. ఈ ఆమోదం వల్ల ఈ సమావేశాన్ని చిరకాలం గుర్తుంచుకోవలసి ఉంది. పారిస్ కమ్యూన్ ముగిసిన తరువాత మిగిలిన బలంతో ఇంటర్నేషనల్‌లో చేరిన బ్లాంక్విస్టు నాయకుడు ఈ తీర్మానం ప్రవేశపెట్టాడు. ఇంటర్నేషనల్‌ను జనరల్ కౌన్సిల్ నాయకత్వంలో కేంద్రీకృతమైన, క్రమశిక్షణ కలిగిన పార్టీగా మార్పు చేయాలని ఆ నాయకుడు ప్రతిపాదించాడు. అయితే వైలాన్ బృందంతో మార్క్స్‌కు కొన్ని విభేదాలున్నాయి. విప్లవం చేయడానికి సమర్థవంతంగా తయారైన చిన్న విప్లవకారుల బృందం సరిపోతుందని బ్లాంక్విస్టుల ఆలోచన. మార్క్స్‌కు ఈ ఆలోచనతో ఏకీభావం లేదు. అయినప్పటికీ ఇంటర్నేషనల్‌ను పార్టీగా రూపొందించాలన్న తీర్మానాన్ని ఆమోదించడంలో మార్క్స్ ఏ మాత్రం జాప్యం చేయలేదు. ఇంటర్నేషనల్‌లో బకూనిన్ తరహా అరాచకవాదానికి వ్యతిరేకతను కూడగట్టడమే కాకుండా వర్గ పోరాటం నూతన దశలో అవసరమైన మార్పులపై ఏకాభిప్రాయం సాధించడానికి మార్క్స్ ఈ ప్రతిపాదనను ఆమోదించాడు. అందువల్ల లండన్ తీర్మానం ఈ విధంగా స్పష్టం చేసింది :

ధనిక వర్గాల సమిష్టి శక్తిని ఎదుర్కోడానికి కార్మికవర్గం ఒక వర్గంగా పనిచేయాలంటే రాజకీయ పార్టీ ఏర్పాటు చేయడం ద్వారా మాత్రమే సాధ్యమవుతుంది. ఈ పార్టీ ధనిక వర్గాలు ఏర్పాటు చేసే అన్ని పార్టీలకంటే భిన్నమైనదిగా, వాటికి వ్యతిరేకంగా ఉంటుంది. సామాజిక విప్లవాన్ని విజయవంతం చేయడానికి, అంతిమ లక్ష్యమైన వర్గ నిర్మూలన సాధించుకోవడానికి కార్మికవర్గ రాజకీయ పార్టీ ఏర్పాటు చేయడం అవసరం. అంతే కాకుండా కార్మికవర్గం సాగించిన ఆర్థిక పోరాటాల ద్వారా కూడగట్టిన శక్తులు భూస్వాములు, పెట్టుబడిదారుల రాజకీయ శక్తిని ఎదుర్కొనే పోరాటాలలో మీట మాదిరిగా పనిచేయడానికి కార్మికవర్గ రాజకీయ పార్టీ అవసరం.

దీని సారాంశం చాలా స్పష్టం : '(కార్మికవర్గ) ఆర్థిక పోరాటం, రాజకీయ కార్యకలాపాలకు మధ్య విడదీయడానికి వీలులేని ఐక్యత ఉంది.'[91]

1866లో జెనీవా మహాసభ ట్రేడ్ యూనియన్ల ప్రాముఖ్యతను నొక్కి చెప్పింది. 1871లో లండన్ సమావేశం ఆధునిక కార్మికోద్యమపు కీలక ఆయుధంపై దృష్టి సారించింది: అదే రాజకీయ పార్టీ. అయితే 20వ శతాబ్దంలో అభివృద్ధి చెందిన పార్టీ కన్నా 1871లో ఇంటర్నేషనల్ ప్రతిపాదించిన పార్టీ చాలా విశాల దృక్పథంతో కూడుకున్నదని చెప్పక తప్పదు. పార్టీ అంటే మార్క్సుకు ఉన్న భావనను బ్లాంక్విస్టుల భావన నుంచి వేరుచేసి చూడాలి. తరువాత వీరితో మార్క్సుకు బహిరంగ విభేదాలు చోటు చేసుకున్నాయి. అంతే కాకుండా అక్టోబర్ విప్లవం తరువాత కమ్యూనిస్టు పార్టీలు స్వీకరించిన లెనినిస్టు పార్టీ భావన కూడా మార్క్సు ప్రతిపాదించిన పార్టీకి భిన్నమైనది.[92]

మార్క్సు ప్రకారం కార్మికవర్గ స్వీయ విముక్తి సుదీర్ఘమైన, కఠినమైన ప్రక్రియ. దీనికి పూర్తి విరుద్ధమైన సిద్ధాంతాలను, కార్యాచరణను సెర్జి నిచయేవ్ (1847–82) 'కేటకిజం ఆఫ్ ఎ రివల్యూనరీ' అనే పుస్తకంలో ప్రతిపాదించాడు. రహస్య సంఘాలు ఏర్పాటు చేయాలని నిచయేవ్ ప్రతిపాదించాడు. ఈ అభిప్రాయాలను లండన్ సమావేశం ప్రతినిధులు ఖండించారు.[93] కాని బకూనిన్ ఎంతో ఉత్సాహంగా ఈ అభిప్రాయాలకు మద్దతు ఇచ్చాడు.

తీర్మానం – IX ని లండన్ సమావేశంలో నలుగురు ప్రతినిధులు మాత్రమే వ్యతిరేకించారు. రాజకీయాలలో పాల్గొనకుండా తటస్థంగా (abstensionist) ఉండాలని వారు వాదించారు. మార్క్సు విజయం తాత్కాలికమైనదని త్వరలోనే తెలిసింది. ప్రతిదేశంలోను రాజకీయ పార్టీలు ఏర్పాటు చేయాలని పిలుపు ఇవ్వడంతోపాటు జనరల్

కౌన్సిల్‌కు విస్తృతాధికారాలు కట్టబెట్టాలని ప్రతిపాదించడంతో ఇంటర్నేషనల్ అంతర్గత పరిస్థితులలో ఇబ్బందులు తలెత్తాయి. ఇంటర్నేషనల్ సరళమైన పరిస్థితుల నుంచి రాజకీయ క్రమశిక్షణ కలిగిన నిర్మాణానికి మారడానికి సిద్ధంగా లేదు.[94]

బ్రిటిష్ ఫెడరల్ కౌన్సిల్ ఏర్పాటు చేయాలని లండన్ సమావేశంలో చివరి తీర్మానం చేశారు. పారిస్ కమ్యూన్ ఓడిపోవడంతో యూరోపులో విప్లవ అవకాశాలు సన్నగిల్లాయని, బ్రిటన్‌లో కార్యకలాపాలను నిశితంగా పరిశీలించవలసిన అవసరం లేదని మార్క్స్ భావించాడు.[95]

సమావేశం తీర్మానాలను ప్రధానమైన ఫెడరేషన్లు, స్థానిక విభాగాలు బలపరుస్తాయని మార్క్స్ అనుకున్నాడు. కాని నవంబర్ 12న జూరా ఫెడరేషన్ సోన్‌విలియా అనే ప్రదేశంలో ప్రత్యేక మహాసభ ఏర్పాటు చేసింది. ఈ మహాసభకు బకూనిన్ హాజరు కాలేకపోయినప్పటికీ అది ఇంటర్నేషనల్‌లో అధికారికంగా ప్రతిపక్షాన్ని ఏర్పాటు చేసింది. సమావేశానంతరం 'సర్క్యులర్ టు ఆల్ ఫెడరేషన్స్ ఆఫ్ ది ఇంటర్నేషనల్ వర్కింగ్ మెన్స్ అసోసియేషన్' పేరుతో రూపొందించిన పత్రంలో గ్విల్లామ్‌తో పాటు సమావేశంలో పాల్గొన్న వారు, జనరల్ కౌన్సిల్ ఇంటర్నేషనల్‌లో 'ఆధిపత్య సిద్ధాంతాన్ని' ప్రవేశపెట్టిందని ఆరోపించారు. ఇంటర్నేషనల్ నిర్మాణాన్ని 'ఒక కమిటీ శాసించే విధంగా దొంతరల నిర్మాణంగా' మార్చివేశారని వారు నిందించారు. 'కార్మికులే ఎన్నుకొని అధికారం అప్పగించినప్పటికీ ఆదేశాలు జారీ చేసే ఆధిపత్యాన్ని వ్యతిరేకిస్తామని' ఇంటర్నేషనల్‌లో స్విస్ విభాగం ప్రకటించింది. 'ఇంటర్నేషనల్ సెక్షన్లకు స్వయంప్రతిపత్తి సూత్రాన్ని కొనసాగించాలని', జనరల్ కౌన్సిల్ 'ఉత్తర ప్రత్యుత్తరాలు నిర్వహిస్తూ, గణాంకాలు అందించే కమిటీగా మాత్రమే ఉండాలని'[96] స్విట్జర్లాండ్ విభాగం స్పష్టం చేసింది. సాధ్యమైనంత త్వరగా ఇంటర్నేషనల్ మహాసభ ఏర్పాటు చేయాలని జూరా ఫెడరేషన్ తీర్మానించింది.

జూరా ఫెడరేషన్ తీర్మానాలు ఊహించినవే. అయినప్పటికీ జనరల్ కౌన్సిల్ రాజకీయ పంథా పట్ల ప్రపంచంలోని వేరేచోట్ల అసహనం, తిరుగుబాటు చిహ్నాలు కనిపించడం వల్ల మార్క్స్ ఆశ్చర్యపోయి ఉండవచ్చు. లండన్ సమావేశం నిర్ణయాలు తమ స్థానిక రాజకీయ స్వయం ప్రతిపత్తికి ఆమోదయోగ్యం కాని విధంగా ఉన్నాయని అనేక దేశాలలోని ఇంటర్నేషనల్ విభాగాలు భావించాయి. లండన్ మహాసభకు హాజరైన బెల్జియం ప్రతినిధివర్గం ఇరుపక్షాల మధ్య రాజీ కుదిర్చే ప్రయత్నం చేసినప్పటికీ లండన్‌కు వ్యతిరేక ధోరణి వైపే మొగ్గింది. డచ్ ప్రతినిధివర్గం కూడా మహాసభ నిర్ణయాలను విమర్శించింది. యూరోపు దక్షిణ ప్రాంతంలో ప్రతిఘటన ఇంకా ఎక్కువగా ఉన్నందువల్ల

ప్రతిపక్షానికి త్వరలోనే చెప్పదగిన స్థాయిలో మద్దతు లభించింది. నిజానికి యూరోపు వాయవ్య ప్రాంతం (Iberian) లోని ఇంటర్నేషనల్ అనుయాయులంతా జనరల్ కౌన్సిల్‌కు వ్యతిరేకంగా బకూనిన్ ఆలోచనలకు మద్దతు ఇచ్చారు. ఇక్కడ పారిశ్రామికీకరణ నగరాలకు మాత్రమే పరిమితమైనందువల్ల కార్మికవర్గం బలహీనంగా ఉండటంతో పాటు కార్మికవర్గ ఉద్యమం ఆర్థిక డిమాండ్లకే పరిమితమైంది. వీటి కారణంగా బకూనిన్ ఆలోచనలకు అక్కడ ఎక్కువ మద్దతు లభించింది. ఇటలీలో కూడా లండన్ మహాసభ నిర్ణయాల పట్ల ప్రతికూల వైఖరి అనుసరించారు. మాజినీ అనుచరులు 1871 నవంబర్ 1 నుంచి 6 వరకు రోమ్‌లో ఇటలీ కార్మిక సంఘాల మహాసభ నిర్వహించారు (ఈ సంస్థ మితవాదం వైపు మొగ్గు చూపేది). మిగిలిన వారంతా బకూనిన్ ఆలోచనలను బలపరిచారు. 1872 ఆగస్ట్ 4 నుంచి 6 వరకు ఇటలీలోని రిమినిలో ఇంటర్నేషనల్‌లోని ఇటాలియన్ ఫెడరేషన్ సంస్థాపక మహాసభ జరుపుకుంది. ఈ మహాసభ ఇంటర్నేషనల్ జనరల్ కౌన్సిల్‌కు వ్యతిరేకంగా తీవ్రమైన వైఖరి తీసుకుంది. తాము తరువాత జరిగే ఇంటర్నేషనల్ మహాసభకు హాజరు కాబోమని స్పష్టం చేసింది. అంతేకాకుండా పెత్తందారీ వ్యతిరేక మహాసభ ('యాంటీ - అథారిటేరియన్ జనరల్ కాంగ్రెస్') నిర్వహించాలని[97] ప్రతిపాదించింది. స్విట్జర్లాండ్‌లోని న్యూషాటల్‌లో ఈ మహాసభ జరపాలని ప్రతిపాదించారు. నిజానికి ఈ నిర్ణయాలు జరుగనున్న చీలికకు నాంది పలికాయి.

ఉత్తర అమెరికాలో వేరే కారణాలతో ఇంటర్నేషనల్‌లో తీవ్రమైన విభేదాలు తలెత్తాయి. 1871లో అమెరికా సంయుక్త రాష్ట్రాలలోని అనేక నగరాలలో ఇంటర్నేషనల్ వ్యాపించింది. 50 సెక్షన్లతో 2,700 మంది సభ్యులతో[98] అది విస్తరించింది. తరువాత సంవత్సరంలో నాలుగు వేల వరకు పెరిగింది. కాని 20 లక్షలకు పైగా ఉన్న కార్మికుల సంఖ్యతో పోల్చితే ఇది చాలా తక్కువ. అంతేకాకుండా వలస వచ్చిన వారిలో మాత్రమే ఇంటర్నేషనల్ చోటు చేసుకోగలిగింది. అమెరికా సంయుక్త రాష్ట్రాలలో జన్మించిన వారిలో ఇంటర్నేషనల్ ప్రవేశించలేకపోయింది. ఇంటర్నేషనల్‌లో అంతర్గత కుమ్ములాటలు కూడా ఈ పరిస్థితికి దోహదం చేశాయి. అమెరికా ఇంటర్నేషనల్ సభ్యులు న్యూయార్క్‌లోనే ఎక్కువగా ఉన్నారు. 1871 డిసెంబర్‌లో వీరు రెండు చీలికలయ్యారు. రెండు వర్గాల వారు అమెరికాలో తామే అసలైన ఇంటర్నేషనల్‌కు ప్రతినిధులమని చెప్పుకున్నారు.

ఈ రెండింటిలోను పెద్దదైన 'స్ప్రింగ్ స్ట్రీట్ కౌన్సిల్' అమెరికాలోని ఉదారవాద గ్రూపులతో పొత్తు పెట్టుకోవాలని ప్రతిపాదించింది. ఈ పొత్తుకు జనరల్ కౌన్సిల్ కరస్పాండింగ్ సెక్రటరీ ఇక్కారియస్ మద్దతు లభిస్తుందని ఈ గ్రూపు భావించింది. దీనిలో బాగా చురుకైన సెక్షన్ -12 కూడా ఉంది.[99] రెండో గ్రూపు ప్రధాన కార్యాలయం

టెన్త్ వార్డ్ హోటల్‌లో ఉంది. ఈ గ్రూపుకు కార్మిక వర్గానికి దగ్గర సంబంధాలున్నాయి. ఇందులో ప్రముఖుడైన ఫ్రీడ్రిక్ అడాల్ఫ్ సోర్జ్ (1828-1906) కూడా ఉన్నారు. ఈ రెండు గ్రూపులు జులైలో సమైక్యతా సమావేశం జరపాలని 1872 మార్చిలో జనరల్ కౌన్సిల్ పిలుపు ఇచ్చింది. ఈ ప్రయత్నం విఫలమైంది. మేలో రెండు గ్రూపులు అధికారికంగా చీలిపోయాయి. విభేదాల కారణంగా అనేక మంది సభ్యులు ఇంటర్నేషనల్‌కు దూరమయ్యారు. 'టెన్త్ వార్డ్ హోటల్' గ్రూపు 1872 జులై ఆరు నుంచి ఎనిమిదో తేదీ వరకు మహాసభ నిర్వహించింది. ఈ మహాసభలో 'నార్త్ అమెరికన్ కాన్‌ఫెడరేషన్' ఏర్పాటైంది. ఇందులో 22 సెక్షన్లు (12 జర్మన్, 4 ఫ్రెంచి, ఐరిష్, ఇటాలియన్, స్కాండినేయన్ ఒక్కొక్కటి, 3 ఇంగ్లీషు మాట్లాడే సెక్షన్లు), 950 మందికి సభ్యత్వం ఉన్నాయి. ఇదిలా ఉండగా 'స్ప్రింగ్ స్ట్రీట్ కౌన్సిల్'లోని కొంతమంది సభ్యులు మేలో జరిగిన 'ఈక్వల్ రైట్స్ పార్టీ' సదస్సుకు హాజరయ్యారు. ఈ పార్టీ విక్టోరియా ఉడ్‌హల్‌ను అమెరికా సంయుక్త రాష్ట్రాల అధ్యక్ష పదవికి పోటీ పెట్టింది. కౌన్సిల్‌కి వర్గ దృక్పథం లేదు. పని పరిస్థితులను మెరుగుచేస్తామని, ఉద్యోగావకాశాలు కల్పించడానికి కృషి చేస్తామన్న సాధారణ హామీలు మాత్రమే ఇవ్వడం వల్ల కొన్ని సెక్షన్లు ఈ కౌన్సిల్ నుండి బయటకు వెళ్ళిపోయాయి. ఇకపోతే ఆ కౌన్సిల్‌లో 1500 మంది సభ్యులు మాత్రమే మిగిలారు. జులైలో 'అమెరికన్ కాన్‌ఫెడరేషన్' ఆవిర్భవించినపుడు కౌన్సిల్‌లో 500 మంది (ప్రధానంగా వృత్తి కార్మికులు, మేధావులు) సభ్యులతో 13 సెక్షన్లు మాత్రమే మిగిలాయి. వీరంతా జనరల్ కౌన్సిల్ పంథాను సవాలు చేస్తూ యూరోపు ఫెడరేషన్లతో చేతులు కలిపారు.

అట్లాంటిక్ సముద్రం ఆవలి వైపు జరిగిన ఈ ఘర్షణలు లండన్‌లోని సభ్యుల మధ్య సంబంధాలకు కూడా హానిచేశాయి. 1871 నుంచి 1872 వరకు జనరల్ కౌన్సిల్ కార్యదర్శిగా పనిచేసిన జాన్ హేల్స్ (జననం 1839) ఇక్కారియస్ స్థానంలో ఉత్తర అమెరికా కరస్పాండింగ్ కార్యదర్శిగా బాధ్యతలు స్వీకరించాడు. కాని అదే విధానం కొనసాగించాడు. త్వరలోనే మార్క్స్‌తో ఇక్కారియస్, హేల్స్‌లకు ఉన్న సంబంధాలు మరింత దిగజారాయి. బ్రిటన్‌లో కూడా అంతర్గత ఘర్షణలు బయటకు వచ్చాయి. ప్రధానంగా స్విట్జర్లాండ్, ఫ్రెంచ్ (ఎక్కువగా బ్లాంక్విస్టులు), బలహీనమైన జర్మన్ శక్తులు, డెన్మార్క్, ఐర్లాండ్, పోర్చుగల్‌లలో ఇటీవల ఏర్పాటైన సెక్షన్లు, తూర్పు యూరోపుకు చెందిన హంగెరీ, బొహీమియా గ్రూపులు ఈ దశలో జనరల్ కౌన్సిల్‌కు మద్దతు ఇచ్చాయి. అయితే లండన్ కాన్ఫరెన్స్ చివరలో మార్క్స్ వేసిన అంచనాల కంటె ఇవి చాలా తక్కువ.

జనరల్ కౌన్సిల్‌కు వ్యతిరేకత అనేక రకాలుగా ఉండేది. కొన్ని సందర్భాలలో

ఇది వ్యక్తిగత కారణాలతో కూడుకొని ఉండేది. చిత్రమైన పరిస్థితులు మాత్రమే ఇంటర్నేషనల్‌ని ఒకటిగా ఉంచగలిగాయి. ఈ పరిస్థితి నాయకత్వానికి మరింత కష్టంగా తయారైంది. కొన్ని దేశాలలో బకూనిన్ సిద్ధాంతాల ప్రభావం, వివిధ రకాల వ్యతిరేకులను ఒక్కటిగా చేయగలిగిన గ్విల్లామ్ శక్తి సామర్థ్యాలు ఇవన్నీ కలిసి మార్క్స్ ప్రతిపాదించిన సానుకూల చర్య అంటే 'కార్మిక వర్గ రాజకీయ కార్యకలాపాల' తీర్మానానికి వ్యతిరేకంగా తయారయ్యాయి. ఈ తీర్మానం వల్ల ఎన్నో ప్రయోజనాలున్నాయని చెప్పుకున్నప్పటికీ ఇది తమ వ్యవహారాలలో జోక్యం చేసుకోవడమేనని బకూనిన్ ప్రభావంలో వున్న బృందమే కాకుండా అనేక ఫెడరేషన్లు, స్థానిక సెక్షన్లు కూడా స్వయం ప్రతిపత్తి సిద్ధాంతాన్ని సమర్థించాయి. భిన్నమైన వాస్తవాలను గౌరవించడం ఇంటర్నేషనల్‌కి పునాదిరాయి వంటిదని మార్క్స్ వ్యతిరేకులు భావించారు. మార్క్స్ పొరపాటు అంచనా వేయడం వల్ల ఇంటర్నేషనల్ సంక్షోభం మరింత ముదిరింది.[100]

## 10. ఇంటర్నేషనల్‌లో సంక్షోభం

1872 వేసవిలో ఇంటర్నేషనల్ తుది సమరం ప్రారంభమైంది. ఫ్రాన్స్ – ప్రష్యా యుద్ధం, పారిస్ కమ్యూన్ తరువాత తీవ్రమైన అణచివేత కొనసాగడం, అనేక ఆంతరంగిక వివాదాల వంటి తీవ్రమైన సంఘటనలతో కూడిన మూడు సంవత్సరాల తరువాత ఇంటర్నేషనల్ మహాసభ జరిగింది. ఇటీవలి కాలంలో ఇంటర్నేషనల్ కొత్తగా ప్రవేశించిన దేశాలలో యూనియన్ నాయకులు, కార్మిక కార్యకర్తలు ఉత్సాహంగా పని చేయడంతో ఇంటర్నేషనల్ విస్తరించింది. 1872లో ఇటలీ, డెన్మార్క్, పోర్చుగల్, నెదర్లాండ్స్‌లలో ఇంటర్నేషనల్ త్వరితగతిన అభివృద్ధి చెందింది. అదే సమయంలో ఫ్రాన్స్, జర్మనీ, ఆస్ట్రో – హంగేరియన్ ఎంపైర్‌లో ఇంటర్నేషనల్‌ను నిషేధించారు. ఈ పరిస్థితులలో నాయకత్వం మధ్య చెలరేగిన వివాదాల గురించి చాలా మంది సభ్యులకు తెలియదు.[101]

ఇంటర్నేషనల్ ఐదవ మహాసభ 1872 సెప్టెంబర్ 2 నుంచి 7 వరకు హేగ్‌లో జరిగింది. 14 దేశాల నుంచి 65 మంది ప్రతినిధులు హాజరయ్యారు. ఫ్రాన్స్ నుంచి 18 మంది (వీరిలో నలుగురు బ్లాంక్విస్టులను జనరల్ కౌన్సిల్‌లోకి కో ఆప్ట్‌చేసుకున్నారు), జర్మనీ నుంచి 15 మంది, బెల్జియం నుంచి ఏడుగురు, బ్రిటన్ నుంచి ఐదుగురు, స్పెయిన్ నుంచి ఐదుగురు, స్విట్జర్లాండ్ నుంచి నలుగురు, డచ్ వారు నలుగురు, ఆస్ట్రియా నుంచి ఇద్దరు, డెన్మార్క్, ఐర్లాండ్, హంగరీ, ఆస్ట్రేలియాల నుంచి ఒక్కరేసి ప్రతినిధులు వచ్చారు. (ఆస్ట్రేలియా ప్రతినిధి డబ్ల్యు.ఇ.హార్‌కోర్ట్ విక్టోరియా సెక్షన్ నుంచి

వచ్చారు). లిస్బన్ ఫెడరేషన్ (అదేవిధంగా మాడ్రిడ్ ఫెడరేషన్) ఫ్రెంచ్ నాయకుడు పాల్ లెఫార్గ్‌ను తమ ప్రతినిధిగా నామినేట్ చేశాయి. ఇటలీ నుంచి ఏడుగురు ప్రతినిధులను పంపడంలో విఫలమయ్యారు. అయినప్పటికీ ఇంటర్నేషనల్ చరిత్రలో అత్యంత సమ ప్రాతినిధ్యం ఉన్న మహాసభ ఇది.

కీలకమైన ప్రాధాన్యత ఉండడంతో మార్క్స్ మహాసభకు హాజరయ్యాడు.[102] ఆయనతో పాటు ఏంగెల్స్ కూడా ఉన్నాడు. నిజానికి మార్క్స్ ఇంటర్నేషనల్ మహాసభలలో దీనికొక్కదానికే హాజరయ్యాడు. డు పాప్ (బహుశా తాను లండన్ సమావేశంలో మాదిరిగా మధ్యవర్తిత్వం వహించే అవకాశం ఉండదని కాబోలు), బకూనిన్‌లు హేగ్ మహాసభకు హాజరు కాలేదు. కాని జనరల్ కౌన్సిల్ నిర్ణయాలను వ్యతిరేకిస్తున్న 'అటానమిస్ట్' (స్వయం ప్రతిపత్తివాదులు) లు మాత్రం పెద్ద సంఖ్యలో మహాసభకు హాజరయ్యారు. బెల్జియం, స్పెయిన్, నెదర్లాండ్స్ నుండి అందరు ప్రతినిధులు, స్విట్జర్లాండ్ ప్రతినిధులలో సగం మంది, బ్రిటన్, ఫ్రాన్స్, అమెరికా సంయుక్త రాష్ట్రాల నుండి వచ్చిన ప్రతినిధులలో కొంతమంది కలిపి మొత్తం 25 మంది 'అటానమిస్టులు' ఉన్నారు.

కంకార్డియా హాల్‌లో జరిగిన మహాసభలో అన్ని సమావేశాలలోను రెండు గ్రూపుల మధ్య ఏ మాత్రం సడలని వైరం కొనసాగింది. అంతకు పూర్వం రెండు మహాసభలలో జరిపిన చర్చల కన్నా నాసిరకంగా ఈ చర్చలు జరిగాయి. మూడు రోజులపాటు గుర్తింపుకు సంబంధించిన తర్జనభర్జనలతో వైషమ్యాలు మరీ తీవ్రమయ్యాయి. ప్రతినిధుల ప్రాతినిధ్యం నిజానికి చాలా అడ్డదిడ్డంగా ఉంది. ఇంటర్నేషనల్‌లోని వివిధ శక్తుల మధ్య వున్న సంబంధాలను ప్రతిఫలించడం లేదు. ఉదాహరణకు జర్మనీలో ఇంటర్నేషనల్‌కి ఎటువంటి సెక్షన్లు లేవు. ఫ్రాన్స్‌లో సెక్షన్లన్నీ రహస్యంగా ఉంటున్నందువల్ల వారి ప్రాతినిధ్యంపై తీవ్రమైన సందేహాలు చోటు చేసుకున్నాయి. జనరల్ కౌన్సిల్ సభ్యత్వం వల్ల ప్రతినిధులైన వారు ఏ సెక్షన్ అభిప్రాయాలకు ప్రాతినిధ్యం వహించరు.

పొంతనలేని ప్రాతినిధ్యం కారణంగా హేగ్ మహాసభ తీర్మానాలు ఆమోదం పొందగలిగాయి. మహాసభలో మైనారిటీలో ఉన్న ప్రతినిధుల సంకీర్ణం ఏర్పడడంలో కృత్రిమత్వం ఉంది. అనేక అంశాలలో తక్షణ లక్ష్యసాధనే దానిని కలిపి వుంచింది. కాని నిజానికి ఈ మైనారిటీ ఇంటర్నేషనల్‌లో అత్యధికులకు ప్రాతినిధ్యం వహిస్తోంది.[103]

1871 లండన్ సమావేశంలో ఆమోదించిన తీర్మానం–IX ని ఇంటర్నేషనల్ నిబంధనలలో కొత్త ఆర్టికల్ – 7ఎగా చేర్చాలని హేగ్ మహాసభ అత్యంత ముఖ్యమైన

నిర్ణయం తీసుకుంది. 1864లో ఆమోదించిన తాత్కాలిక శాసన నిబంధనలు ఇలా పేర్కొన్నాయి: 'శ్రామికవర్గాల ఆర్థిక విమోచన అనే మహత్తర లక్ష్యసాధనకి కృషి చేయడం అన్ని రాజకీయ ఉద్యమాలకి ప్రధానాంశం కావాలి'.[104] ఇలా వుండగా, ఇప్పుడు తీర్మానం – IX ని కొత్త నిబంధనగా చేర్చడమనేది ఇంటర్నేషనల్‌లోని శక్తుల మధ్య నూతన సంబంధాలకు అద్దం పట్టింది. సమాజం మార్పు కోసం ప్రస్తుత తరుణంలో రాజకీయ పోరాటం తప్పనిసరి ఆయుధమని మహాసభలో అభిప్రాయానికి వచ్చారు. 'భూస్వాములు, పెట్టుబడిదారులు తమ ఏకస్వామ్యాల రక్షణకు, కొనసాగింపుకి, శ్రామికులను అణిచి పెట్టడానికి తమ రాజకీయ అధికారాలను ఎల్లప్పుడూ ఉపయోగించుకుంటున్నారు. అందువల్ల రాజకీయాధికారాన్ని జయించడం కార్మిక వర్గానికి తప్పనిసరి కర్తవ్యమైంది'.[105]

ఇంటర్నేషనల్ స్థాపించిన నాటి పరిస్థితికి ప్రస్తుత పరిస్థితికి చాలా తేడా ఉంది. రోజురోజుకు బలం క్షీణించడంతో అతివాద ప్రజాస్వామ్యవాదులు రంగం నుండి నిష్క్రమించారు. 'పరస్పరాశ్రయవాదులు' ఓటమిపాలు కావడంతో వారిలో చాలా మంది తమ అభిప్రాయాలు మార్చుకున్నారు. సంస్కరణవాదులకు (బ్రిటన్ మినహాయించి) స్థానం లేకుండా పోయింది. పెట్టుబడిదారీ విధానంపట్ల వ్యతిరేకత ఇంటర్నేషనల్‌కంతటికీ రాజకీయ పంథాగా మారిపోయింది. ఇటీవల రూపుదిద్దుకున్న అరాచక – సమిష్టి వాదులు కూడా ఇదే పంథాకు వచ్చారు. అంతేకాకుండా ఇంటర్నేషనల్ స్థాపించిన తరువాత సంవత్సరాలలో ఆర్థికాభివృద్ధి కూడా జరిగింది. అయితే ఇది చాలదని, పైపూతల వల్ల ప్రయోజనం ఉండదని, మానవుల దోపిడీని అంతమొందించినపుడే నిజమైన మార్పులు వస్తాయని కార్మికులు అర్థం చేసుకోగలిగారు. తాము వచ్చిన బృందాల చొరవ నుంచి కాకుండా కార్మికులు తమ భౌతిక అవసరాల కోసం తమంత తామే చేసే పోరాటాలు రోజురోజుకు పెరుగుతున్నాయి.

విశాల చిత్రపటంలో కూడా మౌలిక మార్పులు వచ్చాయి. 1871లో జర్మనీ ఏకీకకరణ జరగడంతో నూతన యుగం ప్రారంభమైంది. జాతి రాజ్యం చట్టపరమైన, ప్రాదేశిక గుర్తింపుకు కేంద్ర బిందువుగా తయారైంది. ఈ పరిస్థితులలో ప్రతిదేశంలోని సభ్యత్వ రుసుంపై ఆధారపడే ఇంటర్నేషనల్ వంటి ఏ అంతర్జాతీయ సంస్థకైనా ఇబ్బంది ఎదురైంది. అంతేకాకుండా ఆయా దేశాలకు చెందిన రాజకీయ నాయకత్వంలో కొంత భాగాన్ని అట్టి అంతర్జాతీయ సంస్థలకు అప్పగించవలసిన పరిస్థితి వుంటుంది. అదే సమయంలో వివిధ జాతీయోద్యమాలు, నిర్మాణాల మధ్య పెరుగుతున్న విభేదాల కారణంగా అన్ని వర్గాల వారి డిమాండ్లకు తగినట్టు రాజకీయ విశ్లేషణను రూపొందించడం జనరల్ కౌన్సిల్‌కు చాలా కష్టమైంది. మొదటినుంచీ కూడా ఇంటర్నేషనల్ అనేది ట్రేడ్

యూనియన్లు, రాజకీయ సంస్థల కలగూరగంపగా ఉండేది. వాటి మధ్య పొంతన కుదర్చడం అంత తేలిక కాదు. నిర్దుష్ట సంస్థాగత దృక్పథం కంటే అవి భావోద్వేగాలకు, వివిధ రాజకీయ ధోరణులకు ప్రాతినిధ్యం వహించేవి. ఏదిఏమైనప్పటికీ 1872 నాటికి ఇంటర్నేషనల్‌లోని వివిధ భాగాలకు, కార్మికుల పోరాటాలకు మొదటికంటే స్పష్టమైన నిర్వచనం చెప్పుకోగలిగారు. స్పష్టమైన నిర్మాణస్వరూపం కూడా ఏర్పడింది. బ్రిటన్‌లో ట్రేడ్ యూనియన్లను చట్టబద్ధం చేయడంతో అవి అధికారికంగా జాతి రాజకీయ జీవనంలో భాగమయ్యాయి. ఇంటర్నేషనల్‌లోని బెల్జియం ఫెడరేషన్ బాగా విస్తరించింది. చెప్పుకోదగిన స్వతంత్ర సైద్ధాంతిక కృషి కూడా ఈ ఫెడరేషన్ కేంద్ర నాయకత్వం కొనసాగించింది. జర్మనీలో 'సోషల్ డెమోక్రాటిక్ వర్కర్స్ పార్టీ ఆఫ్ జర్మనీ', 'జనరల్ అసోసియేషన్ ఆఫ్ జర్మన్ వర్కర్స్' పేర్లతో రెండు కార్మికుల పార్టీలు ఏర్పాటయ్యాయి. వాటికి పార్లమెంట్‌లో ప్రాతినిధ్యం కూడా ఉండేది. ఫ్రాన్స్‌లో లియోన్ నుంచి పారిస్ వరకు ఉన్న కార్మికులు అప్పటికే తిరుగుబాటు చేసి వున్నారు. స్పెయిన్‌లో విశాల ప్రజా ఉద్యమస్థాయికి స్పానిష్ ఫెడరేషన్ విస్తృతమైంది. ఇతర దేశాలలో కూడా ఇటువంటి మార్పులే చోటు చేసుకున్నాయి.

ఇంటర్నేషనల్ తొలిలక్ష్యం ముగిసిపోయింది. ప్రారంభంలో ఉన్న నిర్మాణ స్వరూపానికి కాలం చెల్లింది. యూరోపు అంతటా సమ్మెలు నిర్వహించడం, వాటికి మద్దతు ఇవ్వడం, ట్రేడ్ యూనియన్ ఉపయోగాలను లేదా భూమిని, ఉత్పత్తి సాధనాలను సమాజపరం చేయడమనే అవసరాన్ని తెలియచేయడానికి మహాసభలు నిర్వహించడం ఇక ఎంతమాత్రం ఇంటర్నేషనల్ కర్తవ్యం కాదు. అవన్నీ ఇప్పుడు మొత్తం ఇంటర్నేషనల్ సమిష్టి వారసత్వంలో భాగం. పారిస్ కమ్యూన్ తరువాత కార్మికోద్యమానికి ఎదురైన సవాలు విప్లవాత్మకమైనది: పెట్టుబడిదారీ ఉత్పత్తి విధానాన్ని అంతమొందించడానికి, బూర్జువా ప్రపంచంలోని వ్యవస్థలను కూలదోయడానికి ఏ విధంగా సన్నద్ధం కావాలి? ఇక ఇది ఎంతమాత్రం ప్రస్తుత సమాజాన్ని సంస్కరించే సమస్య కాదు. నూతన సమాజాన్ని నిర్మించుకోవడం ఎలా అన్నది ప్రశ్న.[106] వర్గ పోరాటంలో వచ్చిన నూతన పరిణామాలను దృష్టిలో పెట్టుకొని, ప్రతిదేశంలోను కార్మిక వర్గ రాజకీయ పార్టీలను ఏర్పాటు చేయడం తప్పనిసరని మార్క్స్ భావించాడు. 1871 ఫిబ్రవరిలో ఏంగెల్స్ 'ది ఫెడరల్ కౌన్సిల్ ఆఫ్ ది స్పానిష్ రీజియన్ ఆఫ్ ది ఇంటర్నేషనల్ వర్కింగ్ మెన్స్ అసోసియేషన్'కి పంపిన డాక్యుమెంట్ ఈ అంశంపై జనరల్ కౌన్సిల్ అవగాహనను స్పష్టంగా వివరిస్తుంది.

> పాత పార్టీల ఆధిపత్యం నుంచి కార్మికులకు విముక్తి కల్పించడానికి ప్రతిదేశంలోను కార్మికుల పార్టీ ఏర్పాటు చేసుకొని దానికొక విధానం

ఏర్పరచుకోవడం ఒకటే మంచి మార్గమని అనుభవం తెలియజేస్తున్నది. కార్మిక పార్టీ విధానం కార్మిక వర్గాన్ని విముక్తి చేయడానికి అవసరమైన పరిస్థితులను తెలియజేయవలసి ఉన్నందున, అది ఇతర పార్టీల విధానానికి స్పష్టంగా భిన్నమైనదిగా ఉండాలి. ప్రతి దేశంలోను ఉన్న ప్రత్యేక పరిస్థితులను దృష్టిలో ఉంచుకొని విధానంలో స్వల్పమైన తేడాలు ఉండవచ్చు. కాని ప్రతిచోట శ్రమ, పెట్టుబడుల మధ్య మౌలిక సంబంధాలు ఒకే విధంగా ఉంటాయి. ప్రతిచోట ధనిక వర్గాలు దోపిడికి గురయ్యే వర్గాలపై రాజకీయాధిపత్యం కలిగి ఉన్నాయనేది వాస్తవం. అందువల్ల కనీసం పశ్చిమ దేశాలలో కార్మిక వర్గ పార్టీ సిద్ధాంతాలు, లక్ష్యాలు ఒకే విధంగా ఉంటాయి. (...) రాజకీయ రంగంలో ప్రత్యర్థులపై పోరాటం చేయకపోతే, ప్రత్యేకించి నిర్మాణం, ప్రచార రంగాలలో శక్తివంతమైన ఆయుధాన్ని జారవిడుచుకున్నట్టే.[107]

అందువల్ల ఇక్కడ నుండి ప్రారంభమై వర్గ పోరాటంలో పార్టీ కీలకమైనదిగా గుర్తించబడుతోంది. ప్రస్తుతం ఉన్న రాజకీయ శక్తుల నుంచి కార్మికవర్గ పార్టీ స్వతంత్రంగా ఉండాలి. పార్టీ కార్యక్రమం, నిర్మాణాలను ఆయా దేశ పరిస్థితులకు అనుగుణంగా రూపొందించుకోవాలి. 1872 జులై 23న జరిగిన జనరల్ కౌన్సిల్ సమావేశంలో తటస్థవాదులను (వీరు లండన్ మహాసభ ఆమోదించిన తీర్మానం– IX ని విమర్శిస్తున్నారు), 'ఇంగ్లాండ్, అమెరికా కార్మిక వర్గాలను', 'మధ్యతరగతి వారు తమను రాజకీయంగా ఉపయోగించుకోవడానికి అవకాశం ఇస్తున్నారని', రెండు ధోరణులు కూడా ప్రమాదకరమైనవని[108] మార్క్స్ తీవ్రంగా విమర్శించాడు. ఈ రెండో విషయాన్ని ఆయన లండన్ మహాసభలోనే ప్రకటించాడు. 'అన్ని దేశాల పరిస్థితులకు రాజకీయాలను అన్వయించుకోవాలని'[109] ఆయన స్పష్టం చేశాడు. ఆ తరువాత సంవత్సరంలో హేగ్ మహాసభ ముగిసిన తరువాత అమ్‌స్టర్‌డామ్‌లో ప్రసంగిస్తూ ఇలా అన్నాడు :

నూతన శ్రామిక వ్యవస్థను నిర్మించుకోవడం కోసం ఒకరోజున కార్మికుడు రాజకీయాధికారాన్ని హస్తగతం చేసుకోవలసి ఉంటుంది. పాత వ్యవస్థలకు ప్రాణం పోస్తున్న పాత రాజకీయాలను కూలదోయాలి. తొలి క్రైస్తవుల మాదిరిగా రాజకీయాలను అశ్రద్ధచేసి, అసహ్యించుకుంటే కార్మికుడు భూలోకంలో స్వర్గాన్ని కోల్పోవలసివస్తుంది. కానీ ఈ లక్ష్య సాధనకు మార్గాలు అన్నిచోట్ల ఒకే విధంగా ఉంటాయని మేము చెప్పలేదు. (...) కొన్ని దేశాలలో కార్మికులు శాంతియుతంగా లక్ష్యం సాధించడానికి

అవకాశాలుంటాయనేది కూడా మేము తిరస్కరించడం లేదు. (...) అయితే యూరోపులోని అనేక దేశాలలో మన విప్లవానికి బలప్రయోగమే ప్రాతిపదికగా ఉండాలని మనం గుర్తించాలి. శ్రామిక పాలన సాధించడానికి ఏదో ఒకరోజున బలప్రయోగం తప్పనిసరిగా అవసరమవుతుంది. [110]

వివిధ దేశాలలో కార్మికవర్గ పార్టీలు వివిధ రూపాలలో ఆవిర్భవించినప్పటికీ అవి దేశ ప్రయోజనాలకు తమని తాము లోబరచుకోకూడదు.[111] సోషలిజం కోసం జరిగే పోరాటాన్ని దేశ పరిధులకు పరిమితం చేయకూడదు. ప్రత్యేకించి నూతన చారిత్రక ఘట్టంలో కార్మిక వర్గానికి అంతర్జాతీయత మార్గదర్శకం కావాలి. రాజ్యం, పెట్టుబడిదారీ వ్యవస్థల మృత్యుకౌగిలికి వ్యతిరేకంగా అంతర్జాతీయత టీకాలాగా పనిచేస్తుంది.

హేగ్ మహాసభలో వివిధ అంశాలపై తీవ్రమైన వాదోపవాదాలు జరిగిన తరువాత ఓటింగ్ జరిగింది. మహాసభ ఆర్టికల్ 7ఎని ఆమోదించిన తరువాత రాజకీయాధికారాన్ని గెల్చుకోవడం లక్ష్యమనే నిబంధనను ఇంటర్నేషనల్ నిబంధనల్లో చేర్చారు. రాజకీయాధికారం కోసం కార్మికుల పార్టీ అవసరమనే సూచన కూడా నిబంధనలో ఉంది. ఆ తరువాత జనరల్ కౌన్సిల్‌కు విస్తృతాధికారాలు అప్పగించే ప్రతిపాదనపై ఓటింగ్ జరిగినపుడు, అనుకూలంగా 32, వ్యతిరేకంగా ఆరు ఓట్లు వచ్చాయి. 12 మంది ఓటింగ్‌లో పాల్గొనలేదు. అల్ప సంఖ్యాకులకు ఈ పరిస్థితి మరీ భరించరానిదిగా తయారైంది. ప్రస్తుతం జనరల్ కౌన్సిల్‌కు ఇంటర్నేషనల్ సిద్ధాంతాలు, నిబంధనలు, సాధారణ నియమాలు గట్టిగా అమలయ్యేట్లు చూసే కర్తవ్యం ఏర్పడింది. అంతేకాకుండా 'తరువాత మహాసభ జరిగేవరకు ఇంటర్నేషనల్‌లోని విభాగాలను, శాఖలను, కౌన్సిళ్ళను లేదా ఫెడరల్ కమిటీలు, ఫెడరేషన్లను సస్పెండ్ చేసే హక్కు' కూడా జనరల్ కౌన్సిల్‌కి సంక్రమించింది.[112]

'న్యూయార్క్ సెక్షన్ 12' అనే సంస్థను బహిష్కరించాలని మహాసభ తీర్మానించింది. ఈ విధంగా ఒక సంస్థను బహిష్కరించడం ఇంటర్నేషనల్ చరిత్రలోనే ఇది తొలిసారి. ఈ ప్రతిపాదనపై జరిగిన ఓటింగ్‌లో అనుకూలంగా 47 ఓట్లు, వ్యతిరేకంగా 9 ఓట్లు వచ్చాయి. ఇంటర్నేషనల్ వర్కింగ్ మెన్స్ అసోసియేషన్ వర్గ నిర్మూలనకు కట్టుబడి ఉందని, అందువల్ల బూర్జువా సెక్షన్‌ను ఇంటర్నేషనల్‌లో చేర్చుకోలేమని ప్రతిపాదనలో స్పష్టం చేశారు.[113] బకూనిన్ బహిష్కారానికి సంబంధించిన ఓటింగ్‌లో బహిష్కరణకు అనుకూలంగా 25, వ్యతిరేకంగా 6 ఓట్లు వచ్చాయి. ఏడుగురు ఓటింగ్‌లో పాల్గొనలేదు. అదేవిధంగా గ్విల్లామ్ బహిష్కరణకు జరిగిన ఓటింగ్‌లో 25

ఓట్లు అనుకూలంగా, వ్యతిరేకంగా 9 ఓట్లు, తటస్థంగా 8 ఓట్లు వచ్చాయి. వీరి బహిష్కరణ కొంత ఉద్రిక్తతకు కారణమైంది. అయితే ఇందుకై నియమించిన దర్యాప్తు సంఘం నివేదిక బకూనిన్ నాయకత్వంలోని 'అలయెన్స్ ఫర్ సోషలిస్ట్ డెమోక్రసీ' రహస్య సంస్థను నడుపుతున్నదని, ఈ సంస్థ నిబంధనలు ఇంటర్నేషనల్ నిబంధనలకు పూర్తిగా వ్యతిరేకంగా ఉన్నాయని నిర్ధారించి[114] వారిని బహిష్కరించాలని సిఫార్సు చేసింది. ఏది ఏమైనప్పటికీ జూరా ఫెడరేషన్ సంస్థాపక సభ్యుడు, క్రియాశీల కార్యకర్త అడెమర్ స్కివిట్జ్‌బెల్‌ని బహిష్కరించాలన్న ప్రతిపాదన మహాసభలో ఓడిపోయింది. బహిష్కరణకు అనుకూలంగా 15, వ్యతిరేకంగా 17 ఓట్లు వస్తే, ఏడుగురు ఓటింగ్‌లో పాల్గొనలేదు.[115] చివరకు 'అలయెన్స్ ఫర్ సోషలిస్ట్ డెమోక్రసీ అండ్ ది ఇంటర్నేషనల్ వర్కింగ్ మెన్స్ అసోసియేషన్' అనే పేరుతో సుదీర్ఘ నివేదిక ప్రచురించడానికి మహాసభ అనుమతి ఇచ్చింది. బకూనిన్ నాయకత్వంలోని 'అలయన్స్' వివిధ దేశాలలో నడుపుతున్న బహిరంగ, రహస్య కార్యకలాపాల గురించి ఏంగెల్స్, మార్క్స్, లెఫార్గ్‌లు ఈ నివేదిక రాశారు. నివేదికను 1873లో ఫ్రెంచ్ భాషలో ప్రచురించారు.

మహాసభలో ఈ బహిష్కరణల పట్ల ప్రతిపక్షం ప్రతిస్పందన ఒకే విధంగా లేదు. కొంతమంది ఓటింగ్‌లో పాల్గొనలేదు. కొందరు వ్యతిరేకంగా ఓటు చేశారు. చివరి రోజున హేగ్ సెక్షన్‌కు చెందిన కార్మికుడు విక్టర్ దేవ్ (1845–1922) చదివిన ఉమ్మడి ప్రకటన ఇలా వుంది.

1. స్వయం ప్రతిపత్తి వాదులం, కార్మిక బృందాలు సమాఖ్యగా వుండటానికి మద్దతుదారులైన మేము (...) జనరల్ కౌన్సిల్‌తో (...) పాలనాపరమైన సంబంధాలు కొనసాగిస్తాము.

1.2 మేము ప్రాతినిధ్యం వహిస్తున్న ఫెడరేషన్లు తమలో తాము ప్రత్యక్ష, శాశ్వత సంబంధాలు ఏర్పరచుకోవడంతో పాటు ఇంటర్నేషనల్ విభాగాలతో కూడా సంబంధాలు నెలకొల్పుకుంటాం.

2.4 ప్రస్తుత మహాసభకు తరువాత జరగనున్న మహాసభకు మధ్యకాలంలో ఇంటర్నేషనల్‌లో సమాఖ్యపరమైన స్వయంప్రతిపత్తి విధానానికి విజయం చేకూర్చడానికి అన్ని ఫెడరేషన్లు, సెక్షన్లు సన్నద్ధం కావాలని మేము పిలుపు ఇస్తున్నాం.[116]

ఈ ప్రకటన కేవలం ఒక ఎత్తుగడ. ఇంటర్నేషనల్‌లో చీలిక తప్పదని స్పష్టమవుతున్న దృష్ట్యా చీలికకు బాధ్యత నుంచి తప్పుకోవడానికి ఈ ప్రకటన చేశారు.

అంతేకాని ఇంటర్నేషనల్‌ను పునరుజ్జీవింపచేయడానికి గట్టి రాజకీయ ప్రయత్నం కాదు. బలమైన కేంద్రం కోరేవారు (centralists) జనరల్ కౌన్సిల్‌కు ఎక్కువ అధికారాలివ్వాలని చేసిన ప్రతిపాదన కూడా ఇలానే వుంది. ఒకప్రక్క ఈ ప్రతిపాదన చేస్తూనే మరో ప్రక్క మరింత తీవ్రమైన ప్రత్యామ్నాయానికి వారు సిద్ధమవుతున్నారు.

సెప్టెంబర్ ఆరో తేదీ ఉదయం సమావేశంలో అత్యంత నాటకీయ పరిణామం చోటు చేసుకుంది. సంవత్సరాల తరబడి నిర్మిస్తూ వచ్చిన ఇంటర్నేషనల్ చేసిన చిట్టచివరి కార్యకలాపంగా ఇది నిలిచిపోయింది. ఏంగెల్స్ మాట్లాడుతూ జనరల్ కౌన్సిల్ ప్రధాన కేంద్రాన్ని 1872-73 సంవత్సరానికి న్యూయార్క్‌కు బదిలీ చేయాలని ప్రతిపాదించడంతో సమావేశంలో పాల్గొన్నవారు ఆశ్చర్యపోయారు. అంతేకాకుండా జనరల్ కౌన్సిల్‌ను 'అమెరికన్ ఫెడరల్ కౌన్సిల్' సభ్యులతో ఏర్పాటు చేయాలని [117] కూడా ఏంగెల్స్ ప్రతిపాదించాడు. ఆ విధంగా మార్క్స్, ఇతర ఇంటర్నేషనల్ 'స్థాపకుల'కు కేంద్ర సంఘంలో స్థానం లేకుండా పోయింది. కొత్త కౌన్సిల్‌లో ఇంతకు ముందు ఎవరికి తెలియని వారి పేర్లు ఉన్నాయి. (కౌన్సిల్‌లో ఏడుగురు సభ్యులుండాలని, అవసరాన్ని బట్టి 15 మందికి అవకాశం కల్పించాలని ఏంగెల్స్ ప్రతిపాదించాడు). మార్క్స్ ఆలోచనలకు మద్దతు ఇస్తున్న జనరల్ కౌన్సిల్ సభ్యుడు మాల్ట్‌మాన్ బారీ (1842-1909) సభలో స్పందనను చాలా చక్కగా వర్ణించాడు.

> ఈ ప్రతిపాదన చేసిన ఏంగెల్స్ చివరి మాటలు వినేసరికి సభికుల మొఖాలలో తీవ్రమైన ఆందోళన, అసంతృప్తి కనిపించాయి. వారు లేచి మాట్లాడడానికి కొంత సమయం పట్టింది. అదొక కుట్రపూరిత తిరుగుబాటు. ప్రతి ఒక్కరూ నిశ్శబ్దాన్ని ఛేదించవలసిందిగా పక్కవారి వైపు చూస్తున్నారు.[118]

'జనరల్ కౌన్సిల్‌లో గ్రూపుల మధ్య విభేదాలు తారస్థాయికి చేరుకున్నాయని, అందువల్ల దాన్ని వేరే చోటుకు బదిలీ చేయక తప్పదని'[119] ఏంగెల్స్ వాదించాడు. అణచివేత సాగుతున్నందువల్ల దీన్ని బదిలీ చేయడానికి న్యూయార్క్ మంచి ప్రదేశమని ఆయన అభిప్రాయపడ్డాడు. 'కార్మిక వర్గం తిరుగుబాటుకు ఇంటర్నేషనల్ శాశ్వత వేదికగా ఉండాలని'[120] వాదిస్తూ బ్లాంక్విస్టులు ఈ ప్రతిపాదనను తీవ్రంగా వ్యతిరేకించారు. 'పార్టీ ఐక్యమై పోరాటానికి సిద్ధపడినపుడు (...) దాని నాయకత్వ కమిటీ చురుకుగా, సాయుధంగా, శక్తివంతంగా వుంటే, పార్టీ కార్యాచరణ మరింత ప్రభావవంతంగా వుంటుందని' కూడా వారు అన్నారు. వైలాన్‌తో పాటు సభలో ఉన్న బ్లాంక్వి మద్దతుదారులు తమకు ద్రోహం జరిగిందని భావించారు. 'యూరోపులో సాయుధ సంస్థ పోరాటం సాగిస్తున్నపుడు,

దాని నాయకత్వాన్ని అమెరికా సంయుక్త రాష్ట్రాలకు బదిలీ చేయడం' విద్రోహమని [121] వారన్నారు. 'ఆర్థిక పోరాటాలు ఇంటర్నేషనల్ చొరవతో ప్రారంభమయ్యాయని, రాజకీయ పోరాటాలు జరుగుతున్నపుడు కూడా అది చొరవ తీసుకోవాలని, దాన్ని అంతర్జాతీయ కార్మికుల విప్లవ పార్టీగా మార్పు చేయాలని'[122] వారు అభిప్రాయపడ్డారు. జనరల్ కౌన్సిల్‌ను అదుపులో ఉంచుకోడానికి ఇక ఏ మాత్రం వీలుకాదని గ్రహించిన వారు మహాసభ నుంచి వెళ్లిపోయారు. ఆ తరువాత కొద్దిరోజులకు ఇంటర్నేషనల్ నుంచి కూడా బయటకు వెళ్లిపోయారు.

ఇంటర్నేషనల్‌ను న్యూయార్క్‌కు బదిలీ చేయడం వల్ల క్రియాశీలక నిర్మాణంగా దాని చరిత్ర ముగిసిపోతుందన్న అభిప్రాయంతో మెజారిటీలో కూడా చాలామంది ఈ ప్రతిపాదనకు వ్యతిరేకంగా ఓటు చేశారు. ప్రతిపాదనకు అనుకూలంగా 26, వ్యతిరేకంగా 23 ఓట్లు వచ్చాయి. తొమ్మిదిమంది ఓటింగ్‌లో పాల్గొనలేదు. అంటే మూడు ఓట్లతో తీర్మానం నెగ్గింది. తమ కార్యకలాపాలు సాగే కేంద్రాల నుంచి దూరంగా ఇంటర్నేషనల్‌ను తరలించడం మైనారిటీలో కొంతమందికి సంతోషం కలిగించింది.

అంతేకాకుండా ఒంటెత్తు పోకడలు పోతున్న ప్రత్యర్థులకు అప్పగించడం కంటే ఇంటర్నేషనల్ అస్థిత్వం కోల్పోతేనే మంచిదని మార్క్స్ భావించాడు. జనరల్ కౌన్సిల్‌ను న్యూయార్క్‌కు బదిలీ చేయడంతో ఇంటర్నేషనల్ అంతర్థానమవుతుంది, కాని, ముఠా తగాదాలతో ఆధిపత్యం కోసం జరిగే పోరుకన్నా ఇదే మెరుగైన ప్రత్యామ్నాయం.

ఇంటర్నేషనల్‌లోని రెండు ధోరణులు. ఇంకా చెప్పాలంటే ఉన్నత స్థాయిలో ఉన్న ఇద్దరు వ్యక్తులు – మార్క్స్, బకూనిన్‌ల మధ్య వివాదమే ఇంటర్నేషనల్ క్షీణతకి కారణమని చాలా మంది వాదిస్తారు. [123] కాని ఈ వాదనలో పసలేదు. ఏదిఏమైనప్పటికీ ప్రపంచంలో జరుగుతున్న పరిణామాల కారణంగా ఇంటర్నేషనల్‌కు కాలం చెల్లిపోయింది. కార్మికోద్యమ నిర్మాణాల అభివృద్ధి, వాటిలో మార్పులు; ఇటలీ, జర్మనీల ఏకీకరణ వల్ల జాతి రాజ్యం ఏర్పడడం, స్పెయిన్, ఇటలీ వంటి దేశాలకు ఇంటర్నేషనల్ విస్తరణ (ఈ దేశాలకు, బ్రిటన్, ఫ్రాన్స్‌లకు ఆర్థిక, సామాజిక పరిస్థితులలో చాలా వ్యత్యాసం ఉంది.); బ్రిటిష్ ట్రేడ్ యూనియన్‌లు మరింతగా మితవాదం వైపు మొగ్గటం; పారిస్ కమ్యూన్ తరువాత కొనసాగిన అణచివేత -- ఈ కారణాలన్నింటివల్ల ఇంటర్నేషనల్ తొలి నిర్మాణరూపం కాలానుగుణ్యత కోల్పోయింది.

ఇంతేకాకుండా, సంస్థలో వున్న స్వయంప్రతిపత్తి కోరే ధోరణి, ఇంటర్నేషనల్‌లోని అంతర్గత పరిణామాలు, దీనిలోని ప్రధాన పాత్రధారులు కూడా

ఇంటర్నేషనల్‌కు చరమగీతం పాడడంలో తమ వంతు పాత్రను నిర్వహించారు. ఉదాహరణకు లండన్ సమావేశం ఇంటర్నేషనల్‌ను రక్షించుకోవడానికి దోహదం చేస్తుందని మార్క్స్ భావించాడు. కాని ఆ విధంగా జరగలేదు. సభ్యుల మనోభావాలను గ్రహించటంలో విఫలం కావడం, బకూనిన్, అతని బృందం బలపడకుండా చేయడానికి అవసరమైన దూరదృష్టి లోపించటం, లండన్ సమావేశాన్ని పట్టువిడుపులు లేని ధోరణిలో నిర్వహించటం అంతర్గత సంక్షోభాన్ని మరింత పెద్దది చేశాయి. [124] అంతర్గత విభేదాలను పరిష్కరించడానికి చేసిన ప్రయత్నం ఫలించకపోగా, అవి మరింతగా పెరగడంతో సమావేశంలో మార్క్స్ గెలుపు నామమాత్రంగా మిగిలింది. ఏది ఏమైనప్పటికీ లండన్ సమావేశం నిర్ణయాలు అప్పటికే రూపుదిద్దుకున్న, వెనక్కి మళ్ళించడానికి అసాధ్యమైన క్రమాన్ని వేగవంతం చేయడం మాత్రమే చేశాయి.

చరిత్రపరమైన, నిర్మాణపరమైన ఈ అంశాలతో పాటు ప్రధాన పాత్రధారికి సంబంధించిన ఇతర కారణాలు కూడా ప్రముఖ పాత్ర వహించాయి. 'సాధారణ సమస్యలతో పాటు జాతీయ సమస్యలను కూడా పరిగణనలోకి తీసుకుంటున్నందువల్ల జనరల్ కౌన్సిల్‌పై పనివత్తిడి పెద్దఎత్తున పెరిగిపోయిందని'[125] 1871లో జరిగిన లండన్ సమావేశానికి మార్క్స్ తెలియజేశాడు. 1864లో ఇంగ్లీషు, ఫ్రెంచ్ కార్మికులతో ఇంటర్నేషనల్ చాలా చిన్నదిగా ఏర్పడింది. కానీ ప్రస్తుతం ఇంటర్నేషనల్ అన్ని యూరోపు దేశాలలోను ఉంది. ప్రతి దేశానికి ప్రత్యేక సమస్యలు, లక్షణాలు ఉన్నాయి. ఇంటర్నేషనల్ ప్రతిచోటా విభేదాలలో చిక్కుకోవడమే కాకుండా, పారిస్ కమ్యూన్‌లో పాల్గొన్నవారు లండన్‌కు వలస రావడం వల్ల, వారు ముందుగానే ఏర్పరచుకున్న అభిప్రాయాలు, ఆలోచనలు తమతో తెచ్చుకున్నందు వల్ల జనరల్ కౌన్సిల్‌కు రాజకీయ సంశ్లేషణ మరింత కష్టంగా తయారైంది.

ఇంటర్నేషనల్‌లో ఎనిమిది సంవత్సరాలు విశ్రాంతి లేకుండా పనిచేయడంతో మార్క్స్ పూర్తిగా అలసిపోయాడు.[126] పారిస్ కమ్యూన్ తరువాత కార్మిక శక్తులు వెనక్కు తగ్గాయని తెలిసినందువల్ల రానున్న సంవత్సరాలలో పెట్టుబడి గ్రంథం రాయడం పూర్తి చేయాలని ఆయన నిర్ణయించుకున్నాడు. హేగ్ మహాసభ కోసం నెదర్లాండ్స్ వెళ్లినపుడు, తాను ప్రత్యక్ష పాత్రధారిగా చివరి యుద్ధం చేయబోతున్నానని ఆయన భావించి ఉండవచ్చు.

సెయింట్ మార్టిన్ హాల్‌లో జరిగిన తొలి ఇంటర్నేషనల్ సమావేశంలో మౌనంగా కూర్చున్న మార్క్స్‌ను ఇప్పుడు మహాసభ ప్రతినిధులు, జనరల్ కౌన్సిల్‌తో

పాటు విస్తృత ప్రజానీకం కూడా ఇంటర్నేషనల్‌కి నాయకుడిగా గుర్తించారు. ఇంటర్నేషనల్ పెద్ద ఎత్తున మార్క్సుకు రుణపడివున్నప్పటికీ అది ఆయన జీవితాన్ని కూడా మార్చివేసింది. ఇంటర్నేషనల్ ఏర్పడక ముందు కొన్ని రాజకీయ కార్యకర్తల బృందాలకు మాత్రమే ఆయన తెలుసు. ఆ తరువాత, అన్నిటికంటే మించి పారిస్ కమ్యూన్ తరువాత, అలాగే 1867లో **పెట్టుబడి** అచ్చయిన తరువాత యూరోపు దేశాలలోని విప్లవకారులలో ఆయన ప్రతిష్ట వ్యాపించింది. పత్రికలు ఆయనను 'రెడ్ టెర్రర్ డాక్టర్' అని ప్రస్తావించడం ప్రారంభమైంది. ఇంటర్నేషనల్‌లో బాధ్యతాయుతమైన పాత్ర నిర్వహించడంతో అనేక ఆర్థిక, రాజకీయ పోరాటాలను సన్నిహితంగా పరిశీలించడానికి ఆయనకు అవకాశం లభించింది. కమ్యూనిజం గురించి లోతుగా ఆలోచించడానికి, తన పెట్టుబడిదారీ వ్యతిరేక సిద్ధాంతాలను సుసంపన్నం చేసుకోవడానికి అవకాశం లభించింది.

## 11. మార్క్స్, బకూనిన్‌ల సంఘర్షణ

హేగ్ మహాసభ తరువాత రెండు గ్రూపుల మధ్య పెద్ద ఎత్తున వాదోపవాదాలు జరిగాయి. అయితే కొన్ని సందర్భాలలో మాత్రమే సైద్ధాంతిక, భావజాలపరమైన అంశాలపై వాదనలు కేంద్రీకృతమయ్యాయి. మార్క్స్ తరచుగా బకూనిన్ ఆలోచనలను పరిహాసం చేసేవాడు. బకూనిన్ 'వర్గ సమానత్వం' కోరుతున్నాడని ఆయన ఆరోపించాడు.[127] (1869లో అలయెన్స్ ఫర్ సోషలిస్ట్ డెమోక్రసీ విడుదల చేసి కార్యక్రమంలోని సూత్రాల ఆధారంగా) లేదా ఈ ధోరణి పాటించే రాజకీయ తటస్థత ఆధారంగా మార్క్స్ ఈ విమర్శ చేశాడు. బకూనిన్‌కు మార్క్స్‌కు ఉన్న సైద్ధాంతిక సామర్థ్యం లేనందువల్ల వ్యక్తిగతమైన ఆరోపణలు చేస్తూ అవమానించడానికి ప్రయత్నించేవాడు. అయితే దీనికొక మినహాయింపు ఉంది. 1872 అక్టోబర్ ప్రారంభంలో బ్రస్సెల్స్‌లోని ఒక పత్రికకు పూర్తి చేయని లేఖ ఒకటి రాశాడు. కాని దాన్ని పంపనే లేదు. దాని గురించి మరచిపోయారు. నిరంతరం తర్జన భర్జనలు పడే బకూనిన్ అనుయాయులకు అది ఉపయోగపడలేదు. కాని ఆ లేఖలో 'స్వయంప్రతిపత్తివాదుల' రాజకీయ విధానం స్పష్టంగా ఉంది :

> ఇంటర్నేషనల్‌లోని (...) ఫెడరేషన్లు, సెక్షన్లు, సభ్యులు (...) అందరికీ ఒకే నిబంధన వర్తిస్తుంది. శ్రమను దోపిడీ చేసేవారికి వ్యతిరేకంగా సాగే ఆర్థిక పోరాటంలో అన్ని వృత్తులు, అన్ని దేశాలలోని కార్మికుల మధ్య అంతర్జాతీయ సంఘీభావమే ఈ నిబంధన. కార్మిక వర్గాలు తమంతతామే నిర్వహించే కార్యాచరణ ద్వారా నిజమైన సంఘీభావం ఏర్పడుతుంది. సంపూర్ణ స్వేచ్ఛ

కలిగిన ఫెడరేషన్ (...) అనేది ఇంటర్నేషనల్‌లో నిజమైన, సజీవమైన ఐక్యతను నిలుపుతుంది. బూర్జువా దోపిడీకి వ్యతిరేకంగా కార్మికుల మిలిటెంట్ సంఘీభావానికి మరింత విస్తృత నిర్మాణ రూపం ఇవ్వడంలో నుండే బూర్జువా వర్గానికి వ్యతిరేకంగా కార్మిక వర్గ రాజకీయ పోరాటం ఆవిర్భవించి, ఎదగాలనే విషయాన్ని ఎవరు కాదనగలరు? ఈ విషయంలో మాకు, మార్క్సిస్టులకు మధ్య ఏకాభిప్రాయం ఉంది. ఈ తరువాత ఎదురయ్యే సమస్యలో మార్క్సిస్టులకు, మాకు మధ్య తీవ్రమైన విభేదాలున్నాయి. కార్మికవర్గ విధానం తప్పనిసరిగా విప్లవాత్మకమైనదిగా, పూర్తిగాను, ప్రత్యక్షంగాను రాజ్యాలను కూలదోసే లక్ష్యం కలిగినదిగా వుండాలని మా అభిప్రాయం. ఒకవైపు రాజ్యాన్ని కొనసాగిస్తూ, మరోవైపు అంతర్జాతీయ సంఘీభావం గురించి మాట్లాడడం ఎలా సాధ్యం? ఎందుకంటే రాజ్యం దాని స్వభావరీత్యా సంఘీభావాన్ని నిరోధిస్తూ, నిరంతర యుద్ధానికి కారణమవుతున్నది. రాజ్యం లోపల, రాజ్యం ద్వారా కార్మికుల స్వేచ్ఛ గురించి, విస్తృత ప్రజానీకపు విముక్తి గురించి ఎలా మాట్లాడగలమో మా ఊహకందడం లేదు. రాజ్యం అంటే ఆధిపత్యం. రాజ్యం కొనసాగేచోట ప్రజల అణచివేత ఉంటుంది. వారు అల్ప సంఖ్యాకులైన పాలక వర్గంచే దోపిడి చేయబడతారు. విప్లవ పరిణామ క్రమంలో కూడా రాజ్యాంగ పరిషత్తులు, తాత్కాలిక ప్రభుత్వాలు లేదా విప్లవాత్మక నియంతృత్వంగా చెప్పబడేవాటిని మేము ఎట్టి పరిస్థితులలోను ఆమోదించం. విప్లవమనేది ప్రజల చేతుల్లోనే నిబద్ధతగా, నిజాయితీగా, కళంకం లేకుండా ఉంటుందని మేము విశ్వసిస్తాం. అలాకాక కొద్దిమంది వ్యక్తుల చేతుల్లో కేంద్రీకృతమైతే అది తప్పనిసరిగా, వెంటనే ప్రగతి నిరోధకశక్తిగా మారుతుంది.[128]

ఏ విధమైన రాజకీయాధికారానికైనా, ప్రత్యేకించి రాజ్యం యొక్క ప్రత్యక్ష రూపంలో, బకూనిన్, ప్రౌధాన్‌లు ఇరువురు రాజీలేని వ్యతిరేకత వ్యక్తం చేస్తున్నప్పటికీ, బకూనిన్‌ను పరస్పరాశ్రయవాదిగా పరిగణించడం సరికాదు. పరస్పరాశ్రయవాదులు అన్ని రకాల రాజకీయ కార్యకలాపాలను వ్యతిరేకించారు. ఇంటర్నేషనల్ తొలిరోజుల్లో వీరి ప్రభావం ఎక్కువగా ఉంది. కాని హేగ్ మహాసభలో గ్విల్లామ్ చెప్పినట్టు స్వయం ప్రతిపత్తివాదులు 'సామాజిక విప్లవం కోసం, బూర్జువా రాజకీయాలను, రాజ్యాన్ని ధ్వంసం చేయడం కోసం ఉద్దేశించిన ప్రత్యేక రాజకీయాల' కోసం పోరాడారు.[129] వీరు ఇంటర్నేషనల్‌లో విప్లవకారులతో పాటు ఉండేవారన్నది మరచిపోకూడదు.

అంతేకాకుండా వీరు రాజకీయాధికారం, రాజ్యం, ఉద్యోగస్వామ్యం అనే సమస్యలపై ఆసక్తికరమైన చేర్పులను అందించారు.

ఈ పరిస్థితులలో 'ప్రతికూల రాజకీయాలు' మాత్రమే కార్యాచరణకు వీలైనవని స్వయం ప్రతిపత్తివాదులు వాదిస్తున్న దానికి, కేంద్రం బలంగా ఉండాలనే వారు చెబుతున్న 'సానుకూల రాజకీయాల'కు మధ్య తేడా ఏమిటి? ఇటాలియన్ ఫెడరేషన్ ప్రతిపాదనతో 1872 సెప్టెంబర్ 15, 16 తేదీలలో సెయింట్–ఇమియర్‌లో అంతర్జాతీయ మహాసభ జరిగింది. హేగ్ మహాసభకు హాజరైన ప్రతినిధులలో కొందరు సెయింట్ – ఇమియర్‌లో మహాసభకు కూడా హాజరయ్యారు. ఈ సభలో తీర్మానాలు స్పష్టం చేసిందేమంటే, 'రాజకీయ నిర్మాణాలన్నీ ఆధిపత్య నిర్మాణాలే; ఇవి ఒక వర్గానికి ప్రయోజనం చేకూర్చుతూ ప్రజానీకానికి హానిచేసేవే. కార్మికవర్గం అధికారం చేపట్టడాన్ని లక్ష్యంగా నిర్ణయించుకుంటే, అది కూడా ఒక ఆధిపత్య దోపిడీ వర్గంగా తయారవుతుంది. అందువల్ల అన్ని రకాల రాజకీయాధికారాన్ని ధ్వంసం చేయడమే కార్మికవర్గ తొలి కర్తవ్యం. తాత్కాలిక, విప్లవ రాజకీయాధికారం సాగించే ఏ సంస్థ అయినా ఈ విధంగా ధ్వంసం చేస్తుందని చెప్పడం మళ్లీ మోసం చేయడమే అవుతుంది. ఇవి కూడా ప్రస్తుత ప్రభుత్వాల మాదిరిగా కార్మికులకు ప్రమాదకరమైనవే'. [130] బకూనిన్ అసంపూర్తిగా రాసిన **'ది ఇంటర్నేషనల్ అండ్ కార్ల్‌మార్క్స్'** అనే పుస్తకంలో ఇలా చెప్పాడు : ఇంటర్నేషనల్ కర్తవ్యం రాజ్య సంబంధిత రాజకీయాలకు, బూర్జువా ప్రపంచానికి వెలుపల కార్మికులకు నాయకత్వం వహించడం. ఈ కార్యక్రమానికి నిజమైన ఆధారం 'అత్యంత సరళమైనది, మితమైనది' కావాలి. అది పెట్టుబడిదారీ విధానానికి వ్యతిరేకంగా కార్మికవర్గ సంఘీభావాన్ని నిర్మించడం.[131] నిజానికి వివిధ మార్పులను పరిగణనలోకి తీసుకున్నపుడు ఈ సూత్రాల ప్రకటన ఇంటర్నేషనల్ తొలి రోజుల్లో నిర్ణయించిన లక్ష్యాలకు చాలా దగ్గరగా ఉంది. అయితే 1871 లండన్ సమావేశం తరువాత మార్క్స్, జనరల్ కౌన్సిల్ తీసుకున్న నిర్ణయాలకు చాలా భిన్నమైన దిశలో ఇవి ఉన్నాయి.[132]

సిద్ధాంతాలకు, లక్ష్యాలకు మధ్య వున్న తీవ్రమైన వైరుధ్యం హేగ్ మహాసభ వాతావరణాన్ని నిర్ణయించింది. సభలో మెజారిటీ 'నిశ్చితంగా' రాజకీయాధికారాన్ని గెలవాలని ప్రతిపాదించారు.[133] అయితే రాజకీయ పార్టీ అనేది కేవలం బూర్జువా సంస్థలకు తలొగ్గి ఉండే పరికరమని స్వయం ప్రతిపత్తివాదులు వాదించారు. కమ్యూనిజం పట్ల మార్క్స్ అవగాహనను లాసాల్ ప్రతిపాదించిన 'పీపుల్స్ స్టేట్' (ప్రజల రాజ్యం) తో పోల్చడం ద్వారా దానిని వికృతపరచడానికి ప్రయత్నించారు. నిజానికి మార్క్స్ లాసాల్ భావనకి వ్యతిరేకంగా నిర్విరామంగా పోరాడాడు.[134] ఏది ఏమైనప్పటికీ వైరం మధ్యలో

హేతువుకు కొంత అవకాశం లభించడంతో బకూనిన్, గ్విల్లామ్ ఇద్దరు కూడా రెండు పక్షాలు ఒకే లక్ష్యంతో ఉన్నాయనేది గ్రహించగలిగారు.[135] ఏంగెల్స్‌తో కలిసి రాసిన 'ఆన్ ద ఫిక్టిషస్ స్ప్లిట్స్ ఇన్ ద ఇంటర్నేషనల్' అనే వ్యాసంలో రాజ్యాన్ని నిర్మూలించడమనేది సోషలిస్టు సమాజ స్థాపనకు అవసరమైన పరిస్థితులలో ఒకటి అని మార్క్స్ చెప్పాడు :

> సోషలిస్టులంతా అరాచకవాదాన్ని క్రింది విధంగా అర్థం చేసుకుంటున్నారు : ఒకసారి కార్మికోద్యమం వర్గ నిర్మూలన అనే లక్ష్యం సాధించిన తరువాత అత్యధిక సంఖ్యాకులైన ఉత్పత్తిదారులను అల్పసంఖ్యాకులైన దోపిడిదారులకు బానిసలుగా చేస్తున్న రాజ్యాధికారం అదృశ్యమవుతుంది. ప్రభుత్వ కార్యకలాపాలన్నీ కేవలం కార్యనిర్వహణకు మాత్రమే పరిమితమవుతాయి.

ఈ లక్ష్యాన్ని తక్షణమే సాధించాలని స్వయం ప్రతిపత్తివాదులు పట్టుపడుతున్నందువల్ల రాజీకి వీలులేని విభేదాలు తలెత్తాయి. వాస్తవానికి వారు ఇంటర్నేషనల్‌ను రాజకీయ పోరాట వేదికగా కాకుండా ఎటువంటి అధికార వ్యవస్థ లేని భవిష్యత్ సమాజానికి ఒక ఆదర్శవంతమైన నమూనాగా పరిగణిస్తున్నారు. బకూనిన్ ఆయన మద్దతుదారులు ఇలా భావిస్తున్నారని మార్క్స్ వివరించాడు :

> దోపిడిదారుల చేతుల్లో కేంద్రీకృతమైన శక్తివంతమైన సామాజిక, రాజకీయ శక్తులను కూలదోయడానికి కార్మికులకు అరాచకవాదమే తిరుగులేని ఆయుధమని వారు భావిస్తారు. అయితే ఏదో ఒక విధంగా ఇంటర్నేషనల్‌ని అణచివేయాలని పాత సమాజం ప్రయత్నిస్తున్న తరుణంలో దానిలో నిర్మాణానికి బదులు అరాచకతను ప్రవేశపెట్టాలని వారు కోరుతున్నారు.[136]

సోషలిస్టు సమాజంలో వర్గాలను, రాజ్యానికి చెందిన రాజకీయ అధికారాన్ని నిర్మూలించవలసిన అవసరం ఉందని ఇరు పక్షాలు అంగీకరిస్తున్నప్పటికీ, లక్ష్యసాధనకు అనుసరించవలసిన మార్గం గురించి, ఈ మార్పు తేగలిగిన సామాజిక శక్తుల గురించి రెండు పక్షాల మధ్య తీవ్రమైన విభేదాలున్నాయి. మార్క్స్ ప్రకారం ఫాక్టరీ కార్మికులు విప్లవాన్ని ముందుకు తీసుకువెళతారు. కాని బకూనిన్ ప్రకారం 'అణగారిన ప్రజలంతా' అంటే 'అల్లరిమూకలు' (lumpen proletarit) అని పిలవబడేవారు కూడా విప్లవ వర్గం అవుతారు. ఎందుకంటే ఈ వర్గం బూర్జువా నాగరికతతో కలుషితం కాలేదు. దాని అంతరంగిక అస్తిత్వంలో, దాని ఆశలలో, సమిష్టి జీవనపు అవసరాలలో, బాధలలో అది భవిష్యత్ సోషలిజం బీజాలను కలిగి వుంటుంది.[137] మార్క్స్ కమ్యూనిస్టు కావడంతో సామాజిక పరిణామం కోసం ప్రత్యేక చారిత్రక పరిస్థితులు, సమర్ధవంతమైన నిర్మాణం,

ప్రజలలో వర్గ చైతన్యం అవసరమవుతాయని గ్రహించగలిగాడు.[138] అరాచకవాది బకూనిన్ ప్రకారం సామాన్య ప్రజల అంటే అణగారిన ప్రజల సహజాతాలు అజేయమైనవి, న్యాయమైనవి. అవి తమంత తాము సామాజిక విప్లవం ప్రారంభించి, విజయాన్ని చేకూరుస్తాయి.[139]

సోషలిజం సాధనకు అవసరమైన సాధన సంపత్తి గురించి కూడా ఇరుపక్షాల మధ్య తీవ్రమైన విభేదం ఉంది. బకూనిన్ సమరశీల కార్యకలాపాలలో ఎక్కువ భావం రహస్య సంఘాల నిర్మాణానికి (లేదా నిర్మిద్దామని కలలు కనడానికి) పరిమితమయ్యాయి. ఇవి ఎక్కువగా మేధావులతోనే ఏర్పాటయ్యేవి. వీరు అంకితభావంతో, శక్తివంతంగా పనిచేసే తెలివైన వ్యక్తులతో కూడిన విప్లవ సేనానులు. అన్నిటినీమించి ప్రజలకు నిజాయితీపరులైన స్నేహితులు.[140] వీరు సాయుధ తిరుగుబాటుకు సన్నద్ధం చేసి విప్లవం తీసుకువస్తారు. ఏదిఏమైనప్పటికీ కార్మికవర్గం స్వీయ విముక్తి కోసం కృషి చేస్తుందని మార్క్స్ విశ్వసించాడు. 'రహస్య సంఘాలు కార్మికవర్గ ఉద్యమానికి నష్టం చేస్తాయని' ఆయన స్పష్టం చేశాడు. ఈ సంఘాలు 'కార్మికులకు తెలియజెప్పడానికి బదులు నిరంకుశ, మార్మిక నియమాలతో వారి స్వాతంత్ర్యాన్ని పోగొట్టుకొనే విధంగా చేస్తాయని, వారి ఆలోచనా శక్తిని పక్కదారి పట్టిస్తాయని'[141] మార్క్స్ వివరించాడు. ప్రత్యక్షంగా విప్లవానికి ఉపయోగపడని కార్మికవర్గ రాజకీయ కార్యకలాపాలన్నిటినీ బకూనిన్ వ్యతిరేకించాడు. అయితే మార్క్స్ మాత్రం సంఘ సంస్కరణలు, పాక్షిక లక్ష్యాలను తిరస్కరించలేదు. అయితే ఇవన్నీ పెట్టుబడిదారీ ఉత్పత్తి విధానాన్ని అధిగమించే కార్మికవర్గ పోరాటాలను పటిష్టం చేసుకోవడానికి ఉపయోగపడాలని మార్క్స్ గట్టిగా విశ్వసించాడు. అంతేగాని ఇవి వారిని వ్యవస్థలో భాగం చేయకూడదని ఆయన స్పష్టం చేశాడు.

విప్లవం తరువాత కూడా వారిరువురి విభేదాలు తొలగిపోయేవి కాదు. బకూనిన్ ప్రకారం 'కార్మికవర్గం ఆర్థిక విముక్తి సాధించాలంటే తప్పనిసరిగా దీనితోపాటుగా రాజ్యాన్ని రద్దు చేయాలి.'[142] మార్క్స్ ప్రకారం రాజ్యం ఒక్కరోజులో అంతర్ధానమయ్యే వ్యవస్థ కాదు. 1873 డిసెంబర్‌లో 'అల్మనాకో రిపబ్లికానో' పత్రిక ప్రచురించిన 'పొలిటికల్ ఇండెఫరింటిజమ్' వ్యాసంలో, ఇటలీ కార్మిక ఉద్యమంపై అరాచకవాదులు సాగిస్తున్న ఆధిపత్యాన్ని మార్క్స్ ఇలా సవాలు చేశాడు :

> కార్మికవర్గ రాజకీయ ఉద్యమం హింసాత్మక రూపాలు తీసుకుంటే, కార్మికులు బూర్జువా నియంతృత్వం స్థానంలో తమ విప్లవాత్మక నియంతృత్వాన్ని ప్రవేశపెడితే. బకూనిన్ అభిప్రాయంలో వారు సిద్ధాంతానికి ద్రోహం చేసి

> భయానక నేరం చేసినట్టే. ఎందుకంటే వారు తమ దయనీయమైన, అపవిత్రమైన రోజువారీ అవసరాలు తీర్చుకోవడానికి, బూర్జువా ప్రతిఘటనను అణచివేయడానికి గాను ఆయుధాలు అప్పగించి, రాజ్యాన్ని వెంటనే రద్దు చెయ్యడానికి బదులు దానికి విప్లవాత్మకమైన, తాత్కాలికమైన రూపం ఇస్తారు.[143]

బూర్జువా అధికారానికి, కార్మికవర్గ అధికారానికి మధ్య తేడా చూడడానికి కొన్నిసార్లు చికాకు కలిగించే విధంగా బకూనిన్ తిరస్కరించాడు. అయితే పెట్టుబడిదారీ విధానానికి, సోషలిజానికి మధ్య పరిణామ దశలో కొన్ని ప్రమాదాలను ఆయన ముందుగా చూశాడు. ప్రత్యేకించి విప్లవం అనంతరం అది ఉద్యోగస్వామ్యంగా దిగజారే ప్రమాదం ఉందని పేర్కొన్నాడు. ఆయన 1870 – 1871 మధ్యకాలంలో అసంపూర్తిగా రాసిన 'ది క్నూటో–జర్మనిక్ అంపైర్ అండ్ ది సోషల్ రివల్యూషన్' అనే పుస్తకంలో ఈ విధంగా రాశాడు :

> మార్క్స్ ప్రతిపాదిస్తున్న ప్రజల రాజ్యంలో ఎటువంటి ప్రత్యేక హక్కులున్న వర్గం ఉండదని మనకు చెబుతున్నారు. న్యాయం, రాజకీయాలపరంగానే కాక, ఆర్థికపరంగా కూడా అందరూ సమానులేనని చెబుతున్నారు. (...) అందువల్ల ఎటువంటి ప్రత్యేకతలున్న వర్గం ఉండదు. అయితే ప్రభుత్వం ఉంటుంది. ఈ విషయం జాగ్రత్తగా గమనించాలి. అత్యంత సంక్లిష్టమైన ఈ ప్రభుత్వం ఈ రోజునున్న ప్రభుత్వాల మాదిరిగా, ప్రజలను రాజకీయంగా పరిపాలించడంతో సరిపెట్టుకోదు. ప్రజలను ఆర్థికంగా కూడా నడిపిస్తుంది. ఉత్పత్తి, సంపద పంపిణీ, వ్యవసాయాన్ని తన చేతుల్లో కేంద్రీకరిస్తుంది. ఫ్యాక్టరీల స్థాపన, వాటి అభివృద్ధి, వాణిజ్య నిర్వహణ, చివరకు రాజ్యం నియంత్రణలో ఉన్న బ్యాంకింగ్ వ్యవస్థ ద్వారా వివిధ ఉత్పత్తి రంగాలకు పెట్టుబడిని కేటాయించడం ద్వారా ఆర్థిక నిర్వహణ చేస్తుంది. అది శాస్త్రీయ వివేచనపై ఆధారపడిన పాలన. అన్ని పాలనా వ్యవస్థల్లోకి అత్యంత శిష్టవాద, నిరంకుశ, అహంకారపూరిత, అవమాన పూరితమైన పాలన. అక్కడ కొత్తవర్గం, నిజమైన లేదా కుహనా సైంటిస్టుల, విద్యావేత్తల కొత్త దొంతరల వ్యవస్థ ఉంటాయి. విజ్ఞానం పేరుతో అమాయకులైన మెజారిటీపై మైనారిటీ పాలన సాగుతుంది. (...) ప్రతి రాజ్యం అది ఎంత రిపబ్లికన్ రాజ్యమైనప్పటికీ, ఎంత ప్రజాస్వామ్యయుత మైనదైనప్పటికీ (...) పై నుంచి ప్రజలను పాలించేదే. తెలివైన, ప్రత్యేక సౌకర్యాలున్న, మైనారిటీ ఈ పాలన చేస్తుంది. ప్రజలకంటే వారి అవసరాలు

ఈ మైనారిటీకే ఎక్కువ తెలుస్తాయని చెప్పుకుంటారు.[144]

అర్థశాస్త్ర పరిజ్ఞానం అంతగా లేనందువల్ల బకూనిన్ ప్రస్తావించిన సమాఖ్య మార్గంలో భవిష్యత్తు సోషలిస్ట్ సమాజ నిర్మాణానికి మార్గదర్శకంగా ఉండే అంశాలేవీ కనిపించవు. కానీ 20వ శతాబ్దంలో జరిగిన కొన్ని సంఘటనలను విమర్శనాత్మక దృష్టితో ముందుగానే చెప్పగలిగాడు.

## 12. మార్క్స్ తరువాత : కేంద్రీకృతవాదులు, స్వయంప్రతిపత్తివాదుల ఇంటర్నేషనల్

ఇంటర్నేషనల్ అంతకుపూర్వం ఉన్న వైభవం మళ్లీ ఎన్నడూ సంపాదించలేక పోయింది. 1864లో ప్రారంభమైన ఈ గొప్ప సంస్థ ఎనిమిది సంవత్సరాలపాటు సమ్మెలకు, పోరాటాలకు విజయవంతంగా మద్దతు ఇచ్చింది. పెట్టుబడిదారీ వ్యతిరేక కార్యక్రమాన్ని అమలు చేసింది. యూరోపులోని అన్ని దేశాలలో వ్యాపించింది. చివరకు హేగ్ మహాసభలో అంతర్గత కారణాలతో కుప్పకూలింది. ఏది ఏమైనప్పటికీ మార్క్స్ ఇంటర్నేషనల్ నుంచి తప్పుకున్నప్పటికీ కథ అంతటితో ముగియలేదు. ప్రస్తుతం రెండు గ్రూపులు ఏర్పడ్డాయి. వాటిసైజు చాలా తక్కువ. రాజకీయపరమైన ఆశలు గాని, శక్తి సామర్థ్యాలు గాని ఇంతకు పూర్వం ఉన్నట్టు లేవు. అయితే అదే వాతావరణం కొనసాగు తున్నది. ఒక గ్రూపు మెజారిటీలో ఉంది. వీరు చివరి కాంగ్రెస్‌లో తమ ధోరణి వ్యక్తం చేశారు. జనరల్ కౌన్సిల్ నాయకత్వంలో ఇంటర్నేషనల్ కొనసాగాలని వీరు కోరుకున్నారు. వీరిని 'సెంట్రలిస్టులు' అంటే కేంద్రం బలంగా ఉండాలనే వారుగా గుర్తించారు. రెండో గ్రూపు మైనారిటీగా ఉంది. వీరిని 'అటానమిస్టులు' లేదా 'ఫెడరలిస్టులు' [145] అన్నారు. నిర్ణయాలు చేయడంలో ఇంటర్నేషనల్‌లోని సెక్షన్లకు పూర్తి స్వయంప్రతిపత్తి ఉండాలని వీరు వాదించారు.

1872లో ఇంటర్నేషనల్ బలం ఇంకా తగ్గలేదు. గతంలో మాదిరిగా ఇంటర్నేషనల్‌లో అసమానతలు కొనసాగుతున్నాయి. కొన్ని దేశాలలో (ఉదాహరణకి స్పెయిన్, ఇటలీ) అది బాగా విస్తరించినప్పటికీ, మరికొన్ని దేశాలలో (ఉదాహరణకు బ్రిటన్) దాని బలం తగ్గిపోయింది. హేగ్ మహాసభలో నాటకీయ పరిణామాల మధ్య ఇంటర్నేషనల్ చీలిపోయింది. అనేక మంది కార్యకర్తలు ప్రధానంగా కేంద్రం బలంగా ఉండాలనే శిబిరంలోని వారు కార్మిక ఉద్యమ చరిత్రలో మరో ప్రధానఘట్టం ముగిసిపోయిందని గుర్తించగలిగారు. ఉత్తర అమెరికా ఫెడరేషన్‌తో పాటు యూరోపులోని పరిమితమైన శక్తులు కలిసి న్యూయార్క్‌లోని జనరల్ కౌన్సిల్‌కు మద్దతు ఇచ్చాయి.

రోమండే ఫెడరేషన్, స్విట్జర్లాండ్‌లో జర్మన్ భాష మాట్లాడేవారి సెక్షన్లు బెకర్ చొరవకు మద్దతు తెలిపాయి. జర్మన్ సోషల్ డెమోక్రాటిక్ వర్కర్స్ పార్టీ మద్దతు తెలిపినప్పటికీ అది పైకి కనిపించేది కాదు. కొత్తగా చేరిన ఆస్ట్రియా సెక్షన్లు జర్మన్ల మాదిరిగా కాకుండా సభ్యత్వ రుసుం నుంచి కొంత సొమ్ము సమీకరించి పంపారు. పోర్చుగల్, డెన్మార్క్ సెక్షన్లు కూడా ఈ ఇంటర్నేషనల్‌కు మద్దతు ఇచ్చాయి. అయితే స్పెయిన్, ఇటలీ, నెదర్లాండ్స్‌లలో కొత్త ఆదేశాలను ఎవరూ పట్టించుకోలేదు. ఐర్లాండ్‌లో చోటే లేకుండా పోయింది. 1873 నాటికి ఫ్రాన్స్‌లో ఇంటర్నేషనల్ సెక్షన్లు అనేవే లేకుండా పోయాయి. హేగ్ మహాసభ కంటే ముందునుండి వున్న వ్యక్తిగత విభేదాల కారణంగా 1872 నవంబర్‌లో బ్రిటిష్ ఫెడరల్ కౌన్సిల్ రెండుగా చీలిపోయింది. రెండు వర్గాలు తామే ఇంటర్నేషనల్‌కు నిజమైన ప్రతినిధులమని చెప్పుకున్నాయి. హేల్స్ 16 సెక్షన్లకు నాయకత్వం వహిస్తూ, ఇంటర్నేషనల్‌లో ప్రముఖులైన హెర్మన్ జంగ్ (1830–1901), థామస్ మోటర్‌హెడ్ (1825–84)ల మద్దతుతో న్యూయార్క్‌లోని జనరల్ కౌన్సిల్‌తో తెగతెంపులు చేసుకున్నాడు. 1873 జనవరిలో బ్రిటిష్ ఫెడరేషన్ మహాసభ జరపడానికి హేల్స్ పిలుపు ఇచ్చాడు. హేల్సు, ఇకారియస్‌లు సంస్కరణవాదులే అయినప్పటికీ, ఎన్నికలలో పాల్గొనాలని వాదించినప్పటికీ రాజకీయపరంగా వీరు అనేక కుప్పిగంతులు వేశారు. వారు ట్రేడ్ యూనియన్ల మద్దతుతో ఇంటర్నేషనల్‌ను రాజకీయ పార్టీగా మార్చాలని ఆలోచించారు. ఆ పార్టీ బూర్జువా వర్గంలోని ఉదారవాద పక్షాలతో పొత్తు పెట్టుకోవాలని వారు కోరుకున్నారు. కాని అధికారికంగా వారు తటస్థవాదులైన గ్విల్లామ్, బకూనిన్‌లతో కలిసిపోయారు. ఈ పరిణామాలకు స్పందిస్తూ ఏంగెల్స్ హేగ్ మహాసభ నిర్ణయాలను గుర్తిస్తూ రెండు సర్క్యులర్లు విడుదల చేశాడు. వీటిపై మాంచెస్టర్‌లోని ప్రముఖ నాయకులు 'అధికారిక' బ్రిటిష్ ఫెడరల్ కౌన్సిల్ నాయకులు, జనరల్ కౌన్సిల్ మాజీ సభ్యులు డిపాంట్, ఫ్రీడ్రిక్ లెస్నర్ (1825–1910)లు సంతకాలు జేశారు. కౌన్సిల్ మహాసభ జూన్‌లో జరిగింది. అందులో పాల్గొన్నవారు జనరల్ కౌన్సిల్‌ను న్యూయార్క్‌కి తరలించడమనే చేదు నిజాన్ని మింగవలసి వచ్చింది. (ఈ బదిలీ చేయడం ఇంటర్నేషనల్‌కు ముగింపేనని అందరూ భావించారు). అందువల్ల బ్రిటిషు ట్రేడ్ యూనియన్లు మనస్ఫూర్తిగా పాల్గొనలేకపోయాయి.[146] ఆ విధంగా రెండు గ్రూప్‌లలోనూ పతనం ప్రారంభమయింది.

కేంద్రం బలంగా ఉండాలని కోరేవారి సాధారణ మహాసభ మొదటి ఇంటర్నేషనల్ మహాసభ జరిగిన చోటే జెనీవాలో జరిగింది. బెకర్ కృషి ఫలితంగా ముప్పై (30) మంది ప్రతినిధులు హాజరయ్యారు. వారిలో (మొట్టమొదటిసారిగా) ఇద్దరు మహిళలు కూడా హాజరయ్యారు. వీరిలో పదిహేనుమంది జెనీవాకు చెందినవారే.

ఇతర దేశాల సెక్షన్‌ల నుంచి హాజరయిన వారు తక్కువ. జర్మనీ, బెల్జియం ఆస్ట్రియా - హంగరీల నుంచి ఒక్కొక్కరు వచ్చారు.[147] యూరోప్‌లోని నిరాశాజనకమైన సమీకరణలను చూసి న్యూయార్కు నుంచి ప్రతినిధులను పంపకూడదని జనరల్ కౌన్సిల్ నిర్ణయించింది. బ్రిటిష్ ఫెడరేషన్ నియమించిన సెక్రాలియర్ కూడా మహాసభకు హాజరు కాలేకపోయాడు. నిజానికి కేంద్రం బలంగా ఉండాలనే వారి ఇంటర్నేషనల్‌కు ఇదే ముగింపు.

ఇది ఇలా ఉండగా, ఉత్తర అమెరికాలో జ్వాల ఆరిపోకుండా చేయాలని సోర్జ్ తీవ్రంగా ప్రయత్నిస్తున్నప్పటికీ 'నార్త్ అమెరికన్ ఫెడరేషన్' పతనపు అంచుకు చేరుకుంది. సభ్యుల సంఖ్య వెయ్యి కంటె తగ్గిపోయింది. వీరిలో సభ్యత్వ రుసుం బకాయిలు చెల్లించిన వారు లేరు. అందువల్ల ఫెడరేషన్ ఆర్థిక పరిస్థితి దిగజారిపోయింది. పోస్టల్ స్టాంపులు కొనడం కూడా పెద్ద సమస్య అయింది. ఇది కేవలం అమెరికా సంయుక్త రాష్ట్రాల వ్యవహారాలకే పరిమితం అయ్యే పరిస్థితి ఏర్పడింది. అమెరికా కార్మికులు శత్రుత్వం, ఉదాసీనతల మధ్య ఊగిసలాడేవారు. ఫెడరేషన్ నవంబరు 1873లో విడుదల చేసిన 'మానిఫెస్టో టు ద వర్కింగ్ పీపుల్ ఆఫ్ నార్త్ అమెరికా' పట్ల కూడా వారు ఇదే వైఖరి అనుసరించారు.[148] ఈ పరిస్థితులలో సోర్జ్ ప్రధాన కార్యదర్శి పదవికి రాజీనామా చేశాడు. ముందుగా ఊహించినట్లుగా ఆ తరువాత రెండున్నర సంవత్సరాలలో అక్కడ ఇంటర్నేషనల్ చరిత్ర ముగిసిపోయింది. చివరిగా దాన్ని 1876 జూలై 15న రద్దు చేశారు. ఫిలడెల్ఫియాలో జరిగిన ఈ సభకు 635 మంది సభ్యులకు[149] ప్రాతినిధ్యం వహిస్తున్న 10 మంది ప్రతినిధులు హాజరయ్యారు. 'వర్కింగ్ మెన్స్ పార్టీ ఆఫ్ ది యునైటెడ్ స్టేట్స్' సంస్థాపక మహాసభ జరిగే ముందు ఇంటర్నేషనల్‌ను రద్దు చేశారు. అమెరికా శతాబ్ది ఉత్సవాల సందర్భంగా ఈ సంఘటన జరిగింది.

కేంద్రం బలమైనదిగా ఉండాలని వాదించేవారు రెండు దేశాలలో మరికొంత కాలం మనగలిగినప్పటికీ సిద్ధాంతం అభివృద్ధికి వారు ఎటువంటి కృషి చేయలేకపోయారు. మరోవైపు స్వయం ప్రతిపత్తివాదులు మరికొన్ని సంవత్సరాలపాటు చురుకుగా పనిచేశారు. వీరు సెయింట్ - ఇమియర్‌లో నిర్వహించిన మహాసభకు స్విట్జర్లాండ్, ఇటలీ, స్పెయిన్, ఫ్రాన్స్‌ల ప్రతినిధులు హాజరయ్యారు. 'స్వయం ప్రతిపత్తి కలిగిన ఫెడరేషన్లు, సెక్షన్లు తమంతతామే నిర్ణయాలు తీసుకునే తిరుగులేని హక్కును, తాము మంచిదని నమ్మే రాజకీయ పంథాను అనుసరించడానికి ఉన్న హక్కును లేకుండా చేసే హక్కు ఎవరికీ లేదని', ఇది ఇంటర్నేషనల్‌లోని సమాఖ్యపరమైన స్వయంప్రతిపత్తిలో భాగమని, దీనితో పాటు 'స్నేహం, సంఘీభావం, పరస్పర రక్షణ ఒప్పందం' ఉంటుందని మహాసభలో నిర్ణయించారు. గ్విల్లామ్ కృషితో ఈ విధానం రూపొందింది. ఇదే బకూనిన్ అయితే

రాజీలేని విధానాన్ని ఎంచుకునేవాడు. బకూనిన్ కంటే చిన్నవాడైన గ్విల్లామ్ దూరదృష్టి కలిగినవాడు. తమ బలాన్ని జూరా, స్విట్జర్లాండ్, ఇటలీ దాటి విస్తరింపజేయాలని లండన్ పంథాను వ్యతిరేకించే ఫెడరేషన్లన్ని కూడగట్టాలనే లక్ష్యంతో ఆయన ఈ విధాన నిర్ణయం చేశాడు.[150] ఆ రోజున ఈ ఎత్తుగడ విజయం సాధించింది. వాగాడంబరంతో కూడిన ప్రకటనలతో కాకుండా కొత్త ఇంటర్నేషనల్ ఆవిర్భావాన్ని చాలా జాగ్రత్తగా నడిపించవలసి ఉంటుంది.

ఆ తరువాత కొద్ది నెలల్లో ఒకదాని తరువాత మరొక సంస్థ ఈ ఇంటర్నేషనల్‌లో అనుబంధ సంస్థలుగా చేరాయి. స్వయం ప్రతిపత్తివాదులకు స్పెయిన్ బలమైన కేంద్రంగా తయారైంది. ప్రాక్సెడెస్ మటియో సగాస్టా (1825-1903) వారిపై అణచివేత కొనసాగించినప్పటికీ స్వయంప్రతిపత్తివాదుల విస్తరణను అడ్డుకోలేకపోయాడు. 1872 డిసెంబర్, 1873 జనవరి మధ్యకాలంలో జరిగిన కార్డోబా ఫెడరల్ మహాసభ నాటికి స్పెయిన్‌లో 25వేల మంది సభ్యులతో (బార్సిలోనాలోనే 7500 మంది), 300పైగా సెక్షన్లు, 50 ఫెడరేషన్లు ఏర్పడ్డాయి.[151] 1872 చివరి నుంచి కొత్త దేశాలలో కూడా స్వయం ప్రతిపత్తివాదులు తమ బలం పెంచుకోగలిగారు. డిసెంబర్‌లో బ్రస్సెల్స్‌లో జరిగిన బెల్జియన్ ఫెడరేషన్ మహాసభలో హేగ్ కాంగ్రెస్ తీర్మానాలు చెల్లవని ప్రకటించారు. న్యూయార్క్‌లోని జనరల్ కౌన్సిల్‌ను గుర్తించడానికి నిరాకరించారు. సెయింట్ – ఇమియర్ ఒప్పందంపై సంతకాలు చేశారు.[152] 1873 జనవరిలో హేల్స్, ఇక్కారియస్‌ల నాయకత్వంలో బ్రిటిష్ తిరుగుబాటుదారులు ఇదే బాట పట్టారు. ఆ మరుసటి నెలలో డచ్ ఫెడరేషన్ కూడా వీరితో జత కలిసింది.[153]

ఫ్రాన్స్, ఆస్ట్రియా, అమెరికా సంయుక్త రాష్ట్రాలతో స్వయం ప్రతిపత్తివాదులు సంబంధాలు కొనసాగిస్తున్నారు. కొత్త ఇంటర్నేషనల్‌లో వారిదే మెజారిటీ అయింది. కాని వీరి కలయిక వాస్తవంలో అనేక విభేదాలున్న సిద్ధాంతాల కుప్పలాగా తయారైంది. వీరిలో స్విట్జర్లాండ్‌కు చెందిన గ్విల్లామ్, స్చ్విట్‌బెల్ నాయకత్వంలోని అరాచక – సమిష్టి వాదులు (బకూనిన్ 1873లో రాజకీయాల నుంచి విరమించుకొని 1876లో మరణించాడు) ఉన్నారు. డు పాప్ నాయకత్వంలోని బెల్జియన్ ఫెడరేషన్ ప్రజల రాజ్యానికి (volksstaat) అన్ని ప్రజాసేవలను నిర్వహించడంతోపాటు ఎక్కువ అధికారాలు, యోగ్యతలుండాలని కోరుకుంది. ఎప్పుడూ అతివాదులుగా ఉండే ఇటలీకి చెందిన వారు సాయుధ తిరుగుబాటు సిద్ధాంతాన్ని ఎంచుకున్నారు. అయితే ఇది విఫలం కాక తప్పదు. బ్రిటిష్ ప్రతినిధులు ప్రగతికాముక బూర్జువా శక్తులతో కలిసి ఎన్నికలలో పోటీ చేయాలని ప్రతిపాదించారు. 1874 నాటికి 'జనరల్ అసోసియేషన్ ఆఫ్ జర్మన్ వర్కర్స్'లోని

లాసాల్ అనుయాయులతో కూడా దీనికి సంబంధాలు ఏర్పడ్డాయి.

ఈ పరిస్థితులలో హేగ్ మహాసభలో చీలికకు కారణమైన ప్రధాన వైరుధ్యం ఒక బృందం ప్రభుత్వంతో ఒప్పందం కుదుర్చుకోవాలనుకోవడం లేదా మరో బృందం విప్లవానికి మొండిగా కట్టుబడి ఉండడం మధ్య కాని, రాజకీయ కార్యాచరణకు అనుకూలంగా లేదా ప్రతికూలంగా ఉన్నవారి మధ్య కాని లేదని స్పష్టమైంది. జనరల్ కౌన్సిల్ పట్ల తీవ్రమైన, విస్తృతమైన వ్యతిరేకత రావడానికి ప్రధాన కారణం లండన్ సమావేశం 1871లో తీసుకున్న తొందరపాటు చర్యలలో ఉంది. జూరా, స్పానిష్ ఫెడరేషన్లు, ఆ తరువాత కొత్తగా ఏర్పాటైన ఇటాలియన్ ఫెడరేషన్, కార్మికవర్గ రాజకీయ పార్టీలు నిర్మించాలని మార్క్స్ చేసిన ప్రతిపాదనను ఎన్నటికీ అంగీకరించేవి కావు. అన్నిటినీ మించి ఈ దేశాలలో సామాజిక – ఆర్థిక పరిస్థితులు మార్క్స్ చేసిన ప్రతిపాదనకు అనుకూలంగా లేవు. ఈ విధానాన్ని మరికొంచెం జాగ్రత్తగా ప్రతిపాదిస్తే, మొదటి నుంచి ఇంటర్నేషనల్‌లో సమతూకానికి సహకరిస్తున్న బెల్జియం నుంచి, ఇటీవలే ఫెడరేషన్లు ఏర్పాటు చేసిన డచ్ వారి నుంచి మద్దతు లభించి ఉండేది. తక్కువ స్థాయిలో అంతర్గత ఘర్షణ ఉంటే, కేవలం వ్యక్తుల మధ్య విభేదాల కారణంగా విడిపోయిన బ్రిటన్‌లో కూడా చీలిక నివారించే అవకాశం ఉండేది. కొంతమంది స్వయం ప్రతిపత్తివాదులు భావించినట్టుగా, జనరల్ కౌన్సిల్‌ను న్యూయార్క్‌కు తరలించడం వల్ల వారికి రాజకీయంగా ఎక్కువ అవకాశం లభించింది. 1872 తరువాత వారికి మరింత బలం సమకూరింది. కానీ తొలి ఇంటర్నేషనల్ చరిత్రాత్మకమైన కృషి చేసిందని దాన్ని రద్దు చేయవలసిన సమయం వచ్చిందన్న మార్క్స్ అభిప్రాయంలో వాస్తవం ఉంది.

స్వయం ప్రతిపత్తివాదుల 'తొలి' మహాసభ లేదా వారు చెప్పుకున్నట్టుగా ఇంటర్నేషనల్ ఐదు మహాసభలను కూడా లెక్కించి జరుపుకుంటున్న 'ఆరో' మహాసభకు 32 మంది ప్రతినిధులు హాజరయ్యారు. బెల్జియం, స్పెయిన్, ఫ్రాన్స్, ఇటలీ, బ్రిటన్, నెదర్లాండ్స్, స్విట్జర్లాండ్‌ల నుంచి ఈ ప్రతినిధులు వచ్చారు. కేంద్రం బలంగా ఉండాలని వాదించేవారి మహాసభ కంటే వారం రోజుల ముందు జెనీవాలో 1873 సెప్టెంబర్ 1 నుంచి 6 వరకు ఈ మహాసభ జరిగింది. 'ఇంటర్నేషనల్‌లో నూతన శకం ప్రారంభమైందని'[154] మహాసభ ప్రకటించింది. జనరల్ కౌన్సిల్‌ను రద్దు చేయాలని మహాసభ ఏకగ్రీవంగా తీర్మానించింది. ఇంటర్నేషనల్‌లో మొదటిసారి అరాచకవాద సంఘాలపై చర్చ జరిగింది.[155] సామాజిక విప్లవం కోసం సార్వత్రిక సమ్మెను ఆయుధంగా ఉపయోగించాలని నిర్ణయించడం వల్ల ఈ ఇంటర్నేషనల్‌కు సైద్ధాంతిక – రాజకీయ ఆయుధ సంపత్తి పెరిగింది. ఈ విధంగా అనార్కో – సిండకలిజంగా పేరుపొందిన

సిద్ధాంతాలకు పునాది ఏర్పడింది.[156]

ఆ తరువాత మహాసభ 1874 సెప్టెంబర్ 7 నుంచి 13 వరకు బ్రస్సెల్స్‌లో జరిగింది. 16 మంది ప్రతినిధులు హాజరయ్యారు. బ్రిటన్ నుంచి ఒకరు (ఇక్కారియస్), స్పెయిన్ నుంచి ఒకరు, మిగిలిన వారంతా బెల్జియం నుంచి వచ్చారు. ఈ మిగిలిన 14 మందిలో ఇద్దరు ఫ్రెంచ్ (పారిస్) లేదా ఇటలీ (పాలెర్మో) సెక్షన్లకు, మరో ఇద్దరు ఆ రోజుల్లో బెల్జియంలో నివసిస్తున్న జర్మనీకి చెందిన లాసాల్ అనుయాయులకు చెందిన వారు. వీరిలో ఒకరు కారల్ ఫ్రోహ్మె (1850–1933) 'జనరల్ అసోసియేషన్ ఆఫ్ జర్మన్ వర్కర్స్'కు ప్రాతినిధ్యం వహిస్తున్నట్టు గ్విల్లామ్ ప్రకటించాడు. సోషలిజం అనే పటంలో అరాచకవాదులు, లాసాల్‌ను బలపరిచేవారు భిన్నధృవాలు. 1873 జెనీవా కాంగ్రెస్‌లో ఆమోదించిన కొత్త నిబంధనల ప్రకారం గ్విల్లామ్ వారిని ప్రోత్సహించాడు. కొత్త నిబంధనల ప్రకారం ప్రతి దేశంలో కార్మికులు తమ విముక్తి కోసం తమకు ఇష్టమైన విధానాలను అనుసరించవచ్చు.[157] ఏది ఏమైనప్పటికీ అతి తక్కువ మంది నాయకులు హాజరైన ఇంటర్నేషనల్ సమావేశాలలో ఇదొకటి. శ్రామికవర్గ భౌతిక పరిస్థితులు, వాటిని మార్చడానికి చేపట్టవలసిన కార్యాచరణ గురించి చర్చించారు. ఈ సమావేశంలో అరాచకవాదానికి, ప్రజల రాజ్యానికి మధ్య ప్రధానంగా చర్చ జరిగింది. మూడు సంవత్సరాల తరువాత ఇంటర్నేషనల్ మహాసభకు హాజరైన డు పాప్ ఈ సభలో ప్రధాన భూమిక నిర్వహించాడు. ఆయన తన ప్రసంగంలో స్పెయిన్, ఇటలీలో కొన్ని భాగాలు, జూరా ఫెడరేషన్ అరాచకవాదానికి సన్నిహితంగా ఉన్నాయని, కాని జర్మనీ, నెదర్లాండ్స్, బ్రిటన్, అమెరికాలు కార్మిక ప్రభుత్వాన్ని కోరుతున్నాయని (బెల్జియం రెండింటి మధ్య ఊగిసలాడుతున్నదని)[158] చెప్పాడు. అయితే ఈసారి కూడ వీటిపై సమిష్టి నిర్ణయం జరగలేదు. 'ప్రతి దేశంలోను ఫెడరేషన్లు, సోషలిస్టు డెమోక్రాటిక్ పార్టీలు తమకు ఇష్టమైన రాజకీయ పంథా అనుసరించవచ్చునని' [159] మహాసభ ఏకగ్రీవంగా తీర్మానించింది.

1876లో అక్టోబర్ 26 నుంచి 30 వరకు బెర్న్‌లో జరిగిన ఎనిమిదో మహాసభలో కూడా చర్చలు ఇదే విధంగా జరిగాయి. సభకు 28 మంది ప్రతినిధులు హాజరయ్యారు. వీరిలో స్విట్జర్లాండ్‌కు చెందిన వారు 19 మంది (17 మంది జూరా ఫెడరేషన్‌కు చెందినవారు). ఇటలీ నుంచి నలుగురు, స్పెయిన్ నుంచి ఇద్దరు, ఫ్రాన్స్ నుంచి ఇద్దరు ప్రతినిధులు వచ్చారు. బెల్జియం, నెదర్లాండ్స్‌లకు డు పాప్ ప్రాతినిధ్యం వహించాడు. డు పాప్, గ్విల్లామ్‌ల విధానాలలో పొంతన లేదని సమావేశాలలో వెల్లడైంది.[160] అయితే సంవత్సరం తరువాత ప్రపంచ సోషలిస్టు మహాసభ జరపాలని,

ఈ సభకు 'యూరోపులోని సోషలిస్టు పార్టీలలోని అన్ని గ్రూపులను ఆహ్వానించాలని'[161] ఒప్పందానికి వచ్చారు. బెల్జియం ఫెడరేషన్ ఈ ప్రతిపాదన పెట్టింది.

ప్రపంచ సోషలిస్ట్ మహాసభ కంటే ముందు 1877లో సెప్టెంబర్ 6 నుంచి 8 వరకు ఇంటర్నేషనల్ చివరి మహాసభ వర్వియస్‌లో నిర్వహించారు. ఈ మహాసభకు 22 మంది ప్రతినిధులు హాజరయ్యారు. వీరిలో 13 మంది బెల్జియం నుంచి, స్పెయిన్, ఇటలీ, ఫ్రాన్స్, జర్మనీల నుంచి ఇద్దరేసి ప్రతినిధులు వచ్చారు. జూరా ఫెడరేషన్‌కు గ్విల్లామ్ ప్రాతినిధ్యం వహించాడు. సోషలిస్టు గ్రూపుల నుంచి ముగ్గురు పరిశీలకులు హాజరయ్యారు. సలహా, సంప్రదింపులకు మాత్రమే వీరి పాత్ర పరిమితం. వీరిలో పీటర్ క్రొపోట్కిన్ (1842-1921) కూడా ఉన్నాడు. ఈయన తరువాత 'అనార్కో - కమ్యూనిజం' సిద్ధాంతాన్ని ప్రతిపాదించాడు. మొత్తంమీద మహాసభలో అరాచకవాదులే చురుకుగా ఉన్నారు. వీరిలో ఇటలీకి చెందిన ఆండ్రియా కోస్టా (1851-1910) కూడా ఉన్నాడు. ఈయన తరువాత సోషలిస్టులతో కలిసిపోయాడు. కేవలం స్పెయిన్‌లో మాత్రమే ప్రజారాశుల్లో వేళ్లూనుకున్న స్వయంప్రతిపత్తివాద ఇంటర్నేషనల్ ప్రాభవం కూడా ముగింపుకి వచ్చింది. యావత్ యూరోపు కార్మికోద్యమం పార్టీలు ఏర్పాటు చేసుకొని రాజకీయ పోరాటం సాగించడం అత్యంత ప్రధానమని గుర్తించడంతో అరాచకవాదుల ప్రాబల్యం తగ్గింది. ఈ ప్రాబల్యం తగ్గడంతో పాటు అరాచకవాదులు, సోషలిస్టులకు మధ్య దూరం కూడా పెరిగింది.

## 13. కొత్త ఇంటర్నేషనల్

1877 సెప్టెంబర్ 9 నుంచి 16 వరకు ఘెంట్ నగరంలో అంతర్జాతీయ సోషలిస్టు మహాసభ జరిగింది. ఇంతకు ముందెన్నడు లేనంతగా చాలా ఎక్కువ దేశాల నుంచి ప్రతినిధులు వచ్చారు. దాదాపు తొమ్మిది దేశాల నుంచి ఫ్రాన్స్, జర్మనీ, స్విట్జర్లాండ్, బ్రిటన్, స్పెయిన్, ఇటలీ, హంగెరీ, రష్యా, బెల్జియంల నుంచి వచ్చిన ప్రతినిధులకు మూడువేల మందికి పైగా కార్మికులు స్వాగతం పలికారు. కొంతమంది ప్రతినిధులు వేరే దేశాలకు (డెన్మార్క్, అమెరికా సంయుక్త రాష్ట్రాలు, తొలిసారిగా గ్రీసు, ఈజిప్టుల కార్మిక బృందాలకు) కూడా ప్రాతినిధ్యం వహించారు. ఇంటర్నేషనల్ చరిత్రలో పేరుపొందిన నాయకులు డు పాప్, లీబ్‌క్‌నెక్ట్‌లే కాకుండా ఫ్రాంకెల్, గ్విల్లామ్, హేల్స్ తదితరులు హాజరయ్యారు. దీన్ని బట్టి యూరోపు కార్మికోద్యమంలో నిర్మాణం ఆవశ్యకతను అందరూ గుర్తించారన్నది స్పష్టమవుతున్నది.

మహాసభ ముగింపులో 'అన్ని దేశాల కార్మిక సంఘాలు, సొసైటీల మేనిఫెస్టో'ను

విడుదల చేశారు. డు పాప్, భవిష్యత్తులో బెల్జియం సోషలిస్టు నాయకుడుగా అవతరించిన లూయీ బెర్ట్రాండ్ (1856–1943) ఈ మేనిఫెస్టోను రాశారు. 'జనరల్ యూనియన్ ఆఫ్ ది సోషలిస్టు పార్టీ' ఏర్పాటు చేయాలని మహాసభ పిలుపు ఇచ్చింది. మహాసభలో అత్యధికులు ఒక 'ఒప్పందం'పై సంతకాలు చేశారు :

> సామాజిక విముక్తిని, రాజకీయపరమైన విముక్తి నుంచి విడదీయడం సాధ్యంకాదు. అందువల్ల ధనిక వర్గాలు ఏర్పాటు చేసుకున్న వివిధ పార్టీలకు వ్యతిరేకంగా కార్మికవర్గ పార్టీ ఏర్పాటు చేసుకుని కార్మికుల విముక్తికి తోడ్పడే అన్ని రాజకీయ మార్గాలను ఉపయోగించుకోవాలని; ధనిక వర్గాల పాలనకు వ్యతిరేకంగా జరిగే పోరాటం స్థానిక లేదా జాతీయ పరిమితులకు లోనుగాకుండా ప్రపంచవ్యాప్తంగా ఉండి తీరాలని; పోరాటం విజయవంతం కావడానికి వివిధ దేశాల కార్మిక సంఘాల మధ్య సామరస్యపూర్వకమైన, ఐక్య కార్యాచరణ ఉండాలని గుర్తించి ఈ క్రింది సంతకాలు చేసిన ఘెంట్‌లో జరిగిన 'యూనివర్సల్ సోషలిస్ట్ కాంగ్రెస్'కు ప్రతినిధులుగా హాజరైన మేము కార్మికసంఘాలన్నీ తాము చేసే పారిశ్రామిక, రాజకీయ ప్రయత్నాలన్నింటిలో పరస్పరం భౌతిక, నైతిక సహకారాలు అందజేసుకోవాలని కోరుతున్నాం.

1871లో లండన్ సమావేశం జరిగిన ఆరు సంవత్సరాల తరువాత ఘెంట్ సిద్ధాంతం వెలువడింది. మార్క్స్ తన కాలం కంటే ముందున్నట్టు ఇది రుజువు చేస్తున్నది. అదే ఒప్పందపత్రం ధృవీకరించిన విషయమేమంటే :

> శక్తివంతమైన ఆందోళన, ప్రచారం, సార్వత్రిక విద్య, ఐక్యత కోసం సాధనంగా రాజకీయ కార్యాచరణ అవసరమవుతుందని మేము తెలియచేస్తున్నాం. ప్రస్తుత సామాజిక నిర్మాణంపై మనకు అందుబాటులో ఉన్న అన్ని మార్గాలను ఉపయోగించుకొని, అన్ని వైపులనుంచి ఒకేసారి దాడి చేయాలి. (...) సోషలిజం భవిష్యత్తు సమాజం గురించిన సైద్ధాంతిక ఊహాజనిత చిత్రం కారాదు. నిజమైన, సజీవమైన ఆశలకు, తక్షణ అవసరాలకు, సామాజిక పెట్టుబడిపై అదేవిధంగా సామాజిక అధికారంపై నియంత్రణ సాగిస్తున్న వారికి వ్యతిరేకంగా కార్మికవర్గం జరిపే రోజువారీ పోరాటాలకి సంబంధించిందే సోషలిజం.
>
> బూర్జువా వర్గం నుంచి రాజకీయ హక్కు లాక్కోడానికి, ఇంతకు ముందు విడిపోయి ఉన్న కార్మికులను ఐక్యం చేయడానికి, పనిగంటలు తగ్గించడానికి

సమ్మెల ద్వారా, ప్రతిఘటన సంఘాల ద్వారా కార్యాచరణకు పూనుకోవడం : దీనర్థం నూతన సమాజ నిర్మాణానికి పనిచేయడమే, సమాజ భవిష్యత్తు ఏర్పాట్లపై నిజమైన అన్వేషణ సాగించడమే.

ఇంకా సంఘటితం కాని కార్మికులు ఐక్యమై సంఘాలు ఏర్పాటు చేసుకోవాలి. ఆర్థిక పరిస్థితుల ఆధారంగా సంఘటితమైన కార్మికులు, రాజకీయ రంగంలో కూడా సంఘటితం కావాలి. ఈ రంగంలో కూడా అదే ప్రత్యర్థులు, అవే యుద్ధాలు ఉంటాయి. ఏ రంగంలో విజయం సాధించినా అది రెండో రంగానికి కూడా వర్తిస్తుంది.

ప్రతిదేశంలోని పేద వర్గాలు బూర్జువా పార్టీల కంటే భిన్నమైన పెద్ద పార్టీలు ఏర్పరచుకోవాలి. ఈ సామాజిక పార్టీ ఇతర దేశాలలోని ఇదేవిధమైన పార్టీలతో చేయి చేయి కలిపి ముందుకు సాగాలి.

మీ హక్కులన్నిటినీ సాధించుకోవడానికి, ప్రత్యేక హక్కులు రద్దు చేయడానికి ప్రపంచ కార్మికులారా, ఏకంకండి! [162]

తరువాత దశాబ్దాలలో కార్మికోద్యమం సోషలిజాన్ని తన కార్యక్రమంగా ప్రకటించింది. యూరోపులోను, మిగిలిన ప్రపంచ దేశాలలోను విస్తరించింది. అంతర్జాతీయ సహకారం కోసం నూతన సంస్థలను ఏర్పాటు చేసుకుంది. కేవలం పేర్ల సారూప్యతే కాకుండా (రెండవ ఇంటర్నేషనల్ 1889 నుంచి 1916 వరకు, మూడో ఇంటర్నేషనల్ 1919 నుంచి 1943 వరకు) తరువాత ఏర్పడిన రెండు ఇంటర్నేషనల్ సంస్థలు ఫస్ట్ ఇంటర్నేషనల్ ఏర్పాటు చేసిన విలువలు, సిద్ధాంతాలను నిరంతరం ఉదహరిస్తూ వచ్చాయి. ఆ విధంగా మొదటి ఇంటర్నేషనల్ అందించిన విప్లవ సందేశం అది అస్తిత్వంలో ఉన్న కాలంలో కంటే ఆ తరువాత కాలంలో ఇంకా ఎక్కువ ఫలితాలు సాధించగలిగింది.

కార్మికుల విమోచనకు కేవలం ఒక దేశంలో పరిణామాలు సరిపోవని, ప్రపంచ వ్యాప్తంగా మార్పులు జరగాలని కార్మికులు గ్రహించడానికి మొదటి ఇంటర్నేషనల్ సహకరించింది. ఈ లక్ష్య సాధనకు కార్మికులు తమంత తామే, తమ శక్తి సామర్థ్యాలపై ఆధారపడవలసి ఉంటుందని, తమ శక్తిని వేరే శక్తులకు బదలాయించడం ద్వారా సాధ్యం కాదని కార్మికులు అర్థం చేసుకోవడానికి ఇంటర్నేషనల్ దోహదం చేసింది. మార్క్స్ చేసిన ఈ సైద్ధాంతిక కృషిని గుర్తుంచుకోవాలి. పెట్టుబడిదారీ ఉత్పత్తి విధానాన్ని, వేతన శ్రమను అధిగమించడం ద్వారా మాత్రమే కార్మిక విమోచన సాధ్యమవుతుందని ఆయన స్పష్టం చేశాడు. ప్రస్తుత వ్యవస్థలో కొద్దిపాటి పరిణామాలు మాత్రమే

సాధ్యమవుతాయని, వాటికోసం ప్రయత్నం చేయడం అవసరమని, అయితే అవి మాత్రమే యజమానుల పెత్తనాన్ని తొలగించలేవని ఆయన వివరించాడు.

ఆ రోజులలో నెలకొన్న ఆశలకు, అపనమ్మకమే ప్రధానమైనదిగా తయారైన ఈ రోజులకు మధ్య చాలా తేడా ఉంది. ఇంటర్నేషనల్ రోజులలో నెలకొన్న సంఘీభావం, వ్యవస్థను వ్యతిరేకించిన తీరుకు, ఈనాడు నయా ఉదారవాదం, ప్రైవేటీకరణ తీర్చిదిద్దుతున్న భావజాలపరమైన దిగజారుడుతనం, వ్యష్టివాదాలకు మధ్య చాలా వ్యత్యాసం ఉంది. 1864లో లండన్‌లో జరిగిన కార్మికుల సమావేశంలో వ్యక్తమైన ఆవేశానికి ఈనాడున్న ఉదాసీనత, ఉపేక్షలకు మధ్య ఏ మాత్రం పొంతన లేదు.

ప్రస్తుతం శ్రామిక ప్రపంచం 19వ శతాబ్దం నాటి దోపిడి పరిస్థితులకు తిరిగి నెట్టబడుతున్నందువల్ల, ఇంటర్నేషనల్ చేపట్టిన ప్రాజక్టు అసాధారణమైన సమకాలీనతను సంతరించుకున్నది. ప్రస్తుత 'ప్రపంచ వ్యవస్థ'లోని అనాగరికత, ప్రస్తుత ఉత్పత్తి విధానం కారణంగా ధ్వంసమవుతున్న పర్యావరణం, సంపన్నులైన కొద్దిమంది దోపిడీదారులకు, పేదరికంలో మగ్గుతున్న విస్తృత ప్రజానీకానికి మధ్య అంతరం తీవ్రస్థాయిలో పెరిగిపోవడం, మహిళల అణచివేత, యుద్ధ మేఘాలు ఆవరించడం, జాత్యహంకారం, దురహంకారం వీటన్నిటినీ పరిగణనలోకి తీసుకున్నపుడు సమకాలీన కార్మికోద్యమం మొదటి ఇంటర్నేషనల్‌కి వున్న రెండు ప్రధాన లక్షణాల ఆధారంగా తనని తాను పునర్నిర్మించుకోవలసి వుంటుంది. నిర్మాణంలో బహుళత్వం, లక్ష్యాలలో విప్లవాత్మకత అనేవే ఈ అంశాలు. 150 సంవత్సరాల క్రితం లండన్‌లో స్థాపించిన ఇంటర్నేషనల్ లక్ష్యాలు ఈ రోజు మరింత అవసరంగా మారాయి. ఏది ఏమైనప్పటికీ ప్రస్తుత సవాళ్లు ఎదుర్కోవాలంటే కొత్త ఇంటర్నేషనల్‌కి ఆ రెండు అంశాలను విస్మరించడం సాధ్యం కాదు : పెట్టుబడిదారీ వ్యతిరేకత, బహుళత్వం ఇవే విస్మరించలేని ఆ అంశాలు.

# అనుబంధం

## మొదటి ఇంటర్నేషనల్ సభ్యత్వం : కాలానుక్రమణిక

ఈ అనుబంధం మొదటిభాగంలో ఇంటర్నేషనల్ మహాసభలు, సమావేశాల తేదీలవారీ వివరాలున్నాయి. ముందుగా 1864లో స్థాపించిన తరువాత 1872 వరకు ఇంటర్నేషనల్ ఐక్యంగా ఉన్నప్పటి వివరాలు, తరువాత 1873తో ప్రారంభించి ముందు స్వయం ప్రతిపత్తివాదుల ఇంటర్నేషనల్ వివరాలు, ఆ తరువాత కేంద్రం బలంగా ఉండాలనే వారి ఇంటర్నేషనల్ వివరాలు పొందుపరిచాం.

రెండో భాగంలో  వివిధ దేశాలలో ఇంటర్నేషనల్ సభ్యత్వ వివరాలున్నాయి. సభ్యత్వ వివరాలను కచ్చితంగా చెప్పడం సాధ్యంకాదు. దానికి అనేక కారణాలున్నాయి:

(1) ఆరోజుల్లో కొన్ని కార్మికోద్యమ సంస్థలకు మాత్రమే ముఖ్యంగా బ్రిటిష్ ట్రేడ్ యూనియన్లు, జర్మన్ సోషలిస్టు పార్టీలకు మాత్రమే కచ్చితమైన లెక్కలుండేవి.

(2) ఇంటర్నేషనల్‌లో కార్మికులు వ్యక్తులుగా కాకుండా ట్రేడ్ యూనియన్‌లు, ఇతర సమిష్టి సంఘాల అనుబంధం ద్వారా చేరేవారు.

(3) అనేక దేశాలలో ఇంటర్నేషనల్‌పై కొంతకాలం పాటు నిషేధాలు సాగినందువల్ల ఆ దేశాల సభ్యత్వాన్ని అంచనా వేయడం చాలా ఇష్టం.

అందువల్ల ఈ అంశంపై 1968లో వచ్చిన ఫ్రెంచి గ్రంథం తప్పిస్తే మిగతా రచనలేవీ సభ్యత్వాన్ని  అంచనా కట్టే ప్రయత్నం చెయ్యలేదు. అయితే ఊహాజనిత అంచనాలు, స్పష్టత లేని అంశాలునప్పటికీ ప్రస్తుతం ఒక అంచనాకు వచ్చే ప్రయత్నం చేశాం. కాని గతంలో ఈ అంశంపై ప్రచురణలన్నీ అతిగా లెక్కలు ఇచ్చాయి. అందువల్ల వాస్తవం అందుబాటులోకి రాకుండా పోతున్నది.

పట్టికలో మొదటి కాలమ్‌లో తేదీలవారీగా ఇంటర్నేషనల్‌లో చేరిన దేశాల జాబితా ఉంది. ఆస్ట్రేలియా, న్యూజిలాండ్, ఇండియాలలో చిన్న చిన్న కార్మిక బృందాలు మాత్రమే ఇంటర్నేషనల్‌తో అరకొర సంబంధాలు పెట్టుకున్నాయి. అందువల్ల వాటిని జాబితాలో చేర్చలేదు. రష్యా ప్రవాసులు కొంతమంది స్విట్జర్లాండ్‌లో గ్రూపు ఏర్పాటు చేసుకున్నప్పటికీ ఇంటర్నేషనల్‌కు రష్యాతో ఎన్నడూ సంబంధాలు లేవు. అందువల్ల ఈ పేరు కూడా జాబితాలో లేదు. రెండో కాలమ్‌లోఆయా దేశాలలో ఇంటర్నేషనల్ ఉచ్ఛదశకు చేరుకున్న సంవత్సరాలు ఇచ్చాం. మూడో కాలమ్‌లో సభ్యత్వ సంఖ్యను చేర్చాము. ఫ్రాన్స్‌లోని పరిశోధనా సంస్థలు ప్రచురించిన పుస్తకాలలో ప్రస్తావించిన లెక్కల ప్రకారం సభ్యత్వం లెక్కలు కట్టాం.

# కాలానుక్రమణిక

## సమావేశాలు, మహాసభలు (1864–1872)

| | | |
|---|---|---|
| లండన్ సమావేశం | : | 25–29 సెప్టెంబర్, 1865 |
| మొదటి మహాసభ | : | జెనీవా, 3–8 సెప్టెంబర్, 1866 |
| రెండవ మహాసభ | : | లోజాన్, 2–8 సెప్టెంబర్, 1867 |
| మూడవ మహాసభ | : | బ్రస్సెల్స్, 6–13 సెప్టెంబర్,1868 |
| నాల్గవ మహాసభ | : | బాజల్, 6–12 సెప్టెంబర్, 1869 |
| ప్రతినిధుల సమావేశం | : | లండన్, 17–23 సెప్టెంబర్, 1871 |
| ఐదవ మహాసభ | : | హేగ్, 2–7 సెప్టెంబర్, 1872 |

## "స్వయంప్రతిపత్తివాద" ఇంటర్నేషనల్

| | | |
|---|---|---|
| ఆరవ మహాసభ | : | జెనీవా, 1–6 సెప్టెంబర్, 1873 |
| ఏడవ మహాసభ | : | బ్రస్సెల్స్, 7–13 సెప్టెంబర్, 1874 |
| ఎనిమిదవ మహాసభ | : | బెర్న్, 26–30 అక్టోబర్, 1876 |
| తొమ్మిదవ మహాసభ | : | వర్వియిస్, 6–8 సెప్టెంబర్, 1877 |

## "కేంద్రీకృతవాద" ఇంటర్నేషనల్

| | | |
|---|---|---|
| ఆరవ మహాసభ | : | జెనీవా, 7–13 సెప్టెంబర్, 1873 |
| ప్రతినిధుల సమావేశం | : | ఫిలడెల్ఫియా, 15 జులై, 1876 |

**పట్టిక 1.1. సభ్యత్వ పట్టిక**

| దేశం | సభ్యత్వం అత్యధికానికి చేరిన సంవత్సరం | సభ్యుల సంఖ్య |
|---|---|---|
| బ్రిటన్ | 1867 | 50,000 |
| స్విట్జర్లాండ్ | 1870 | 6,000 |
| ఫ్రాన్స్ | 1871 | 30,000 కంటే ఎక్కువ |
| బెల్జియం | 1871 | 30,000 కంటే ఎక్కువ |
| యు.ఎస్.ఏ (అమెరికా) | 1872 | 4,000 |
| జర్మనీ | 1870 | 11,000 (సోషల్ డెమోక్రటిక్ వర్కర్స్ పార్టీ సభ్యులతో కలుపుకుని) |
| స్పెయిన్ | 1873 | దాదాపు 30,000 |
| ఇటలీ | 1873 | దాదాపు 25,000 |
| నెదర్లాండ్స్ | 1872 | 1,000 లోపు |
| డెన్మార్క్ | 1872 | దాదాపు 2,000 |
| పోర్చుగల్ | 1872 | 1,000లోపు |
| ఐర్లండ్ | 1872 | 1,000లోపు |
| ఆస్ట్రియా–హంగరీ | 1872 | దాదాపు 2,000 |

మూలం : అంతర్జాతీయ కార్మిక సంస్థ : ఉపన్యాసాలు, తీర్మానాలు, చర్చలు, పత్రాలు.

## ఉల్లేఖనలు – వివరణలు :

1. డేవిడ్ రయజనోవ్, మొదటి అంతర్జాతీయ కార్మిక సంస్థ చరిత్ర (ఇకపై ఇంటర్నేషనల్‌గా ప్రస్తావిద్దాం) గురించి జర్మన్ భాషలో చేసిన రచన, పే. 171.
2. పై గ్రంథం, పే. 172
3. ఇంటర్నేషనల్ చివరి దశలో సంస్థాగత నిర్మాణానికి సంబంధించిన శాసన సవరణ ఆమోదం కోసం ప్రవేశపెట్టబడినపుడు, జనరల్ కౌన్సిల్ సభ్యులు సంస్థ పేరులో 'మెన్'కి బదులు 'పర్సన్స్' అని ఎందుకు వాడకూడదని ప్రశ్నించారు. స్త్రీ పురుషులిరువురికీ సంస్థలో సభ్యులుగా చేరే అవకాశం ఉందని వివరణ ఇస్తూ ఏంగెల్స్ 'మెన్' అనే పదాన్ని స్త్రీ పురుషులిరువురికీ అన్వయించే సాధారణ పదంగా అర్థం చేసుకోవాలని పేర్కొన్నాడు.
4. జి.యం. స్టెక్లాఫ్ రచించిన **హిస్టరీ ఆఫ్ ది ఫస్ట్ ఇంటర్నేషనల్** (మొదటి అంతర్జాతీయ కార్మిక సంస్థ చరిత్ర) అనే పుస్తకంలో ఉటంకించబడింది. ప్రచురణకర్త : రస్సెల్ అండ్ రస్సెల్, న్యూయార్క్, 1968 (1928), పే.11
5. అంతర్జాతీయ కార్మిక సంస్థ తొలి సభ్యులలో రిపబ్లికనిజం లేదా సోషలిజంలకి అనుకూలంగా వుండే లాడ్జ్ ఆఫ్ ఫిలడెల్ఫియా లాంటి రహస్య సంఘాల సభ్యులు కూడా ఉండేవారు. మిలూరే డ్రాచ్‌కవిచ్ సంపాదకత్వం వహించిన **'ది రివల్యూషనరీ ఇంటర్నేషనల్స్, 1864-1943**లో బోరిస్ నికొలవ్‌స్కీ రచించిన **సీక్రెట్ సొసైటీస్ అండ్ ది ఫస్ట్ ఇంటర్నేషనల్** అనే వ్యాసం చూడండి. ప్రచురణ : స్టాన్‌ఫర్డ్ యూనివర్సిటీ ప్రెస్, 1966, పేజీలు 36-56; అలానే పి.డబ్ల్యు. ఆర్చర్ రచించిన **ది ఫస్ట్ ఇంటర్నేషనల్ ఇన్ ఫ్రాన్స్** (ఫ్రాన్స్‌లో మొదటి ఇంటర్నేషనల్), యూనివర్సిటీ ప్రెస్ ఆఫ్ అమెరికా, లాన్‌హామ్, యండి, 1997, పేజీలు 33-5.
6. హెన్రీ కాలిన్స్, చిమెన్ అబ్రామ్‌స్కీ రచించిన **కార్ల్‌మార్క్స్ అండ్ ది బ్రిటిష్ లేబర్ మూవ్‌మెంట్** (కార్ల్ మార్క్స్ – బ్రిటిష్ కార్మికోద్యమం), మాక్‌మిలన్, లండన్, 1965, పే. 34
7. జొహాన్ జియార్జి ఇకారియస్ 12 అక్టోబర్ 1864న కార్ల్ మార్క్స్‌కి రాసిన లేఖ. మార్క్స్ – ఏంగెల్స్ సమగ్ర రచనలు, సంపుటం. 3/13, అకాడెమీ, బెర్లిన్, 2002, పే. 11.
8. కార్ల్ మార్క్స్ 4 నవంబర్ 1864న ఫ్రెడరిక్ ఏంగెల్స్‌కి రాసిన లేఖ. మార్క్స్

అండ్ ఏంగిల్స్ కలెక్టెడ్ వర్క్స్ (మార్క్స్, ఏంగిల్స్ సమగ్ర రచనలు - ఇకపై యం.ఇ.సి.డబ్ల్యు.గా పేర్కొందాం), ప్రోగ్రెస్ పబ్లిషర్స్, మాస్కో, సంపుటి - 42, 1987, పే. 16.

9. ఇంటర్నేషనల్‌ని స్థాపించడానికి జరిగిన సమావేశంలో సంస్థ నిర్మాణం కోసం ఒక స్టాండింగ్ కమిటీ నియమించబడింది. ఇదే సంస్థకి తొలుత సెంట్రల్ కౌన్సిల్‌గా తదుపరి జనరల్ కౌన్సిల్‌గా పనిచేసింది. తదుపరి ఈ మూడు సంఘాలకు కూడా జనరల్ కౌన్సిల్ అనే పేరు ఉపయోగించసాగారు.

10. జియాన్ మారియో బ్రావో ఫ్రెంచి భాషలో మొదటి ఇంటర్నేషనల్‌పై రచించిన పుస్తకం, బారి : లాటెర్జా, 1979, పేజీలు 18-19.

11. కార్ల్ మార్క్స్ 23 నవంబర్ 1871న ఫ్రెడరిక్ బోల్ట్‌కి రాసిన లేఖ, యం.ఇ.సి.డబ్ల్యు, సంపుటి. 44, పే. 252. ఈ లేఖలో మార్క్స్ ఇలా పేర్కొన్నాడు : 'ఇంటర్నేషనల్ చరిత్ర అంతా నిజమైన శ్రామికవర్గ ఉద్యమానికి వ్యతిరేకంగా ఇంటర్నేషనల్‌లో పట్టు సంపాదించడానికి ప్రయత్నిస్తున్న ముఠాలు, ఔత్సాహిక ప్రయోగాలకి వ్యతిరేకంగా నిరంతర పోరాటంగా వుండింది. ఈ పోరాటం మహాసభలలో జరిగినదానికంటే ఎక్కువగా జనరల్ కౌన్సిల్ వేర్వేరు శాఖలతో విడిగా నెరపే సంబంధాలలో జరిగేది.'

12. బ్రావో రాసిన పైన చూపిన గ్రంథం, పే. 165

13. మార్క్స్‌పై మాక్సిమిలియన్ రూబెల్ ఫ్రెంచి భాషలో చేసిన రచన, పెయాత్, పారిస్, 1974, పే. 41. రూబెల్ ఇలా రాశాడు. "వాళ్లు ఈ (రాజకీయ కార్యక్రమాన్ని) 'మార్క్సిజం' చే రూపొందించబడిందిగా పరిగణిస్తారు. అంటే వారి దృష్టిలో అది సామాజిక సర్వరోగ నివారిణి కోసం వెతుకులాడుతున్న అవ్యవస్థితంగా, జడంగా ఉండే జనసందోహంపై ఒక పరిపూర్ణమైన మేధస్సు బయటనుండి విధించిన పూర్తిస్థాయి సిద్ధాంతం. ఈ అవగాహనకి ప్రేరణ విషయాన్ని మార్మీకరించే ఉద్దేశ్యం కాకపోవచ్చు. కాని పుక్కిటి పురాణాలను ప్రచారం చేసే ధోరణి మాత్రం ఇందులో వుంది."

14. ఆస్కార్ టెస్టుట్ ఫ్రెంచి భాషలో ఇంటర్నేషనల్‌పై రాసిన పుస్తకం, ఐమి, వింగ్‌ట్రైనియర్, లియోన్, 1870, పే. 310.

15. **ది టైమ్స్** (పత్రిక), 5 జూన్ 1871; ఆస్కార్ టెస్టుట్ ఇంటర్నేషనల్‌పై ఫ్రెంచి భాషలో రాసిన మరో పుస్తకం, లషు, పారిస్, 1871.

16. ఈ విషయంపై 20 డిసెంబరు 1870న జరిగిన జనరల్ కౌన్సిల్ సమావేశంలో మార్క్స్ ఇలా పేర్కొన్నాడు : "బయట ప్రజానీకం ఇంటర్నేషనల్‌లో క్రియాశీల సభ్యుల సంఖ్యను వాస్తవంగా వున్నదానికంటే చాలా ఎక్కువగా ఊహించు కుంటున్నారు. అందువల్ల నిజమైన సభ్యుల సంఖ్యని ప్రచురించడం అభిలషణీయం కాదు." జనరల్ కౌన్సిల్ - 4 పే. 96.

17. మరింత సమాచారం కోసం అనుబంధంలో ఇవ్వబడిన అంతర్జాతీయ సభ్యత్వ పట్టిక చూడండి.

18. జూలియస్ బ్రౌంతాల్ రాసిన **హిస్టరీ ఆఫ్ ది ఇంటర్నేషనల్** (ఇంటర్నేషనల్ చరిత్ర) చూడండి, నెల్సన్, న్యూయార్క్, 1966 (1961), పే. 116.

19. కాలిన్స్, అబ్రామ్‌స్కీలు రచించిన పైన చూపిన పుస్తకం, పే.70, జాక్ డూంమ్తే మొదటి ఇంటర్నేషనల్‌పై ఫ్రెంచి భాషలో చేసిన రచన, పారిస్, 1968,పే. 475.

20. కాలిన్స్, అబ్రామ్‌స్కీల పైన చూపబడిన రచన, పే. 289.

21. డాక్యుమెంట్ -2 పే. 87.

22. జనరల్ ఫ్రెడరిక్ వాన్ బెర్న్‌హార్డి 'విశ్వసనీయ వర్గాలపై ఆధారపడి' ఇంటర్నేషనల్ అవసరాల కోసం 50,00,000 పౌండ్ల కంటే అధిక నిధి లండన్‌లో డిపాజిట్ చేయబడిందని తన డైరీలో రాసుకున్నాడు.

23. బ్రౌంతాల్ రచించిన పైన చూపిన పుస్తకం, పే. 108. జనరల్ కౌన్సిల్ పత్రాలలో దాని వార్షికాదాయాన్ని చూపించే సమగ్ర పట్టిక లేదని బ్రౌంతాల్ పేర్కొన్నాడు. అయితే, మొదట ఆరు సంవత్సరాలలో వ్యక్తిగత సభ్యుల చందాల ద్వారా జనరల్ కౌన్సిల్‌కి వచ్చిన ఆదాయ వివరాలు కోశాధికారిగా పనిచేసిన కావెల్ స్టెప్నీ నివేదికలో ఉన్నాయి. ఆదాయ వివరాలు : 1865-23 పౌండ్లు; 1866-9 పౌండ్ల 13 షిల్లింగులు; 1867 - అయిదు పౌండ్ల 17 షిల్లింగులు; 1868 - 14 పౌండ్ల 14 షిల్లింగులు; 1869 - 30 పౌండ్ల 12 షిల్లింగులు; 1870 - 14 పౌండ్ల 14 షిల్లింగులు. హేగ్ మహాసభకి ఏంగెల్స్ సమర్పించిన చివరి ఆర్థిక నివేదిక (1870-72) ప్రకారం జనరల్ కౌన్సిల్ సభ్యులకు, ఇతరులకు 25 పౌండ్లు బకాయిపడి వుంది. కాలిన్స్, అబ్రామ్‌స్కీ రచించిన పైన చూపిన గ్రంథంలో ఇంటర్నేషనల్‌కి సంబంధించిన కొన్ని అప్పుల ఆస్తుల పట్టికలుకూడా ప్రచురించబడ్డాయి. పేజీలు. 80-1.

24. డాక్యుమెంట్ -2 పే. 85. కార్ల్ మార్క్స్ 19 ఏప్రిల్ 1870న పాల్ లాఫార్గ్‌కి

రాసిన లేఖ (యం.ఇ.సి.డబ్ల్యు., సంపుటి -43, పే. 491)లో ఇలా రాశాడు : "జనరల్ కౌన్సిల్ పోప్ వంటిది కాదు. ఇంటర్నేషనల్‌లోని ప్రతి శాఖకు ఉద్యమ వాస్తవ స్థితిని గురించి తనదైన సైద్ధాంతిక అవగాహన కలిగి వుండే అవకాశం కల్పించబడింది. సంస్థ నిబంధనలకు సరాసరి వ్యతిరేకమయినదేదీ తీసుకురాబడదన్న భావన ఎప్పుడూ వుంది".

25. జార్జెస్ హౌప్ట్ ఫ్రెంచి భాషలో చేసిన రచన (శీర్షికకి ఆంగ్లానువాదం : ది సోషలిస్ట్ ఇంటర్నేషనల్ ఫ్రమ్ ది కమ్యూన్ టు లెనిన్), ఇనాది, టురీనో, 1978, పే. 78.

26. ఇంటర్నేషనల్ సరాసరి నడిపిన పత్రికలు, సహానుభూతి దృష్టితో నడిచిన పత్రికల గురించి మరింత తెలుసుకోవాలంటే జిసెప్పీ డెల్ బో సంపాదకత్వంలో ఫ్రెంచి భాషలో 1864-1877 కాలంలో ఇంటర్నేషనల్‌కి చెందిన పత్రికలపై వచ్చిన పుస్తకాన్ని చూడవచ్చు, అర్మాండ్ కాలిన్, పారిస్, 1958.

27. కాలిన్స్, అబ్రామ్‌స్కీ రచించిన పైన చూపిన పుస్తకం, పే. 65

28. డాక్యుమెంట్ -2, పే. 84.

29. ఫెర్డినాండ్ లాసాల్ 'స్థిరవేతనాల సూత్రం' (ఐరన్ లా ఆఫ్ వేజెస్) అనే భావనని ప్రతిపాదించాడు. ఈ భావన ప్రకారం వేతనాలలో పెంపుదల కోసం యత్నించడం వృథా. అంతేకాక అది రాజ్యాధికారాన్ని సాధించడానికి చేపట్టవలసిన ప్రాథమిక కర్తవ్యం నుండి కార్మికుల దృష్టిని మరలిస్తుంది.

30. డాక్యుమెంట్ -2, పే. 84.

31. డాక్యుమెంట్ - 12, పే. 121 చూడండి. మరో విధంగా చెప్పాలంటే, రాజకీయ నిర్మాణం, ట్రేడ్ యూనియన్ నిర్మాణాల మధ్య తారతమ్యాన్ని చూడవలసిన అవసరం వుందనేది మార్క్స్‌కి ఎల్లప్పుడూ వున్న స్పష్టమైన అవగాహన. సెప్టెంబరు 1869లో జర్మన్ ట్రేడ్ యూనియన్ నాయకుడు జొహాన్ హామన్‌కి ఇచ్చిన ఇంటర్వ్యూలో మార్క్స్ ఇలా చెప్పాడు : 'ట్రేడ్ యూనియన్లు వాటి మౌలిక లక్ష్యాన్ని నెరవేర్చాలంటే అవి ఒక రాజకీయ సంస్థకి అనుబంధంగా వుండటం కాని, దానిపై ఆధారపడటం కాని ఎన్నడూ చేయరాదు. అలా జరిగితే అది వాటి మరణ శాసనం అవుతుంది. ట్రేడ్ యూనియన్లు సోషలిజానికి పాఠశాలల లాంటివి. '(జర్మన్ పత్రిక **ఫోక్స్ స్టాట్** (ఆంగ్లంలో పీపుల్స్ స్టేట్), సంఖ్య - 17, 27 నవంబరు 1869 సంచికలో ప్రచురితమైంది.

32. ఫ్రెంచి భాషలో మొదటి ఇంటర్నేషనల్ డాక్యుమెంట్ల ప్రచురణ (ఇకపై మొ.

ఇం.డా. (ఫ్రెంచి) గా పేర్కొందాం), సంపుటి - Iకి జాక్ ఫ్రీమండ్ రాసిన ఉపోద్ఘాతం, పే. XI

33. వేర్వేరు రచయితలు : **రిపోర్ట్ ఆఫ్ ది ఫ్రెంచి జనరల్ కౌన్సిల్** (ఫ్రెంచి జనరల్ కౌన్సిల్ నివేదిక), సెప్టెంబరు 1, 1869, మొ. ఇం. డా. (ఫ్రెంచి), సంపుటి - II పే. 24.

34. హెన్రీ కాలిన్స్ రచించిన **ది ఇంటర్నేషనల్ అండ్ ది బ్రిటిష్ లేబర్ మూవ్‌మెంట్ : ఆరిజిన్ ఆఫ్ ది ఇంటర్నేషనల్ ఇన్ ఇంగ్లండ్** (ఇంటర్నేషనల్ - బ్రిటిష్ కార్మికోద్యమం : ఇంగ్లండ్‌లో ఇంటర్నేషనల్ ఆవిర్భావం), పే. 34.

35. కాలిన్స్, అబ్రామ్‌స్కీల పైన చూపిన రచన, పే. 290-1.

36. నిబంధనల ప్రకారం ప్రతి 500 మంది సభ్యులకి ఒక ప్రతినిధి ఉండాల్సినప్పటికీ, ఆ ప్రాతినిధ్యం వాస్తవరూపం దాల్చడం మాత్రం ప్రతినిధులకు సమావేశానికి హాజరయ్యే స్తోమత ఉండడంపై ఆధారపడివుండేది.

37. వాస్తవమేమిటంటే మార్క్స్ మహాసభలకి హాజరు కాకపోవడాన్ని కొనసాగించాడు. అయితే కీలకమైన హేగ్ మహాసభ (1872)కి మాత్రం హాజరయ్యాడు.

38. డాక్యుమెంట్ -49, పే. 229. డు పాప్ అవగాహన తదుపరి దశలో యుద్ధంపై కార్మికోద్యమపు ప్రామాణిక అవగాహన అయింది.

39. డాక్యుమెంట్ - 6, పేజీలు. 101-2

40. డాక్యుమెంట్ -3, పే. 169.

41. కాసియన్ మరేషల్ **'రిపోర్ట్ ఆఫ్ ది లీజ్ సెక్షన్'** (లీజ్ సెక్షన్ నివేదిక) మొ.ఇం.డా. (ఫ్రెంచి), సంపుటి-I, పే. 268.

42. డాక్యుమెంట్-3, పే. 85.

43. ఫ్రీమండ్ రచించిన ఇంట్రడక్షన్ (ఉపోద్ఘాతం), మొ.ఇం.డా. (ఫ్రెంచి), సంపుటి - I, పే. XIV

44. ఈ మహాసభలో ఈజీన్ డిపాంట్ (1831-81) నేపుల్స్‌కి చెందిన ఒక శాఖకు ప్రాతినిధ్యం వహించాడు. లూయీ అగస్టో బ్లాంక్వీ (1805-81) పరిశీలకుడిగా ఈ మహాసభలో పాల్గొన్నాడు.

45. డాక్యుమెంట్ -3, పేజీలు. 91-2.

46. బెల్జియన్ శాఖలలో చోటు చేసుకున్న మార్పుల వల్ల ఇది సాధ్యపడింది. ఈ

శాఖల జాతీయ మహాసభ జూలైలో జరిగిన పిమ్మట అవి సమిష్టివాదంవైపు మొగ్గు చూపాయి.

47. మొ.ఇం.డా. (ఫ్రెంచి), సంపుటి –I పేజీలు. 401–3.
48. పై గ్రంథం, పే. 403.
49. డాక్యుమెంట్ –50.
50. కార్ల్ మార్క్స్ 16 సెప్టెంబరు 1868న ఫ్రెడరిక్ ఏంగెల్స్‌కి రాసిన లేఖ. యం.ఇ.సి. డబ్ల్యు, సంపుటి – 43, పే. 101.
51. మొ.ఇం.డా. (ఫ్రెంచి), సంపుటి – II పే. 74.
52. మిఖయిల్ బకూనిన్ రచించిన **ప్రోగ్రాం ఆఫ్ ది అలయన్స్ (ఇంటర్నేషనల్ అలయన్స్ ఆఫ్ సోషలిస్టు డెమోక్రసీ).** ఇది ఆర్థర్ లెహ్నింగ్ సంపాదకత్వంలో వెలువడిన **మిఖయిల్ బకూనిన్ : సెలెక్టెడ్ రైటింగ్స్** (మిఖయిల్ బకూనిన్ : ఏరిన రచనలు) అనే పుస్తకంలో ఇవ్వబడింది. ప్రచురణకర్త : జోనాతన్ కేప్, లండన్, 1973, పే. 174. ఈ పుస్తకంలో ఇవ్వబడిన అనువాదం లోపభూయిష్టంగాను, అపోహలు కలిగించేదిగాను ఉంది. **ఫిక్టీషస్ స్ప్లిట్స్ ఇన్ ది ఇంటర్నేషనల్** (ఇంటర్నేషనల్‌లో కృత్రిమ చీలికలు) అనే తమ రచనలో మార్క్స్, ఏంగెల్స్‌లు బకూనిన్ మూల రచన నుండి ఉటంకించారు. డాక్యుమెంటు –75, పే. 287.
53. ఇ.హెచ్. కార్ రాసిన **మిఖయిల్ బకూనిన్** అనే రచన, వింటేజ్, న్యూయార్క్, 1961 (1937), పే. 392.
54. కార్ పైన చూపిన తన పుస్తకంలో ఇలా రాశాడు : 'కొయ్యగుర్రం ట్రోజన్ కోటలోకి ప్రవేశించింది', పే. 374.
55. డాక్యుమెంటు –31, పే. 163
56. బ్రౌంతాల్ రచించిన పైన చూపిన గ్రంథం, పే. 163
57. మొ.ఇం.డా. (ఫ్రెంచి), సంపుటి –Iకి ఫ్రీమండ్ రాసిన ఉపోద్ఘాతం, పే. XIX.
58. జాక్ రూజరై ఇంటర్నేషనల్‌లోని ఫ్రెంచి శాఖల గురించి ఫ్రెంచి భాషలో రాసిన పుస్తకంలో వేలాదిమంది గురించి మాట్లాడాడు.
59. జనరల్ కౌన్సిల్ – III, పే. 218. ఒక రాజకీయ ధోరణికి ప్రాతినిధ్యం వహించే బృందాలను ఇంటర్నేషనల్‌లో చేర్చుకునే అవకాశం లేనందువల్ల ఈ అభ్యర్థన

తిరస్కరించబడింది. 1871లో లండన్‌లో జరిగిన సమావేశంలో ఈ విధానానికి సంబంధించి ప్రవేశపెట్టిన అధికారిక తీర్మానం ప్రతినిధుల ఆమోదం పొందింది. అంతర్జాతీయ కార్మిక సంస్థ (ఇంటర్నేషనల్)లో ప్రస్తుతం సభ్యత్వం కలిగి వున్న సంస్థలు, సాధారణ శాసనాల స్ఫూర్తికనుగుణంగా, ఇకపై ఇంటర్నేషనల్ శాఖలు, విభాగాలుగా మాత్రమే నిర్మితమవ్వాలి, తెలియబడాలి. ఇది వాటి బాధ్యత. అవి ఏర్పడ్డ ప్రాంతం పేరుని కూడా జత చేసుకోవాలి. అవి ఇకపై తాము చెందివున్న ధోరణుల – సహకారవాద, అనుభవవాద, సమిష్టివాద, కమ్యూనిస్టు – తదితరమైన పేర్లతో కొనసాగడం నిషేధించబడింది. ఈ వివరణ మొ.ఇం.డా. (ఫ్రెంచి), సంపుటి – II, పే. 238లో చూడవచ్చు.

60. జాక్ రూజరై **ఇంటర్నేషనల్ రివ్యూ ఆఫ్ సోషల్ హిస్టరీ** XVII (1972)లో 1870–71లో ఫ్రెంచి కార్మికోద్యమం గురించి రాసిన వ్యాసం చూడవచ్చు. తదుపరి కాలంలో ఈ ఇద్దరూ కూడా ఇంటర్నేషనల్‌ని, దాని భావాలను వదిలిపెట్టేశారు. టులేన్ సంస్థ నుండి బహిష్కరించబడ్డాడు. చూడండి. డాక్యుమెంట్ – 25, పాదసూచిక –23.

61. ఎర్నెస్ట్ ఎడ్వర్డ్ ఫ్రీబూ ఇంటర్నేషనల్‌పై ఫ్రెంచి భాషలో రాసిన పుస్తకం, పారిస్, 1871, పే. 26.

62. జాక్ ఫ్రీమండ్ స్విట్జర్లాండ్‌లో మొదటి ఇంటర్నేషనల్ గురించి ఫ్రెంచి భాషలో పుస్తకం రాశాడు, డ్రోజ్, జెనీవా, 1964, పే. 295.

63. ఉడ్‌ఫర్డ్ మెక్‌లెలన్ రచించిన **రివల్యూషనరీ ఎక్జైల్స్** (ప్రవాస విప్లవకారులు) అనే పుస్తకం, ఫ్రాంక్ కాస్, లండన్, 1979, పే. 83–107.

64. ఫ్రెడరిక్ ఏంగెల్స్ 7–8 మే 1872న థియొడార్ క్యూనోకి రాసిన లేఖ, యం.ఇ.సి.డబ్ల్యు, సంపుటి – 44, పే. 371.

65. రోజర్ మోర్గాన్ రచించిన **ది జర్మన్ సోషల్ డెమోక్రాట్స్ అండ్ ది ఫస్ట్ ఇంటర్నేషనల్,** 1864 – 1872, కేంబ్రిడ్జి యూనివర్సిటీ ప్రెస్, న్యూయార్క్, 1965, పే. 180 చూడండి. బెక్కర్ ఒక పత్రికా వ్యాసంలో ఇచ్చిన సమాచారం మోర్గాన్‌కి ఆధారం. 1871 చివరి నాటికి ఇంటర్నేషనల్‌కి చెందిన 58 (జర్మన్ మాట్లాడేవారి) విభాగాలు స్థాపించబడ్డాయని బెక్కర్ పేర్కొన్నాడు. వీటిలో దాదాపు సగం జర్మనీలోను, మిగిలినవి స్విట్జర్లాండ్‌లోను స్థాపించబడ్డాయి. పది సంస్థలు అనుబంధ సభ్యత్వం పొందాయి. 385 మంది వ్యక్తిగత సభ్యులు చందాలు చెల్లిస్తున్నారు.

66. పై గ్రంథం, పే. X

67. డాక్యుమెంట్ – 54, పే. 239.

68. జాన్ స్టూవర్ట్ మిల్, **ది కలెక్టెడ్ వర్క్స్ ఆఫ్ జాన్ స్టూవర్ట్ మిల్** (జాన్ స్టూవర్టు మిల్ సమగ్ర రచనలు), సంపుటి – XXXII, యూనివర్సిటీ ఆఫ్ టొరంటో ప్రెస్, టొరంటో, 1991, పే. 244.

69. లాసాల్ అనుయాయులైన జర్మన్ అసోసియేషన్ ఆఫ్ జర్మన్ వర్కర్స్‌కి చెందిన ప్రతినిధులు అనుకూలంగా ఓటు వేశారు.

70. ఫ్రెంచి భాషలో తీసుకువచ్చిన 'ఫ్రాన్స్ – జర్మనీ యుద్ధం మరియు ఫ్రాన్సులో సామాజిక విప్లవం' పై మిఖయిల్ బకూనిన్ రచనల సంకలనానికి ఆర్థర్ లెహ్నింగ్ రాసిన ఉపోద్ఘాతం, బ్రిల్, లీడెన్, 1977, పే. XVI.

71. డాక్యుమెంట్ –57, పే. 241.

72. జార్జెస్ హౌప్ట్ రచించిన **యాస్పెక్ట్ ఆఫ్ ఇంటర్నేషనల్ సోషలిజం** 1871 – 1914, కేంబ్రిడ్జి యూనివర్సిటీ ప్రెస్, కేంబ్రిడ్జి, 1986, పే. 25. భావజాలం ప్రతిష్ఠించిన ఉదాత్తీకరించబడిన రూపానికి అనుగుణంగా వుండేట్లు పారిస్ కమ్యూన్ గురించిన వాస్తవాన్ని మార్చరాదని ఈ రచనలో హౌప్ట్ హెచ్చరించాడు.

73. మొత్తం స్థానాల సంఖ్య 92. కొందరు అభ్యర్థులు ఒకటి కంటే ఎక్కువ స్థానాల్లో గెలవడం వల్ల కౌన్సిల్ సభ్యుల సంఖ్య 85కి పడిపోయింది.

74. చూడండి : 1871లో పారిస్ గురించి జాక్ రూజరై ఫ్రెంచి భాషలో రాసిన పుస్తకం, సొయి, పారిస్, 1971, పే. 146; పియర్ మీల్జా 1871 చారిత్రక ఘటనలపై ఫ్రెంచి భాషలో రాసిన పుస్తకం, పెర్రిన్, పారిస్, 2009, పే. 78.

75. కార్ల్ మార్క్స్ 22 ఫిబ్రవరి 1881న డోమిలా నీవెన్ హ్యూయిస్‌కి రాసిన లేఖ, యం.ఇ.సి.డబ్ల్యు., సంపుటి – 46, పే. 66.

76. కార్ల్ మార్క్స్, **ఇంటర్నేషనల్ అయిదో వార్షిక సమావేశానికి సమర్పించిన జనరల్ కౌన్సిల్ నివేదిక,** జనరల్ కౌన్సిల్ -V,పే. 461

77. కార్ల్ మార్క్స్ 18 జూన్ 1871న లుడ్విగ్ కుగల్‌మన్‌కి రాసిన లేఖ, యం.ఇ.సి.డబ్ల్యు., సంపుటి – 44, పే. 157.

78. జనరల్ కౌన్సిల్ V, పే. 460.

79. బ్రౌంతాల్ రచించిన పైన చూపిన గ్రంథం, పే. 160–1.

80. జియాన్ మారియో బ్రావో ఫ్రెంచి భాషలో మొదటి ఇంటర్నేషనల్‌పై తీసుకువచ్చిన సంకలనం సంపుటి – IIలో  ఇంటర్నేషనల్‌పై జిసెప్పీ మాజిని రాసిన వ్యాసం, ఎడిటోరి రియూనిటీ, రోమ్, 1978, పే. 499–501.

81. కాలిన్స్, అబ్రామ్‌స్కీ రచించిన పైన చూపిన గ్రంథం, పే. 222.

82. హౌప్ట్ ఫ్రెంచి భాషలో చేసిన రచన (శీర్షికకు ఆంగ్లానువాదం: ది సోషలిస్ట్ ఇంటర్నేషనల్ ఫ్రమ్ ది కమ్యూన్ టు లెనిన్), ఐనాది, టురీనో, 1978, పే. 28.

83. పైన చూపిన గ్రంథం, పే. 93–5.

84. డెల్ బో సంపాదకత్వంలో వెలువడిన పైన చూపిన గ్రంథానికి జార్జి బర్గిన్, జార్జ్ దువై, డొమినికో డి మార్కో రాసిన ముందుమాట, పే. XV.

85. నెల్లో రాసెల్లి రచించిన **మాజిని – బకూనిన్** అనే పుస్తకం చూడండి – ప్రచురణ. ఇనాది, టురినో, 1927, పే. 323 –4.

86. జిసెప్పీ గారిబాల్డి 14 నవంబరు, 1871న జార్జియో పాలవిచినోకి రాసిన లేఖ. ఇది ఎన్రికో ఎమిలియో క్సీమెనె తీసుకువచ్చిన గారిబాల్టి లేఖల సంకలనంలో ఇవ్వబడింది, మిలానో, బ్రిగోలా, 188, పేజీ 350.

87. వాస్తవానికి సమావేశంలో పాల్గొన్న ప్రతినిధుల సంఖ్య 19 మాత్రమే. కొహీన్ హాజరు కాలేకపోయాడు. ఈజీన్ డిపాంట్ (1831–81), మాక్ డొనెల్ మొదటి రెండు సెషన్లలో మాత్రమే పాల్గొన్నారు.

88. కార్ల్ మార్క్స్, 15 ఆగస్టు 1871, జనరల్ కౌన్సిల్ – IV, పే. 259

89. కార్ల్ మార్క్స్, 17 సెప్టెంబరు 1871, మొ.ఇం.డా. ((ఫ్రెంచి), సంపుటి – II), పే. 152.

90. మిక్లోస్ మొల్నార్ ఇంటర్నేషనల్‌పై ఫ్రెంచి భాషలో రాసిన పుస్తకం (శీర్షిక ఆంగ్లానువాదం : ది డిక్లైన్ ఆఫ్ ది ఫస్ట్ ఇంటర్నేషనల్), డ్రోజ్, జెనీవా, 1963, పే–127.

91. డాక్యుమెంట్ –74, పే. 285.

92. 1870ల తొలిదశలో ఒక్క జర్మనీలో మాత్రమే కార్మికోద్యమం ఒక రాజకీయ పార్టీగా నిర్మాణమై ఉంది. అందువల్ల మార్క్స్, బకూనిన్‌ల అనుయాయులు 'పార్టీ' అనే పదాన్ని వాడడంలో చాలా గందరగోళం ఉంది. మార్క్స్ ఈ పదాన్ని వాడిన తీరులో కూడా అస్పష్టత ఉంది. రూబెల్ (పైనచూపిన గ్రంథం, పే. 183) ప్రకారమయితే మార్క్స్‌కి 'పార్టీ అనే భావన (...) వర్గం అనే భావనకి సమానమైనదిగా ఉంటుంది.' చివరిగా ఒక విషయాన్ని నొక్కి చెప్పటం అవసరం.

ఇంటర్నేషనల్‌లో 1871, 1872ల మధ్య చోటు చేసుకున్న ఘర్షణ రాజకీయ పార్టీ నిర్మాణంపై కేంద్రీకరించబడింది కాదు. (పార్టీ అనే పదం లండన్ సమావేశం లో రెండుసార్లు, హేగ్ మహాసభలో అయిదుసార్లు మాత్రమే ఉపయోగించబడింది.) నిజానికి ఎక్కువగా శ్రద్ధ చూపబడింది '"రాజకీయం" అనే విశేషణాన్ని ఉపయోగించడంపైన.' (హౌప్ట్ రచించిన పైన చూపిన గ్రంథం, పే. 84)

93. మొ.ఇం.డా. (ఫ్రెంచి), సంపుటి–II, పే.237. అలాగే కార్ల్ మార్క్స్ రూపొందించిన **డిక్లరేషన్ ఆఫ్ ది జనరల్ కౌన్సిల్ ఆన్ నిచాయెవ్స్ మిస్‌యూజ్ ఆఫ్ ది నేమ్ ఆఫ్ ది ఇంటర్నేషనల్ వర్కింగ్ మెన్స్ అసోసియేషన్**, యం.ఇ.సి.డబ్ల్యు, సంపుటి –23, పే. 23.

94. మిలూరే డ్రాచ్‌కవిచ్ సంపాదకత్వంలో వెలువడిన **ది రివల్యూషనరీ ఇంటర్నేషనల్స్ 1864–1943**లో జాక్ ఫ్రీమండ్, మిక్లోస్ మొల్నార్ రచించిన **ది రైజ్ అండ్ ఫాల్ ఆఫ్ ఫస్ట్ ఇంటర్నేషనల్** (మొదటి ఇంటర్నేషనల్ ఉత్థానపతనాలు) అనే వ్యాసం. స్టాన్‌ఫర్డ్ యూనివర్సిటీ ప్రెస్, స్టాన్‌ఫర్డ్, 1966, పే. 27.

95. కాలిన్స్, అబ్రామ్‌స్కీ, రచించిన పైన ప్రస్తావించిన పుస్తకం, పే. 231. మిక్లోస్ మొల్నార్ ప్రకటించిన భిన్నమైన అభిప్రాయాన్ని పైన చూపిన పుస్తకం పేజి. 135లో చూడండి.

96. విభిన్న రచయితలు ఫ్రెంచి భాషలో రూపొందించిన 'సర్క్యులర్ ఆఫ్ ది కాంగ్రెస్ ఆఫ్ సాన్‌విలియా' మొ.ఇం.డా. (ఫ్రెంచి) సంపుటి – II, పే. 264–5.

97. జియాన్ మారియో బ్రావో ఫ్రెంచి భాషలో మొదటి ఇంటర్నేషనల్‌పై తీసుకువచ్చిన సంకలనంలో వివిధ రచయితలు ఇంటర్నేషనల్‌లోని ఇటాలియన్ శాఖ గురించి రాసిన వ్యాసాలు, ఎడిటోరి రీయూనిటీ, రోమ్, 1978, పే. 787.

98. అయితే, ఈ సెక్షన్లలో ఒక పన్నెండు సెంట్రల్ కమిటీతో సంబంధం పెట్టుకోలేదు. చూడండి : శామ్యూల్ బెర్న్‌స్టీన్ రచించిన ది ఫస్ట్ ఇంటర్నేషనల్ ఇన్ అమెరికా, అగస్టస్ యం. కెల్లీ, న్యూయార్క్, 1965 పే. 65.

99. అమెరికాలో ఇంటర్నేషనల్ విభాగాలు సంఖ్యాపరంగా గుర్తించబడేవి.

100. ఫ్రీమండ్, మొల్నార్ రచించిన పై గ్రంథం పే. 27–8.

101. హౌప్ట్ ఫ్రెంచి భాషలో ఇంటర్నేషనల్‌పై చేసిన పైన చూపిన రచన, పే. 88

102. కార్ల్ మార్క్స్ 29 జులై 1872న లుడ్విగ్ కుగల్‌మన్‌కి రాసిన లేఖ, యం.ఇ.సి. డబ్ల్యు, సంపుటి – 44, పే. 413లో ఇవ్వబడింది. ఈ మహాసభ 'ఇంటర్నేషనల్‌కి

జీవన్మరణ సమస్య; నేను రాజీనామా చేసేలోపు కనీసం సంస్థని విచ్ఛిన్నకర శక్తుల నుండి కాపాడాలని కోరుకుంటున్నాను' అని మార్క్స్ ఈ లేఖలో పేర్కొన్నాడు.

103. జేమ్స్ గ్విల్లామ్ ఫ్రెంచి భాషలో తీసుకువచ్చిన ఇంటర్నేషనల్ పత్రాలు, స్మృతుల సంకలనం (సంపుటి – II), బర్ట్ ఫ్రాంక్లిన్, న్యూయార్క్, పే. 333–4; ఫ్రీమండ్ రాసిన 'ఉపోద్ఘాతం', మొ.ఇం.డా. (ఫ్రెంచి), సంపుటి – I పే. 25.

104. డాక్యుమెంట్ – 65, పే. 265.

105. పైన చూపిన డాక్యుమెంట్, పే. 268.

106. ఫ్రీమండ్ రాసిన 'ఉపోద్ఘాతం', మొ.ఇం.డా. (ఫ్రెంచి)– I, పే. X.

107. డాక్యుమెంట్ – 69, పే. 274–5.

108. కార్ల్ మార్క్స్, 23 జులై, 1872, జనరల్ కౌన్సిల్ – V, పే. 263.

109. కార్ల్ మార్క్స్, 20 సెప్టెంబర్ 1871, మొ.ఇం.డా. (ఫ్రెంచి)– II, పే. 195.

110. కార్ల్ మార్క్స్ రచించిన **ఆన్ ది హేగ్ కాంగ్రెస్,** యం.ఇ.సి.డబ్ల్యు, సంపుటి –23, 1988, పే. 255.

111. హౌప్ట్ ఫ్రెంచి భాషలో ఇంటర్నేషనల్‌పై రాసిన పైన చూపబడిన పుస్తకం, పే. 100.

112. మొ.ఇం.డా. (ఫ్రెంచి)–II, పే. 374. సోన్‌విలియా మహాసభలో ప్రతిపక్షం అప్పటికే జనరల్ కౌన్సిల్ అధికారాన్ని తగ్గించాలని కోరివుంది. (వివరణ –96 చూడండి). కాని మార్క్స్ హేగ్ మహాసభలో ఇలా ప్రకటించాడు : 'జనరల్ కౌన్సిల్ పాత్రని ఉత్తరాల డబ్బా స్థాయికి కుదించడం కంటే దానిని రద్దు చేయడాన్ని మేము కోరుకుంటాము', మొ.ఇం.డా. (ఫ్రెంచి) – II, పే. 354.

113. మొ.ఇం.డా. (ఫ్రెంచి) – II, పే. 376

114. పైన చూపినది పే. 377

115. పైన చూపినది, పే. 378. ఈ ఓటు తర్వాత దర్యాప్తు సంఘం ప్రతిపాదించిన ఇతర బహిష్కరణలను పరిశీలనకు చేపట్టరాదని నిర్ణయం జరిగింది.

116. వివిధ రచయితలు, [(స్టేట్‌మెంట్ ఆఫ్ ది మైనారిటీ (అల్ప సంఖ్యాకుల ప్రకటన)], హేగ్ మహాసభ, పే. 199–200.

117. ఫ్రెడరిక్ ఏంగిల్స్, 5 సెప్టెంబర్ 1872, మొ.ఇం.డా. (ఫ్రెంచి) సంపుటి – II, పే. 355.

118. హాన్స్ గెర్త్ సంకలనం చేసిన 'ది ఫస్ట్ ఇంటర్నేషనల్ : మినిట్స్ ఆఫ్ ది హేగ్

కాంగ్రెస్ ఆఫ్ 1872' లో పొందుపరచబడిన మాల్ట్‌మన్ బారీ రచించిన 'ఇంటర్నేషనల్ హేగ్‌లో సెప్టెంబర్ 2–9, 1872 మధ్య జరిపిన వార్షిక సాధారణ మహాసభలపై నివేదిక', యూనివర్సిటీ ఆఫ్ విస్కన్సిన్ ప్రెస్, 1958, పే. 27 – 80. ఈ నివేదిక హేగ్ మహాసభ పత్రాలలో లేదు.

119. ఫ్రెడరిక్ ఏంగెల్స్, 5 సెప్టెంబర్ 1872, మొ.ఇం.డా. (ఫ్రెంచి), సంపుటి –II, పే. 356.

120. హేగ్‌లో జరిగిన ఇంటర్నేషనల్ మహాసభ గురించి ఫ్రెంచి భాషలో ఎడ్వర్డ్ వెయిలన్ రచన, మొ.ఇం.డా. (ఫ్రెంచి), సంపుటి – III, పే. 140.

121. పై సూచిక, పే. 142

122. పై సూచిక, పే.144

123. ఈ వాదనల గురించి విమర్శనాత్మక విశ్లేషణ కోసం 1872లో ఇంటర్నేషనల్‌లో ఏర్పడిన సంక్షోభంపై మిక్లోస్ మొల్నార్ ఫ్రెంచి భాషలో చేసిన రచన చూడవచ్చు, పే. 439.

124. మొదటి ఇంటర్నేషనల్ క్షీణతపై మిక్లోస్ మోల్నార్ ఫ్రెంచి భాషలో రాసిన పుస్తకం, పే. 144.

125. కార్ల్ మార్క్స్, 22 సెప్టెంబర్ 1872, మొ.ఇం.డా.(ఫ్రెంచి), సంపుటి – II, పే.217.

126. కార్ల్ మార్క్స్ 25 మే 1872న సిజరె డు పాప్‌కి రాసిన లేఖ, యం.ఇ.సి. డబ్ల్యు., సంపుటి –44, పే. 387 : 'వచ్చే మహాసభ కోసం నేను చాలా ఆత్రుతగా ఎదురు చూస్తున్నాను. దానితో నా బానిసత్వం ముగుస్తుంది. నేను మళ్లీ స్వేచ్ఛా జీవినౌతాను; జనరల్ కౌన్సిల్‌కి సంబంధించి కాని లేక బ్రిటిష్ ఫెడరల్ కౌన్సిల్‌కి సంబంధించి కాని ఎటువంటి పరిపాలనా బాధ్యతలు ఇకపై నేనంగీకరించను.'

127. వివరణ –52 చూడండి.

128. మిఖయిల్ బకూనిన్, **ఎ లెటర్ టు ది ఎడిటోరియల్ బోర్డ్ ఆఫ్ ది లిబర్టీ,** ఆర్థర్ లెహ్నింగ్ సంపాదకత్వంలో వచ్చిన **మిఖయిల్ బకూనిన్ : సెలెక్టెడ్ రైటింగ్స్** లో ఇవ్వబడింది, పే. 236–7.

129. డాక్యుమెంట్ – 76, పే. 290.

130. డాక్యుమెంట్ – 78, పే. 294.

131. మిఖయిల్ బకూనిన్ రచించిన **ది ఇంటర్నేషనల్ అండ్ కార్ల్ మార్క్స్,** శామ్ డాల్‌గాఫ్

132. కార్మికవర్గం రాజకీయ పార్టీగా ఏర్పడి రాజ్యాధికారం సాధించాలన్న ప్రతిపాదనను బకూనిన్ తిరస్కరించడం గురించి ఫ్రెంచి భాషలో తీసుకువచ్చిన బకూనిన్ రచనల సంకలనంలో సంపుటి –VI కి ఆర్థర్ లెహ్నింగ్ రాసిన 'ఉపోద్ఘాతం' చూడవచ్చు, పే. cvii.

133. గ్విల్లామ్ రచించిన పైన చూపిన పుస్తకం, పే. 342.

134. ఈ ఆరోపణను తాను పూర్తి చేసిన ఒకే ఒక్క ప్రధాన రచనలో బకూనిన్ పునరుద్ఘాటించాడు. 'మార్క్స్ సిద్ధాంతం ఒక కలయికకు ఆస్కారం కల్పిస్తోంది : ఒక విస్తృతమైన, ఐక్యపర్చబడిన, బలీయమైన, కేంద్రీకృత రాజ్యం. ఇదే లాసాల్ కోరుకున్నది. బిస్మార్క్ ఇప్పటికే చేస్తున్నది. ఈ ముగ్గురూ కలిసి ఎందుకు పనిచేయ కూడదు?' మిఖయిల్ బకూనిన్ రచించిన **స్టేటిజం అండ్ అనార్కీ** (రాజ్యవాదం – అరాచకవాదం), కేంబ్రిడ్జి యూనివర్సిటీ ప్రెస్, కేంబ్రిడ్జి, 1990, పే. 184.

135. ఉదా : పైన చెప్పిన గ్విల్లామ్ రచన చూడండి, పే. 298 –9.

136. డాక్యుమెంట్ –75, పే. 289.

137. బకూనిన్ రచన **ది ఇంటర్నేషనల్ అండ్ కార్ల్ మార్క్స్,** పే. 294.

138. బకూనిన్ భావాలపై మార్క్స్ విమర్శ **కన్‌స్పెక్టస్ ఆఫ్ బకూనిన్స్ స్టేటిజం అండ్ అనార్కీ** అనే తన రచనలో స్పష్టంగా తెలుస్తుంది. ఈ రచన మార్క్స్, ఏంగిల్స్ కలెక్టెడ్ వర్క్స్ సంపుటి –24లో ఉంది. పేజి. 518లో మార్క్స్ ఇలా పేర్కొన్నాడు : 'స్కూలు పిల్లవాడి స్థాయి అవగాహనారాహిత్యం! సమూల సామాజిక విప్లవం ఆర్థికాభివృద్ధి క్రమంలోని నిర్దుష్ట చారిత్రక పరిస్థితులతో ముడిపడి వుంటుంది; అవి అట్టి విప్లవానికి ఆధారప్రాయమైన ప్రాతిపదికలు. అందువల్ల పెట్టుబడిదారీ ఉత్పత్తితో పాటు పారిశ్రామిక కార్మికవర్గం జనాభాలో కనీసం గణనీయమైన సంఖ్యకి చేరుకున్నపుడు మాత్రమే విప్లవానికి అవకాశం ఏర్పడుతుంది. (...) బకూనిన్‌కి (...) సామాజిక విప్లవం పట్ల అవగాహన శూన్యం. దాని రాజకీయ వాగాడంబరం మాత్రం తెలుసు; దానిని నిర్దేశించే ఆర్థిక పరిస్థితులకు అతని ప్రపంచంలో అస్సలు స్థానం లేదు. గతంలోని ఆర్థిక వ్యవస్థలన్నీ అభివృద్ధి చెందినవైనా లేక వెనుకబడి వున్నా, అవి శ్రామికుడి (వేతన శ్రామికుడు, రైతు, తదితర రూపాలలో) బానిసత్వంపై ఆధారపడ్డాయి. కాబట్టి, బకూనిన్ ఈ అన్ని

వ్యవస్థల్లో సమూల విప్లవం సమానంగా సాధ్యమని అనుకుంటాడు. ఇంతకంటే మించిన విషయమేమిటంటే, పెట్టుబడిదారీ ఉత్పత్తి పునాదిగా జరిగే ఐరోపా సామాజిక విప్లవం, రష్యన్, స్లావ్ వ్యావసాయిక, పశుపాలన సమాజాల స్థాయిలో కూడా జరగాలని కోరుకుంటాడు. ఈ దశను దాటి వెళ్ళనవసరం లేదని కూడా అనుకుంటాడు (...) ఆర్థిక పరిస్థితుల స్థానే సంకల్పబలం బకూనిన్ దృష్టిలో సామాజిక విప్లవానికి పునాది.'

139. బకూనిన్ రచన **ది ఇంటర్నేషనల్ అండ్ కార్ల్ మార్క్స్,** పే. 294 –5.

140. మిఖయిల్ బకూనిన్ రచించిన **'ప్రోగ్రాం అండ్ పర్‌పస్ ఆఫ్ ది రివల్యూషనరీ ఆర్గనైజేషన్ ఆఫ్ ఇంటర్నేషనల్ బ్రదర్స్'** (అంతర్జాతీయ సహోదరుల విప్లవ సంస్థ కార్యక్రమం, కర్తవ్యం). ఈ రచన ఆర్థర్ లెహ్నింగ్ సంపాదకత్వం వహించిన **మిఖయిల్ బకూనిన్ – సెలెక్టెడ్ రైటింగ్స్**లో ఇవ్వబడింది. వాస్తవికత పట్ల బకూనిన్ అవగాహన లోపభూయిష్టంగా ఉండేదనడానికి ఆయన చెప్పిందే తార్కాణం: 'అందువల్ల అత్యంత అధిక సంఖ్యలో వ్యక్తులేమీ అవసరం లేదు. మొత్తం ఐరోపాకి చెందిన అంతర్జాతీయ సంస్థకి శక్తివంతంగా, దీక్షానిబద్ధతతో కలిసి పనిచేసే వందమంది విప్లవకారులు సరిపోతారు. అతిపెద్ద దేశానికి చెందిన సంస్థకి కూడా రెండు, మూడు వందల మంది విప్లవకారులు సరిపోతారు', పే. 155.

141. **రికార్డ్ ఆఫ్ మార్క్స్ స్పీచ్ ఆన్ సీక్రెట్ సొసైటీస్** (రహస్య సంఘాలపై మార్క్స్ ఉపన్యాసపు లిఖితరూపం), యం.ఇ.సి.డబ్ల్యు, సంపుటి –22, పే. 621.

142. ఆర్థర్ లెహ్నింగ్, ఎ.జె.సి. రూటర్, పి.షైబర్ట్ సంపాదకత్వం వహించిన బకూనిన్ రచనలు (ఫ్రెంచి), సంపుటి – IIలో బకూనిన్ ఇంటర్నేషనల్‌లోని జూరా ఫెడరేషన్ గురించి చేసిన రచన, బ్రిల్, లీడెన్, 1965, పే. 75.

143. కార్ల్ మార్క్స్ రచించిన 'పొలిటికల్ ఇన్‌డిఫరెంటిజమ్' (రాజకీయాల పట్ల ఉదాసీనత), యం.ఇ.సి.డబ్ల్యు, సంపుటి – 23, పే. 393.

144. మిఖయిల్ బకూనిన్ రచించిన **మార్క్సిజం, ఫ్రీడం అండ్ ది స్టేట్** (మార్క్సిజం, స్వేచ్ఛ, రాజ్యం), ఫ్రీడం ప్రెస్, 1950, పే. 21.

145. జార్జెస్ హౌప్ట్ ఉపయోగించిన 'స్వయంప్రతిపత్తివాద' ఇంటర్నేషనల్ అనే పదాన్ని నేను ఉపయోగించాను. కాని జాక్ ఫ్రీమండ్ 'సమాఖ్యవాద' ఇంటర్నేషనల్ అనే పదాన్ని ఎంచుకున్నాడు.

146. కాలిన్స్, అబ్రామ్‌స్కీలు రాసిన పైన చూపిన గ్రంథం, పే. 275.

147. మొ.ఇం.డా. (ఫ్రెంచి), సంపుటి - IV, వివరణ - 355 : 640 - 2.

148. బెర్న్‌స్టీన్ రచించిన పైన చూపిన గ్రంథం, పే. 221.

149. పై గ్రంథం పే. 283.

150. ఫ్రెంచి భాషలో వచ్చిన బకూనిన్ రచనలు, సంపుటి - IIకి ఆర్థర్ లెహ్నింగ్ రాసిన 'ఉపోద్ఘాతం' చూడవచ్చు. పే. 211. మాక్స్ నెత్లోవ్ బకూనిన్ జీవిత చరిత్రపై రాసిన పుస్తకంలో చేసిన ఒక వ్యాఖ్యను కూడా లెహ్నింగ్ ఉటంకించాడు. 'స్వయంప్రతిపత్తివాద ఇంటర్నేషనల్ ఆవిర్భావం గ్విల్లామ్ కృషి ఫలితం' అని లెహ్నింగ్ అభిప్రాయపడ్డాడు.

151. స్పెయిన్‌లో మొదటి ఇంటర్నేషనల్‌పై ఫ్రెంచి భాషలో మాక్స్ నెత్లోవ్ రాసిన పుస్తకం చూడవచ్చు, డూర్‌డ్రిక్, దిరీడెల్, 1969, పే. 163-4.

152. మొ.ఇం.డా. (ఫ్రెంచి) - III, పే. 163.

153. పై సూచిక, పే. 191.

154. మొ. ఇం.డా. (ఫ్రెంచి) - IV, పే. 5.

155. పై సూచిక, పే. 54-8. హేల్స్ అవగాహన చెప్పుకోతగింది. మొదటినుంచీ స్వయంప్రతిపత్తివాద ఇంటర్నేషనల్‌లో ఉన్న వైరుధ్యాలకి ఇది అద్దం పడుతుంది. హేల్స్ ఇలా అన్నాడు : 'నేను అరాచకవాదాన్ని వ్యతిరేకిస్తాను (...). అరాచకవాదానికి సమిష్టివాదంతో పొసగదు'.

156. 4 సెప్టెంబర్, 1873న జరిగిన సెషన్లలో ప్రతినిధుల మధ్య జరిగిన చర్చను చూడండి. మొ.ఇం.డా. (ఫ్రెంచి) - IV, పే. 59-63, 75-7. డాక్యుమెంట్ - 18లో యూజిన్ హిన్స్ (1839-1933) కూడా చూడండి.

157. మొ.ఇం.డా. (ఫ్రెంచి) IV, పే. 646.

158. సిజారె డు పాప్, 7 సెప్టెంబర్ 1874, మొ.ఇం.డా.(ఫ్రెంచి) - IV, పే. 347.

159. మొ.ఇం.డా. (ఫ్రెంచి) -IV, పే. 350.

160. డాక్యుమెంట్ - 40, పే. 192-3. డాక్యుమెంట్ - 41, పే. 194 -8.

161. మొ.ఇం.డా. (ఫ్రెంచి) - IV, పే. 498.

162. సిజరె డు పాప్, లూయీ బెర్‌ట్రాండ్ కార్మికోద్యమంపై ఫ్రెంచి భాషలో చేసిన రచన, మొ.ఇం.డా.(ఫ్రెంచి) - IV, పే. 591.- 3.

# పేర్ల సూచిక

**1. ఫెర్డినాండ్ లాసాల్ (1825–1864) :** మార్క్స్, ఏంగెల్స్‌ల సమకాలికుడు. మొదటితరం జర్మన్ సోషలిస్టు నాయకులలో ఒకరు. 1848 విప్లవ పోరాటాలలో పాల్గొన్నాడు. మొట్టమొదటి జర్మన్ కార్మికవర్గ పార్టీ 'జనరల్ అసోసియేషన్ ఆఫ్ జర్మన్ వర్కర్స్' స్థాపకులలో ఒకరు. కాని మార్క్స్ ఆలోచనలను అనుసరించే సోషలిస్టులు ఈ పార్టీలో చేరలేదు. "స్థిరవేతనాల సూత్రాన్ని" ప్రతిపాదించాడు. పెట్టుబడిదారీ వ్యవస్థ వేతనాలను ఎప్పుడూ కనీస మనుగడకి అవసరమైన స్థాయికి కుదిస్తుంది కాబట్టి, వేతనాల పెంపు కోసం ట్రేడ్ యూనియన్లు చేసే పోరాటాలు వృధా అని పేర్కొన్నాడు. రాజ్యాధికారాన్ని చేపట్టడంపై కేంద్రీకరించాలని పేర్కొన్నాడు. కార్మికవర్గం తన స్థితిని మెరుగు పర్చుకోవాలంటే వేతనాల పెంపుకై పోరాటాలకి బదులుగా రాజ్యం ఆర్థిక సహాయంతో ఉత్పత్తిదారుల సహకార సంఘాలను స్థాపించాలని ప్రతిపాదించాడు. లాసాల్ జాతీయవాదం పరిధిలో పనిచేశాడు. బూర్జువావర్గానికి వ్యతిరేకంగా జర్మన్ ఛాన్సలర్ బిస్మార్క్‌తో చేతులు కలిపాడు. అంతిమంగా రాజ్యం రద్దు కావాలన్న మార్క్స్ అభిప్రాయానికి విరుద్ధంగా రాజ్యాన్ని వర్గదృష్టితో కాక తటస్థమైనదిగా లాసాల్ చూశాడు. లాసాల్ ఆలోచనలను కలుపుకుంటూ జర్మన్ సోషల్ డెమొక్రటిక్ పార్టీ ఏర్పాటు కోసం 1875లో రూపొందించిన గోతా కార్యక్రమాన్ని మార్క్స్ తీవ్రంగా విమర్శించాడు.

**2. మిఖయిల్ బకూనిన్ (1814–1876) :** రష్యన్ విప్లవకారుడు. నూతన సమాజ నిర్మాణానికి అరాచవాదాన్ని మార్గంగా ప్రతిపాదించాడు. 1848–49లో జరిగిన జర్మన్ విప్లవ పోరాటాలలో పాల్గొన్నాడు. అధునాతన పారిశ్రామిక సమాజాల కంటే రష్యన్ తరహా వ్యవసాయిక సమాజాన్ని విప్లవానికి అనువైనదిగా భావించాడు. రష్యన్ రైతుని విప్లవానికి అత్యంత సన్నద్ధంగా ఉన్న క్రియాశీల శక్తిగా పరిగణించాడు. విప్లవానంతర పరిణామదశలో రాజ్యం తాత్కాలికంగా కొనసాగాలన్న మార్క్స్ భావనతో తీవ్రంగా విభేదించాడు. విప్లవ ప్రధమ కర్తవ్యం రాజ్యాన్ని రద్దుచేయడంగా భావించాడు. రాజ్యం తప్పనిసరిగా నియంతృత్వానికి దారితీస్తుందని వాదించాడు. అధికారం అవినీతికి దారితీస్తుందని, అపరిమిత అధికారం అపరిమిత అవినీతికి దారితీస్తుందని పేర్కొన్నాడు. మార్క్స్, బకూనిన్‌ల ఆలోచనల మధ్య ఉన్న తీవ్రమైన వైరుధ్యం మొదటి ఇంటర్నేషనల్ క్షీణతకు గల కారణాలలో ఒకటి. హేగ్‌లో 1872లో జరిగిన మొదటి ఇంటర్నేషనల్ ఆరవ మహాసభలో బకూనిన్ సంస్థ నుండి బహిష్కరింపబడ్డాడు. రెండవ ప్రపంచయుద్ధం

ముందు వరకు ఇటలీ, స్పెయిన్‌లలో అరాచకవాదం బలమైన ధోరణిగా కొనసాగింది. పెట్టుబడిదారీ వ్యవస్థని వ్యతిరేకించే ఆలోచనా ధోరణిగా అరాచకవాదం పరిమిత స్థాయిలో ఇప్పటికీ ప్రభావాన్ని నెరపుతున్నది.

**3. బిస్మార్క్ (1815-1898) :** ఆటో వాన్ బిస్మార్క్ ప్రష్యా-జర్మనీలలో ఫ్యూడల్ కులీన వర్గమైన యూంకర్స్‌కి చెందినవాడు. 1862-71 మధ్య ప్రష్యా ప్రధానమంత్రిగాను, 1871-1890 మధ్య జర్మన్ ఛాన్సలర్‌గాను పని చేశాడు. బిస్మార్క్ పాలనా కాలంలో జర్మనీ ఐక్యత సాధించబడింది. యుద్ధాన్ని, దౌత్యనీతిని మేళవించడం ద్వారా ఇది సాధ్యపడింది. ప్రజాస్వామ్య విస్తరణకు, విప్లవ భావాలకు, జర్మన్ సోషల్ డెమొక్రసీకి బిస్మార్క్ బద్ధ విరోధి. ముఖ్యంగా సోషల్ డెమొక్రాట్లను అణచివేయడానికి శతవిధాల ప్రయత్నించాడు. 1878లో జర్మన్ సోషల్ డెమోక్రటిక్ పార్టీని నిషేధించాడు. ఈ నిషేధం 1890 వరకు కొనసాగింది. ఈ క్రమంలో బిస్మార్క్ రాజ్య నియంతృత్వాన్ని నెలకొల్పాడు. జర్మన్ రాజ్యం సంతరించుకొన్న ఈ స్వభావం రెండవ ప్రపంచయుద్ధ కాలం వరకు కొనసాగింది. 1890 ఎన్నికలలో సోషల్ డెమొక్రాట్లతో సహా బిస్మార్క్ వ్యతిరేక శక్తులు పార్లమెంటులో సగం కంటే ఎక్కువ సీట్లు గెల్చుకోవడంతో బిస్మార్క్ రాజీనామాచేసి అధికారం నుండి వైదొలిగాడు.

**4. పియరి జోసఫ్ ప్రౌధాన్ (1809-1865) :** ప్రౌధాన్ ఫ్రాన్సుకి చెందిన సామాజికవేత్త, ఆర్థికవేత్త, స్వేచ్ఛావాద సోషలిస్టు. విలియం గాడ్విన్ ప్రారంభించిన అరాచకవాద ఆలోచనకు అత్యంత ప్రాచుర్యం కల్పించినవాడు. బకూనిన్ ఈయనను తన గురువుగా ప్రకటించాడు. ప్రౌధాన్ ఆర్థిక, రాజకీయ, న్యాయపరమైన విషయాలపై విస్తృతంగా గ్రంధరచన చేశాడు. ప్రౌధాన్ ప్రధాన సైద్ధాంతిక భావనలు మూడు : అరాచకవాదం (రాజ్యరహిత సమాజం), పరస్పరాశ్రయవాదం (కార్మికులు తామే బ్యాంకుని స్థాపించి ఋణాలు ఇచ్చేందుకు సహకరించుకోవడం), సమాఖ్యవాదం (అధికార కేంద్రీకరణను వ్యతిరేకించడం). కార్మిక వర్గం తమ విముక్తి తామే సాధించుకోవాలన్న భావన ప్రౌధాన్‌లో బలంగా ఉంది. ప్రౌధాన్ రాసిన 'దారిద్ర్యపు తత్త్వశాస్త్రం' అనే పుస్తకాన్ని తీవ్రంగా విమర్శిస్తూ మార్క్స్ తన 'తత్త్వశాస్త్రపు దారిద్ర్యం' అనే పుస్తకాన్ని రాశాడు. వారిద్దరి మధ్య తీవ్రమైన భేదాభిప్రాయాలు ఉండేవి. వాటిలో రాజ్యం పట్ల అవగాహన ప్రధానమైనది. మొదటి ఇంటర్నేషనల్ స్థాపకులలో ప్రౌధాన్ ఆలోచనలతో ప్రభావితమైన వారు కూడా ఉన్నారు. వారి అవగాహన ఆంగ్లంలో మ్యూచువలిజం (పరస్పరాశ్రయవాదం)గా పిలువబడేది. క్రమేపీ వీరి ప్రభావం తగ్గి మార్క్స్ ఆలోచనల ప్రభావం పెరిగింది. ఫ్రెంచి కార్మికవర్గంపై ప్రౌధాన్ ప్రభావం 20వ శతాబ్దపు తొలి

సంవత్సరాల వరకు ఉండేది. ఈయన సిద్ధాంతాలలో ఉన్న ఆచరణ సాధ్యం కాని అవాస్తవిక ధోరణివల్ల అవి క్రమేపీ తమ ప్రభావశీలతను కోల్పోయాయి.

**5. రాబర్ట్ ఓవెన్ (1771-1858) :** రాబర్ట్ ఓవెన్ బ్రిటన్‌కి చెందిన పారిశ్రామికవేత్త, సంస్కర్త, సోషలిస్టు. పారిశ్రామిక నాగరికత కార్మికులను దుర్భరమైన పని పరిస్థితులు, పేదరికం, కనీస సౌకర్యాలు లేని జీవనానికి గురిచేయడాన్ని గమనించిన ఓవెన్, తాను నిర్వహిస్తున్న న్యూ లానార్క్ బట్టల మిల్లులో కార్మికులకు మెరుగైన గృహవసతి, విద్య, ఆరోగ్యం కల్పించడం ద్వారా ఒక నమూనాని నెలకొల్పాడు. ఇట్టి సమిష్టి జీవనాన్ని అమెరికాలోని న్యూ హార్మొనీ అనేచోట కూడ ఆయన నెలకొల్పాడు. 500 నుండి 3000 మంది వరకు ప్రజలతో ఇటువంటి సముదాయాలు ఏర్పడి అవి క్రమేపీ ప్రపంచవ్యాపితం కాగలవని ఆయన భావించాడు. సామాజికార్థిక పరిణామం పట్ల అవగాహనకంటే, ఆదర్శవాదం ప్రభావం ఓవెన్‌పై ఎక్కువగా ఉంది. ఈ ఆలోచనా ధోరణి, ఆచరణాత్మక కృషి ఊహాజనిత సోషలిజంగా పరిగణించబడింది. సంస్కరణ ద్వారా సమూల మార్పు సాధ్యమని ఈ ధోరణి భావిస్తుంది. ఇంగ్లండ్‌లో కార్మికోద్యమం 1830లలో ప్రారంభమైనప్పుడు ఓవెన్ భావాల ప్రభావం బలంగా ఉండేది. ఆయనను తమ నాయకుడిగా కార్మికులు భావించేవారు. పెట్టుబడిదారులు, ప్రభుత్వం, న్యాయస్థానాలు ముప్పేట దాడిచేయడంతో ఈ ఉద్యమం కొద్ది కాలంలోనే బలహీనపడింది. చివరి దశలో ఓవెన్ విద్య, నైతికత, హేతువాదం, వివాహ సంస్కరణలాంటి విషయాలపై తన భావాలను ప్రచారం చేయడానికి పరిమితమయ్యాడు.

**6. లూయీ అగస్టో బ్లాంక్వి (1805-1881) :** ఫ్రెంచి సోషలిస్టు. న్యాయబద్ధమైన సంపద పునః పంపిణీని కోరుకున్నాడు. అయితే కార్మికవర్గం ప్రధాన చోదకశక్తిగా సాగే ప్రజా పోరాటాలు మాత్రమే దానికి మార్గమనే అంశాన్ని బ్లాంక్వి అంగీకరించలేదు. సుశిక్షితులైన, అంకితభావం కలిగిన చిన్న విప్లవకారుల బృందం విప్లవాన్ని సాధించగలదనే అభిప్రాయం కలిగి ఉండేవాడు. విప్లవానంతరం ఈ బృందం లక్ష్యాల సాధన కోసం కొంతకాలం నియంతృత్వం పాటిస్తుందని, తదుపరి ప్రజలకు అధికారాన్ని అప్పగిస్తుందని పేర్కొన్నాడు. ఈ అవగాహనతో అనేక సందర్భాలను విప్లవ పోరాటాలుగా మార్చడానికి బ్లాంక్వి ప్రయత్నించాడు. 1839లో పారిస్‌లో ఒకసారి, తిరిగి 1870లో రెండుసార్లు ఇటువంటి ప్రయత్నాలు జరిగాయి. చిన్న బృందం నాయకత్వంలో జరిగే సాయుధ తిరుగుబాటు విప్లవానికి కీలకమనే ఈ అవగాహన బ్లాంక్విజంగా పరిగణించబడుతోంది. ఈ క్రమంలో దాదాపు సగం జీవితం బ్లాంక్వి జైళ్ళలో గడిపాడు. పారిస్ కమ్యూన్ సమయంలో కూడా జైలులో ఉన్నాడు. అందువలన ఆ పోరాటంలో

పాల్గొనలేకపోయాడు. అయితే అనేకమంది బ్లాంక్వీ అనుయాయులు ఇందులో చురుకుగా పాల్గొన్నారు. లక్ష్యాలకంటే పోరాటాన్నే ప్రధానంగా పరిగణించే ఈ ధోరణి, బలపడుతున్న జాతి రాజ్యాల క్రమంలో క్రమేపీ క్షీణించిపోయింది.

**7. అడాల్ఫ్ తీర్స్ (1797-1877) :** ఫ్రెంచి రాజకీయవేత్త, చరిత్రకారుడు. 1836, 1840, 1848లో ఫ్రాన్స్ ప్రధాన మంత్రిగా పనిచేశాడు. బూర్జువా వర్గ రాజకీయ ప్రతినిధులైన మితవాద ఉదారవాదులకు తీర్స్ నాయకుడు. 1848 పోరాటంలో సోషలిస్టులని తీవ్రంగా వ్యతిరేకించాడు. 1870లో జరిగిన ఫ్రెంచి – ప్రష్యన్ (జర్మన్) యుద్ధంలో ఫ్రాన్సు ఓడిపోయిన పిదన, ఫిబ్రవరి 1871లో తాత్కాలిక ప్రభుత్వానికి అధ్యక్షుడిగా ఎంచుకోబడ్డాడు. జర్మనీతో శాంతి ఒప్పందాన్ని కుదుర్చుకున్నాడు. యుద్ధం పర్యవసనాల నుండి ఫ్రాన్సు కోలుకునేందుకు అవసరమైన చర్యలు చేపట్టాడు. పారిస్‌లో కార్మికులు, నేషనల్ గార్డ్స్ ఉద్యమాన్ని అణచివేయడానికి ప్రయత్నించాడు. మార్చి 18, 1871న తీర్స్ నేషనల్ గార్డ్స్‌ని నిరాయుధులను చేయడానికి సైన్యాన్ని పంపాడు. ఈ ప్రయత్నం విఫలమైంది. తీర్స్ జాతీయ అసెంబ్లీని బోర్డాకి, ప్రభుత్వాన్ని, సైన్యాన్ని వెర్సైల్స్‌కి మార్చాడు. మార్చి 28, 1871న పారిస్ కమ్యూన్ ప్రకటించబడింది. వెర్సైల్స్‌లో ఉన్న తీర్స్ ప్రభుత్వంపై పోరాటం చేయకపోవడం పారిస్ కమ్యూన్ ప్రధాన వైఫల్యాలలో ఒకటి. తీర్స్ పంపిన సైన్యాలకు, కమ్యూన్ మద్దతుదారులకు ఏప్రిల్, మే అంతా యుద్ధం జరిగింది. చివరికి 28 మే, 1871న పారిస్ కమ్యూన్ ఓడిపోయింది. ఈ విధంగా మొట్టమొదటి కార్మికవర్గ ప్రభుత్వం అణచివేయబడింది. దాదాపు 20,000 మంది చంపివేయబడ్డారు. దానంతటికీ తీర్స్ సారధ్యం వహించాడు. 1873 వరకు ఫ్రెంచి అధ్యక్షుడుగా కొనసాగాడు.

**8. జిసెప్పీ మాజిని (1805-1872) :** ఇటలీ ఐక్యతకు కృషి చేసిన విప్లవకారుడు. రాచరికానికి బద్ధ వ్యతిరేకి. ఇటలీలో రిపబ్లికన్ ప్రభుత్వపు ఏర్పాటుకు కృషి చేశాడు. యంగ్ ఇటలీ అనే సంస్థని స్థాపించాడు. ఇటలీ ఐక్యతకు సాగిన రిసార్జిమెంటో ఉద్యమాన్ని సమర్ధించాడు. యంగ్ ఇటలీ ఉద్యమం విఫలమైన పిమ్మట 1837 నుండి లండన్‌లో ప్రవాస జీవితం గడిపాడు. 1848-49 విప్లవ కాలంలో ఇటలీకి తిరిగి వెళ్ళాడు. రోమ్ నుండి పోప్ తరిమివేయబడిన పిదప ఏర్పడిన రిపబ్లికన్ ప్రభుత్వానికి నాయకత్వం వహించాడు. మతపరమైన, సామాజిక విషయాలలో సంస్కరణలు తీసుకువచ్చాడు. ఈ ప్రభుత్వాన్ని పోప్ తరఫున వచ్చిన ఫ్రెంచి సైన్యాలు కూలదోశాయి. లండన్‌కి తిరిగి వెళ్ళిన మాజిని 1850 లలో కొన్ని తిరుగుబాటు ప్రయత్నాలకు మద్దతునిచ్చాడు. అవి విఫలమయ్యాయి. గారిబాల్డి దక్షిణ ఇటలీలో ప్రభుత్వాన్ని

ఏర్పాటచేసినప్పుడు మాజిని మద్దతునిచ్చాడు.కాని, రోమ్, వెనిస్ మినహా మిగతా ఇటలీ రాచరికంగా 1861లో ఏకమైనప్పుడు మాజిని దూరంగా ఉండిపోయాడు. లండన్‌లో మొదటి సోషలిస్ట్ ఇంటర్నేషనల్ ఏర్పడినప్పుడు మాజిని తొలిదశలో మద్దతు ప్రకటించాడు. అయితే మాజిని భావాలు ప్రధానంగా మత, నైతికపరమైనవి. అందువల్ల ఇంటర్నేషనల్‌కి దూరమయ్యాడు. చివరి దశలో ఇటాలియన్ కార్మికుల మహాసభ జరపడానికి ప్రయత్నించాడు. రోమ్, వెనిస్‌తో సహా ఇటలీ ఒక దేశంగా రూపొందాలని ఆకాంక్షించాడు. 1861లో రిపబ్లిక్‌కి బదులు రాచరిక ప్రభుత్వం ఏర్పడటం పట్ల తీవ్ర నిరాశ వ్యక్తం చేశాడు. మాజిని తన లక్ష్య సాధనలో విఫలమయ్యాడు. ఇటలీ ఆధునిక జాతి రాజ్యంగా ఏర్పడటంలో మాజిని కీలకపాత్ర వహించాడనేది అనేకమంది చరిత్రకారుల అభిప్రాయం.

**9. జిసెప్పీ గారిబాల్డి (1807-1882) :** ఇటాలియన్ విప్లవకారుడు, గెరిల్లా యుద్ధ నిపుణుడు. ఇటలీ ఐక్యతకోసం కృషి చేసిన జాతీయవాది. గారిబాల్డి తొలిదశలో మాజిని, సెయింట్ సైమన్ (ఫ్రెంచి సోషలిస్టు) భావాలతో ప్రభావితమయ్యాడు. పీమంట్‌లో 1834లో జరిగిన రిపబ్లికన్ తిరుగుబాటులో పాల్గొన్నాడు. అది విఫలమైన పిమ్మట 1836-1848 వరకు దక్షిణ అమెరికాలో జీవించాడు. అక్కడ బ్రెజిల్ సామ్రాజ్యానికి, అర్జెంటీనా ప్రభుత్వానికి వ్యతిరేకంగా పోరాటాల్లో పాల్గొన్నాడు. ఈ పోరాటాలన్నీ గారిబాల్డిని జీవితకాల పోరాట యోధుడిగా మార్చాయి. 1848-49 విప్లవ పోరాటాల్లో మిలన్‌లో మాజినికి మద్దతుగా నిలిచాడు. 1849లో ఫ్రెంచి సైన్యాలకు వ్యతిరేకంగా రోమ్ పరిరక్షణ కోసం పోరాడాడు. 1860ల తొలి దశలో ఇటాలియన్ ఐక్యత కోసం గారిబాల్డి పీమంట్-సార్డీనీయా రాజుతో చేతులు కలిపాడు. 1860లో గారిబాల్డి తన వాలంటీర్ సైన్యంతో సిసిలీ, నేపుల్స్‌లను జయించాడు. ఈ రెండు ప్రాంతాల ప్రజలు గారిబాల్డికి మద్దతు పలికారు. ఈ రెండు ప్రాంతాలు కూడా పీమంట్ - సార్డీనియా రాజు పరిపాలనలో ఉంటాయని గారిబాల్డి ప్రకటించాడు. ఈ క్రమం 1861లో ఇటలీలో అత్యధిక భాగం రాచరిక ప్రభుత్వం క్రింద ఐక్యం కావడానికి దారితీసింది. 1860 దశాబ్దం యావత్తు గారిబాల్డి అనేక యుద్ధాల్లో పాల్గొన్నాడు. 1870-71లో ఫ్రెంచి జాతీయ అసెంబ్లీలో సభ్యుడిగా ఉన్నాడు. చివరి దశలో తనని తాను సోషలిస్టుగా ప్రకటించుకున్నాడు. కాని మార్క్స్, బకూనిన్‌లు గారిబాల్డిని అలా గుర్తించలేదు. కార్మికుల, స్త్రీల విముక్తిని కోరుకున్నాడు. తన జీవితానుభవాల నుండి చివరిలో యుద్ధ వ్యతిరేకిగా మారాడు. ఇటలీ ఐక్యతలో గారిబాల్డి పాత్ర చిరస్మరణీయమైనదిగా పరిగణించబడింది.

**10. ఫ్రీడ్‌రిక్ అడాల్ఫ్ సోర్జ్ (1828-1906) :** జర్మన్ కమ్యూనిస్టు. 1848-49లో జరిగిన జర్మన్ విప్లవ పోరాటాలలో పాల్గొన్నాడు. అందుకుగాను మరణశిక్ష

విధించబడింది. స్విట్జర్లాండ్, బెల్జియంలలో ప్రవాస జీవితం గడిపాడు. ఈ రెండు దేశాలు బహిష్కరించిన పిదప, కొంతకాలం లండన్‌లో జీవించాడు. 1852లో అమెరికాకి వలస వెళ్ళాడు. జీవితాంతం అమెరికాలోనే గడిపాడు. 1865లో అమెరికన్ అంతర్యుద్ధం ముగిసిన పిమ్మట సోర్జ్ సోషలిస్టుగా చురుకుగా పనిచేయసాగాడు. కార్ల్ మార్క్స్ ఆలోచనలను అమెరికాలో ప్రచారం చేయసాగాడు. 1869లో మొదటి ఇంటర్నేషనల్‌కి అనుబంధంగా అమెరికన్ శాఖని స్థాపించాడు. 1870లో దాని సెంట్రల్ కమిటీ ఏర్పడింది. సెప్టెంబర్ 1871లో ఈ సంస్థ 8 గంటల పని దినాన్ని కోరుతూ, పారిస్ కమ్యూన్‌కి సంఘీభావం ప్రకటిస్తూ 20,000 మందితో ప్రదర్శన జరిపింది. 1872లో జరిగిన హేగ్ మహాసభలో ఇంటర్నేషనల్ ప్రధాన కార్యాలయం లండన్ నుండి న్యూయార్క్‌కి మార్చబడింది. 1872–74 మధ్య ఇంటర్నేషనల్ ప్రధాన కార్యదర్శిగా సోర్జ్ పనిచేశాడు. కాని క్రమేపీ ఇంటర్నేషనల్ క్షీణించిపోయింది. 1876లో ఈ సంస్థ లాంఛనప్రాయంగా రద్దు చేయబడింది. 1877లో సోర్జ్ అమెరికన్ సోషలిస్టు లేబర్ పార్టీ స్థాపనలో చురుకుగా పాల్గొన్నాడు. ఐరోపాకి అన్వయించే మార్క్సిస్టు ఆలోచనలను అమెరికాకి అన్వయించడంలో ఈ పార్టీ సఫలీకృతం కాలేదు. అందువల్ల కార్మికవర్గం ప్రధాన బూర్జువా వర్గ పార్టీలతోనే ఉండేవారు. 1883లో హోబోకిన్‌లో అంతర్జాతీయ కార్మిక యూనియన్ ఏర్పాటుకు సోర్జ్ కృషి చేశాడు. మార్క్స్, ఏంగెల్స్ ఇద్దరూ సోర్జ్‌ని తమకి అత్యంత సన్నిహితుడిగా భావించేవారు. అమెరికాలో ఆధునిక సోషలిజానికి ఆద్యుడిగా సోర్జ్ పరిగణించబడ్డాడు.

**11. సిజరె డు పాప్ (1841–1890) :** బెల్జియంలో జన్మించాడు. వృత్తిరీత్యా వైద్యుడు. సిండికలిస్టు భావాలు కలిగినవాడు. ఈయన భావాలు, కృషి సిండికలిస్టు ఉద్యమంపై బలమైన ప్రభావాన్ని నెరిపాయి. డు పాప్ మొదటి ఇంటర్నేషనల్‌లో చురుకైన పాత్ర వహించాడు. బ్రస్సెల్స్ సమావేశంలో ప్రౌధాన్ ఆలోచనా ధోరణిపై విజయం సాధించడంలో కీలకపాత్ర వహించాడు. 1872లో ఏర్పడిన ఇంటర్నేషనల్ చీలిక పిమ్మట మొదట్లో మార్క్స్‌ని వ్యతిరేకించినప్పటికీ, క్రమేపీ కార్మిక రాజ్య స్థాపన అవసరమనే అభిప్రాయానికి వచ్చాడు. కార్మికవర్గ విప్లవం సాయుధ తిరుగుబాటుని చేపట్టడాన్ని డు పాప్ తిరస్కరించినప్పటికీ, క్రమానుగతమైన మార్పు స్థిరమైన ఫలితాలకు దారితీస్తుందని అభిప్రాయపడ్డాడు.

**12. పీటర్ క్రొపోట్కిన్ (1842–1921) :** రష్యన్ శాస్త్రవేత్త, ఆర్థికవేత్త, అరాచకవాద తత్వవేత్త. అత్యున్నత స్థాయి కులీన వర్గంలో జన్మించాడు. కౌమారదశలోనే ప్రజాస్వామ్య భావాలతో ప్రభావితుడై తన శిష్టవర్గ గుర్తింపుని వదలుకున్నాడు. యవ్వనదశలోనే

రైతాంగ స్థితిగతుల పట్ల సానుభూతితో కూడిన ఆసక్తి కలిగి ఉండేవాడు. రష్యన్ సైన్యంలో కొంతకాలం పనిచేశాడు. విధులలో భాగంగా సైబీరియాలో పని చేసినప్పుడు రైతాంగ జీవనాన్ని, సమస్యలను మరింతగా ఆకళింపు చేసుకున్నాడు. 18వ శతాబ్ది ఫ్రెంచి తత్వవేత్తలు, ప్రౌధాన్, జాన్ స్టూవర్ట్ మిల్, అలెగ్జాండర్ హెర్జెన్ తదితరుల రచనలను అధ్యయనం చేశాడు. ఆ అధ్యయనాలు, రైతాంగంపట్ల తనకున్న సానుభూతి మూలంగా 1872లో తనని తాను అరాచకవాదిగా ప్రకటించుకున్నాడు. మరోప్రక్క భౌగోళిక శాస్త్రంలో ఉన్నతస్థాయి పరిశోధనలు సాగించేవాడు. 1867లో సైన్యం నుండి బయటకు వచ్చాడు. సెయింట్ పీటర్స్‌బర్గ్‌లో ఒక విప్లవ బృందంలో సభ్యుడిగా చేరాడు. 1872లో మొదటి ఇంటర్నేషనల్‌లో సభ్యుడిగా చేరాడు. కాని, దాని విధానాలతో ఏకీభవించలేకపోయాడు. ఇంటర్నేషనల్‌లో సభ్యత్వం ఉన్న స్విట్జర్లాండ్‌లోని జూరా సమాఖ్యతో సన్నిహిత సంబంధాలు కలిగి ఉండేవాడు. 'కాంక్వెస్ట్ ఆఫ్ బ్రెడ్', 'మూచుయల్ ఎయిడ్ : ఎ ఫాక్టర్ ఆఫ్ ఎవల్యూషన్', 'ఫీల్డ్స్, ఫాక్టరీస్, వర్క్‌షాప్స్' లాంటి పుస్తకాలలో తన భావాలను వివరించాడు. సామాజిక జీవనాన్ని మనుగడకై పోరాటంగా చెప్పే సోషల్ డార్వినిస్టు అవగాహనని ఖండిస్తూ, పోటీని కాకుండా సహకారాన్ని సమాజ చోదక శక్తిగా పరిగణించాడు. అనార్కిజం (అరాచకవాదం)లో ఉన్న వ్యక్తివాదాన్ని అధిగమించి సమిష్టివాదాన్ని ప్రతిపాదించాడు. అయితే, మార్క్స్ ప్రతిపాదించిన తరహా సమిష్టి వ్యవస్థ కాకుండా, చిన్న స్వయం ప్రతిపత్తికల సమూహాలుగా సామాజిక జీవనాన్ని చూశాడు. తన అనార్కిస్టు భావజాలంవల్ల అక్టోబరు 1917 విప్లవాన్ని వ్యతిరేకించాడు.

**13. విల్‌హెల్మ్ లీబెక్‌నెక్ట్ (1826-1900) :** జర్మన్ సోషల్ డెమొక్రాట్, జర్మన్ సోషల్ డెమొక్రటిక్ పార్టీ వ్యవస్థాపకులలో ఒకరు, నిబద్ధ తొలితరం మార్క్సిస్టు. విద్యార్థిగానే రాడికల్ రాజకీయాలవైపు ఆకర్షితుడయ్యాడు. 1848-49లో ఫ్రాన్స్, జర్మనీలలో జరిగిన విప్లవ పోరాటాల్లో పాల్గొన్నాడు. అవి విఫలమైన పిదప స్విట్జర్లాండ్‌లో ప్రవాస జీవితం గడిపాడు. అక్కడ కార్మికోద్యమంలో పనిచేసినందుకు బహిష్కృతుడై 1850 నుండి 1862 వరకు లండన్‌లో ఉన్నాడు. కమ్యూనిస్టు లీగ్‌లో సభ్యుడిగా చేరాడు. మార్క్స్‌తో జీవితకాల స్నేహం ఇక్కడే ప్రారంభమయింది. 1862లో జర్మనీకి తిరిగి వచ్చి లాసాల్ స్థాపించిన కార్మికవర్గ పార్టీలో సభ్యుడిగా చేరాడు. 'సోషల్ డెమొక్రాట్' పత్రికలో వ్యాసాలు రాసేవాడు. పత్రిక విధానాలతో విభేదించి ప్రతిక నుండి బయటకు వచ్చాడు. 1867లో అగస్ట్ బేబెల్‌తో కలిసి శాక్సన్ పీపుల్స్ పార్టీ స్థాపించాడు. 1869లో జర్మన్ సోషల్ డెమొక్రటిక్ పార్టీ స్థాపన కోసం చురుకుగా కృషి చేశాడు. జర్మన్ పార్లమెంటులో సభ్యుడిగా బిస్మార్క్ విధానాలను దృఢచిత్తంతో ఎదుర్కొన్నాడు. పార్టీ పత్రిక 'ది పీపుల్స్ స్టేట్' కి సంపాదకుడిగా

ఉన్నాడు. 1870లో ఫ్రాన్స్ – ప్రష్యా యుద్ధం ప్రారంభమయినప్పుడు పత్రిక ద్వారా, ఇతర మార్గాలలో యుద్ధాన్ని వ్యతిరేకిస్తూ ప్రచారం చేశాడు. ఇరుదేశాల కార్మిక వర్గాలకు తమ పాలకవర్గాలను అధికారం నుండి కూలద్రోయవలసిందిగా పిలుపునిచ్చాడు. ఈ విప్లవాత్మక అంతర్జాతీయ దృష్టిని 1914లో ప్రారంభమైన మొదటి ప్రపంచయుద్ధంలో జర్మన్ సోషల్ డెమొక్రటిక్ పార్టీ చూపలేకపోయింది. యుద్ధాన్ని వ్యతిరేకించినందుకుగాను లీబ్‌క్‌నెక్ట్, బేబెల్ రెండేళ్ళ జైలు శిక్ష అనుభవించారు. తన జీవిత కాలంలో మొత్తం 16 సార్లు ఈయన జైలుశిక్ష అనుభవించాడు. 1875లో గోతాలో జరిగిన సమావేశంలో లాసాల్ స్థాపించిన పార్టీ, సోషల్ డెమొక్రటిక్ పార్టీ ఏకమయ్యాయి. ఈ పార్టీని జర్మన్ సోషలిస్టు వర్కర్స్ పార్టీగా పిలిచేవారు. ఈ పార్టీకి రాసిన కార్యక్రమాన్నే మార్క్స్ అత్యంత నిశితంగా విమర్శించాడు. 1878 నుండి 1990 వరకు జర్మనీలో ఈ పార్టీ నిషేధానికి గురయింది. అయినా ఎన్నికలలో పాల్గొనే అవకాశం ఉండేది. పార్టీ బలం క్రమేపీ పెరుగుతూ 1890 ఎన్నికలలో 20% ఓట్లు సాధించింది. ఈ విజయం బిస్మార్క్ అధికారాన్ని కోల్పోవడానికి దారితీసింది. 1890లలో లీబ్‌క్‌నెక్ట్ పార్టీ పత్రిక 'ఫార్వర్డ్'కి సంపాదకుడిగా ఉన్నాడు. పార్లమెంట్ సభ్యుడిగా కొనసాగాడు. పార్టీని బలోపేతం చేయడానికి అవిరళ కృషి జరిపాడు. 1891లో పార్టీ కార్యక్రమాన్ని నిబద్ధ మార్క్సిస్టు అవగాహనతో పరిపుష్టం చేయడంలో కీలకపాత్ర వహించాడు. రెండవ ఇంటర్నేషనల్ స్థాపనలో పాలుపంచుకొన్నాడు. జర్మన్ సోషల్ డెమొక్రటిక్ పార్టీ దేశంలోనే అతి పెద్ద పార్టీగా రూపొందడంలో లీబెక్‌నెక్ట్‌ది అత్యంత ప్రధాన పాత్రగా పరిగణించబడింది. తదుపరి కాలంలో ఈ పార్టీ మార్క్సిస్టు స్ఫూర్తికి దూరమై, చీలికలు పీలికలై 1919 విప్లవ పోరాటంలో విఫలం కావటం, అంతిమంగా హిట్లర్ ఆవిర్భవించడం చరిత్రలోని విషాదాలలో ఒకటి.

**14. సెర్జీ నిచాయెవ్ (1847–1882) :** రష్యన్ తీవ్రవాద విప్లవకారుడు. విప్లవ లక్ష్యం కోసం భయోత్పాతంతో సహా ఎటువంటి పద్ధతులనైనా అనుసరించవచ్చని ప్రకటించాడు. వ్యావసాయక అర్ధ బానిసల కుటుంబంలో పుట్టిన నిచాయెవ్‌కి చిన్నతనంలోనే సామాజిక అసమానతలు అనుభవమయ్యాయి. కులీన వర్గాల పట్ల వ్యతిరేకత పెంపొందింది. 1865లో తొలుత మాస్కోకి తదుపరి సెయింట్ పీటర్స్‌బర్గ్‌కి వెళ్ళాడు. అక్కడ డిసెంబ్రిస్టులు, బకూనిన్‌ల రచనలతో పరిచయం ఏర్పడింది. విద్యార్థి రాజకీయాలలో పాల్గొనసాగాడు. రష్యన్ మార్క్సిస్టు వెరా జసూలిచ్‌తో కలిసి విద్యార్థులకు విప్లవ సాహిత్యాన్ని పరిచయం చేసే కార్యక్రమాలు నడిపాడు. తొలిదశ నుండే తన లక్ష్యం నెరవేరడం కోసం తప్పుడు సమాచారం ప్రచారం చేసేవాడు. 1869లో జెనీవాకి

వెళ్ళాడు. అక్కడ అనార్కిస్టు నాయకులు బకూనిన్, ఓగరెవ్‌లతో సన్నిహిత సంబంధాలు ఏర్పడ్డాయి. ముఖ్యంగా బకూనిన్ నిచాయెవ్‌ని విప్లవాత్మక రష్యన్ యువతకు సిసలైన ప్రతినిధిగా భావించేవాడు. 1869లో 'కాటకిజమ్ ఆఫ్ ఎ రివల్యూషనరీ' అనే పుస్తకం రాశాడు. ఈ రచన తరువాతి కాలంలో కూడా ప్రభావాన్ని నెరపింది. దానిలోనే లక్ష్య సాధనకు ఎటువంటి పద్ధతులనైనా అనుసరించవచ్చనే తన అవగాహనని పేర్కొన్నాడు. చర్చిని, రాజ్యాన్ని బద్దలు కొట్టాలంటే విప్లవకారుడు వ్యక్తిగత జీవితం పూర్తిగా త్యజించి విప్లవం కోసమే జీవించాలని చెప్పాడు. నిచాయెవ్‌లోని నిర్హేతుక తీవ్రవాదం కూడా ఈ రచనలో ప్రతిఫలించింది. సామాన్య ప్రజలు తిరగబడేటట్లు ప్రేరేపించబడడానికిగాను వారి బాధలను, కష్టాలను మరింత పెంచాలని అన్నాడు. రాటుదేలిన నేరస్తులను కూడా విప్లవానికి ఉపయోగించుకోవాలని పేర్కొన్నాడు. నిచాయెవ్ ఒక వ్యాసంలో భవిష్యత్ సమాజాన్ని తానెలా చూస్తున్నాడో రాశాడు. దానిని మార్క్స్, ఏంగెల్స్‌లు, 'కందకాల (బారక్స్) కమ్యూనిజం'గా విమర్శించారు. నిచాయెవ్ పదేపదే అసత్య ప్రచారానికి పాల్పడేవాడు. అయినప్పటికీ బకూనిన్ అతనికి దూరంగా జరిగినప్పటికీ పూర్తిగా తెగతెంపులు చేసుకోలేదు. మొదటి ఇంటర్నేషనల్ నుండి బహిష్కరించబడ్డాడు. నిచాయెవ్ పద్ధతుల, భావాలవల్ల రష్యన్ విప్లవోద్యమం నష్టపోయింది. తనతో విభేదించినందుకుగాను ఒక సహచరుడ్ని హత్య చేశాడు. ఇందుకు 1873లో నిచాయెవ్‌కి 20 ఏళ్ళ జైలు శిక్ష విధించబడింది. 1882లో జైలులోనే మరణించాడు.

**15. జాన్ స్టువర్ట్ మిల్ (1806-1873) :** ఇంగ్లీషు ఆర్థికవేత్త, తత్వవేత్త, రాజనీతి సిద్ధాంతవేత్త. తండ్రి జేమ్స్ మిల్ శిక్షణలో అత్యంత చిన్న వయసులో తత్వశాస్త్రం, తర్కశాస్త్రం అధ్యయనం చేశాడు. గ్రీకు తత్వవేత్తలను గ్రీకు భాషలో అధ్యయనం చేశాడు. ఆడమ్ స్మిత్, డేవిడ్ రికార్డోల రాజకీయార్థశాస్త్ర రచనలను చదివాడు. ఉపయోగితవాదులు (యుటిలిటేరియన్స్) జెరెమీ బెంతమ్, జేమ్స్ మిల్ (తండ్రి) రచనలను అధ్యయనం చేశాడు. ప్రకృతి శాస్త్రాలను, గణిత శాస్త్రాన్ని కూడా అధ్యయనం చేశాడు. ఈ అధ్యయనాలలో ఎక్కువ భాగం 17వ సంవత్సరం వచ్చేనాటికే పూర్తి చేశాడు. 1823లో ఈస్ట్ ఇండియా కంపెనీలో ఉద్యోగిగా చేరి, 1858లో కంపెనీ రద్దయ్యేనాటికి దాని ఎక్జామినర్ కార్యాలయానికి ప్రధాన పాలనాధికారిగా పదవీ విరమణ చేశాడు. ఉదారవాద తత్వవేత్తగా పేరుబడ్డ మిల్ బ్రిటీష్ వలసవాద యంత్రాంగంలో ఎటువంటి నైతిక సమస్యలు లేకుండా పనిచేసినట్లనిపిస్తుంది. మిల్ ప్రధానమైన మేధోకృషి ఆర్థిక, రాజకీయ శాస్త్రాలలో ఉంది. రాజకీయ తత్వశాస్త్రం చేయాల్సిన పని నమూనా వ్యవస్థల్ని రూపొందించటం కాక, ఏ పరిస్థితులకైనా అనుగుణమైన వ్యవస్థల్ని నిర్మించుకునే సైద్ధాంతిక సూత్రాల్ని

అందించడం అని మిల్ పేర్కొన్నాడు. నూటిలో ఒక్కడిగా మైనారిటీలో ఉన్న వ్యక్తికి భావ వ్యక్తీకరణ స్వేచ్ఛ ఉండాలని పేర్కొన్నాడు. స్త్రీలకు ఓటుహక్కు కోసం వాదిస్తూ 'ది సబ్జెక్షన్ ఆఫ్ ఉమన్' అనే గ్రంధాన్ని రచించాడు. స్త్రీల ఓటుహక్కు కోసం పనిచేసే సంఘం స్థాపకులలో మిల్ ఒకరు. ఆర్థికశాస్త్రంపై తన అవగానను పేర్కొంటూ 'ప్రిన్సిపుల్స్ ఆఫ్ పొలిటికల్ ఎకానమీ' అనే గ్రంధాన్ని రచించాడు. సోషలిస్టు సిద్ధాంతవేత్తల రచనల్ని చదివాడు. సోషలిజాన్ని అంగీకరించక పోయినప్పటికీ, శ్రామిక వర్గాన్ని పేదరికానికి, దుర్భర జీవనానికి గురిచేస్తున్న పంపిణీ విధానాన్ని వ్యతిరేకించాడు. సహకార వ్యవసాయాన్ని సమర్ధించాడు. తర్కశాస్త్రంలో నిగమన పద్ధతిని విలువైనదిగా పరిగణించాడు. ఆగమన పద్ధతి దానికి అనుబంధంగా ఉండాలని పేర్కొన్నాడు. వేదనాభరితమైన జీవితం గడుపుతున్న మానవాళిపై పురోహిత వర్గాన్ని విధించే వ్యవస్థగా మతాన్ని విమర్శించాడు. అమెరికన్ అంతర్యుద్ధంలో బానిసత్వం రద్దుని సమర్ధించాడు. ఉదారవాద సిద్ధాంతవేత్తగా మిల్‌కి గుర్తింపు ఉన్నప్పటికీ, తత్వశాస్త్రంలో కాని, ఆర్థికశాస్త్రంలో కాని మిల్‌ది మౌలికమైన కృషి కాదనే అభిప్రాయం కూడా ఉంది.

******

## మొదటి ఇంటర్నేషనల్ : చారిత్రక సమీక్ష

మార్సెల్లో మస్తో



అంతర్జాతీయ కార్మికోద్యమ ప్రస్థానంలో మొదటి ఇంటర్నేషనల్ స్థాపన (1864) ఒక ప్రధాన ఘట్టం. తమ వర్గ విముక్తికి, అలానే యావత్ సమాజ విముక్తికి కార్మిక వర్గమే చోదక శక్తిగా ఉండగలదని ప్రతిపాదించిన మార్క్స్, ఏంగెల్స్‌లు సంస్థ అభివృద్ధిలో కీలక పాత్ర వహించారు. మొదటి ఇంటర్నేషనల్ స్థాపించి 150 సంవత్సరాలు పూర్తయిన సందర్భంగా కార్మిక వర్గం స్వీయ చైతన్యాన్ని పొందడంలో మొదటి ఇంటర్నేషనల్ పాత్రను సమీక్షిస్తూ ఈ పుస్తకంలో మార్సెల్లో మస్తో లోతైన విశ్లేషణను అందించారు.

--- ---

కెనడా రాజధాని టోరంటోలోని యార్క్ విశ్వవిద్యాలయంలో మార్సెల్లో మస్తో సామాజిక శాస్త్ర సిద్ధాంతాన్ని బోధిస్తున్నారు. అతని గ్రంథాలు, వ్యాసాలు ప్రపంచవ్యాపితంగా ఇరవై భాషలలో ముద్రితమయ్యాయి. సంపాదకులుగాను, సహరచయితగాను ఆయన వెలువరించిన రచనలలో ముఖ్యమైనవి కొన్ని :1) **కారల్ మార్క్స్ 'గ్రుండ్రిస్సె' 150 సం॥రాల తరువాత రాజకీయ అర్థశాస్త్ర పునాదులు** (2008); 2) **మార్క్స్ ఫర్ టుడే** (2012); 3) **నూటయాభై సం॥రాల తరువాత ప్రథమ ఇంటర్నేషనల్ : శ్రమ, పెట్టుబడి** (2015). వీటిని ప్రతిష్టాత్మకమైన రౌట్‌లెడ్జ్ ప్రచురణ సంస్థ ముద్రించింది. గతంలో ఆంగ్లంలోనికి రాని మొదటి ఇంటర్నేషనల్ పత్రాలతో **కార్మికులారా ఏకం కండి! 150 సం॥రాల తరువాత మొదటి ఇంటర్నేషనల్** పేరుతో 2014లో బ్లూమ్స్‌బరి ప్రచురణ సంస్థ ద్వారా మస్తో ఒక సంపుటిని వెలువరించారు. ఇదే సంస్థ ద్వారా 2017లో **మరో మార్క్స్ : మేథో జీవితం పై ఒక వ్యాసం** పేరుతో మరో గ్రంథాన్ని ప్రచురించబోతున్నారు. అలానే ఫ్లుటో ప్రచురణ సంస్థ ద్వారా **మార్క్స్ పెట్టుబడి రూపకల్పన** పేరుతో 2017లో ఒక పుస్తకాన్ని తేనున్నారు. **మార్క్స్ పునరుద్ధరణ : నూతన భావనలు, సరికొత్త విమర్శలు** పేరుతో కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయ ప్రచురణాలయం ద్వారా 2017లో మరో పుస్తకాన్ని ముద్రించనున్నారు. ప్రస్తుత పుస్తకాన్ని ఎస్.రామచంద్రరావు తెలుగులోనికి అనువదించారు.

